అపరాధ పరిశోధన అనుబంధం—116

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## వన మూలికలు
రచన: బి. రాజేశ్వరి

## లిల్లీ
రచన: వసుంధర

## గాలి కోడి-గాజు కన్ను
రచన: అజీజ్

## బందిపోటు నాయకుడు
రచన: బొమ్మిడి అచ్చారావు

విష సర్పాలు - ఆరవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్ — 116
ఆగష్టు, 1983
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# వన మూలికలు

బి. రాజేశ్వరి

"మా ప్రొఫెసర్ గారు నిన్నట్నుంచీ కనిపించటంలేదు"

అన్నాడు భార్గవ.

"వ్వాట్? ఎక్కడికి వెళ్ళారో చెప్పలేదా?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు మౌళి.

"ఏం పనిమీదో చెప్పారు, ఎక్కడికో చెప్పలేదు, కాని నేను గ్రహించాను."

"ఎక్కడికి వెళ్ళారు?"

"మా రిసెర్చికి కావలసిన కొన్ని మూలికలు సేకరించటానికి ఫారెస్టుకి వెళ్ళారు."

"ఏ ఫారెస్టు?"

"దగ్గరలో వున్న ఏజన్సీ ఏరియాకి కావచ్చునని వూహిస్తున్నాను."

"ఎప్పుడు వెళ్ళారు?"

"నిన్న తెల్లవారు ఝామున."

"కార్లో వెళ్ళారా?"

## 4

"లేదు. కారు తీసుకు వెళ్ళలేదు. బహుశా బస్‌కి వెళ్ళారని అనుకున్నాను."

"అంటే బస్ ఫెసిలిటీ వున్న ఏజెన్సీ ప్రాంతానికే వెళ్ళి వుండొచ్చునని మనం వూహించవచ్చు."

"కేవలం ఊహ మాత్రమే! ఆయన ప్రయాణం ఎలా వుంటుందో మన వూహాకందదొక్కోసారి. ఒక్కోసారి కాలినడకన ఎంతదూరమైనా వెళ్ళిపోతారు. ఒకోసారి-కనీసం పదిగజాలైనా లేని దూరానికి కార్లోనే వెళ్తారు. కాలు కింద పెట్టరు. యెలా నిర్ణయించగలం?"

"ఓ.కే. మన పరిశోధన మొదలు పెట్టడానికి ఏదోక ఆధారం కావాలికదా? ఇలా జరిగివుండొచ్చునని మనం ఓ కన్‌క్లూజన్‌కి రావటం చాలా అవసరం. అప్పుడు ప్రొఫెసర్ గారిని వెదకటం సులభమవుతుంది."

భార్గవ నవ్వాడు. "ఎంతయినా రిసెర్చి స్టూడెంటువి కదా, రీజనింగ్ బాగా అలవడింది" అన్నాడు.

షాలి తను కూడా నవ్వేస్తూ, "నేనింకా రిసెర్చి చేస్తున్నాను గాని నువ్వయితే అల్రెడీ డాక్టరేటు తీసుకున్నావు. ప్రొఫెసర్‌కి అసిస్టెంట్‌వయ్యావు. యూ ఆర్ బెటర్ దన్ మి!" అన్నాడు.

"మనం స్నేహితులం. ఒకరినొకరు పొగుడుకోవటం కాదు, జరగాల్సింది చూడు!"

"అయామ్ రెడీ! బ్రహ్మచారిని, నా గురించి చూసే వాళ్ళెవరు? యెక్కడికి పోవాలన్నా పోగలను, ఎప్పుడు రావాలన్నా రాగలను. నువ్వే ఆలోచించుకోవాలి!"

"నాకు మాత్రం మా అమ్మ తప్ప ఎవరున్నారు? ఆమెకు చెప్పే వచ్చాను. ప్రొఫెసర్ జయవంత్ గారి భార్య, పాపం చాలా కంగారు పడ్తున్నారు. ఆయన

పిల్లలిద్దరు కూడా తండ్రి రాత్రి రాకపోవటంతో బెంగ పడినట్లే కనిపించారు. చెప్పకపోవటమేం, నాక్కూడా మనసులో ఓ మూల భయంగాను, దిగులుగాను వుంది."

"అయితే ఆలస్యం దేనికి? పద వెళ్దాం" లేచాడు మాళి. భార్గవ అనుసరించాడు.

## 2

"తెల్లవారు ఝామున నువ్వు చెప్పిన టైంకి వున్నది ఒకే ఒక బస్సు—ఏజెన్సీ పోయేది!" అన్నాడు మాళి.

"అవును, అది మారేడుమిల్లి వెళ్తుందని చెప్పాడు కదా, కంట్రోలరు!" భార్గవ అన్నాడు.

"దీన్నిబట్టి ప్రొఫెసర్ గారు మారేడుమిల్లి వెళ్ళి వుండవచ్చునని వూహించవచ్చు!"

"అయితే మనము ముందు మారేడుమిల్లి పోయి చూద్దామా?"

"ఇక అదే చెయ్యాలి! మారేడుమిల్లి యిప్పుడిప్పుడు బాగా డెవలప్ అవుతోంది. ఇదివరకు రోడ్డుమీద అడ్డుగా పెద్ద పులులు, ఎలుగుబంట్లు పడుకుని వుండేవని రాత్రిళ్ళు ఎవరూ ఇల్లు వదిలి బయటకొచ్చేవారు కాదని చెప్పుండేవారు. ఇప్పుడు అంత ప్రమాదం లేదనుకుంటాను."

"ముందు ప్రొఫెసర్ గారు నిన్న ఆ బస్‌లో ప్రయాణం చేశారో, లేదో కనుక్కుంటే మంచిది కదూ!"

"ఎవరు చెపుతారు? ఆ డ్రైవరు, కండక్టరు ఎవరో, యీ సమయంలో యెక్కడున్నారో యెలా తెలుసుకునేది?"

"అదీ నిజమే! బస్టాండులోని పోర్టరుగాని, రిక్షా వాళ్ళుగాని యెవరైనా చూశారేమో అడుగుతాను" అన్నాడు భార్గవ.

ఓ అరగంట సేపు ఎంక్వయిరీ చేసినా ఏమీ ప్రయోజనం లేకపోయింది. ప్రొఫెసర్ జయవంత్ ని చూసిన వాళ్ళెవరూ లేరు.

భార్గవకి నీరసం వచ్చేసింది.

మాళి నవ్వాడు. "ఓ అరగంటలో బస్ వుంది. వెళ్ళి చూసొద్దామా?" అన్నాడు.

"ఓ.కే!....ప్రొఫెసర్ గారు మారేడుమిల్లే వెళ్ళారని ఎలా నిర్ణయించటం? ఇంకా యీ చుట్టుపట్ల అడవులు వున్నాయి కదా!"

"దేవీపట్నం ఏరియాలో కూడా అడవులున్నాయి. ఒకవేళ ప్రొఫెసర్ గారు అక్కడికి వెళ్ళుంటే....?"

"మారేడుమిల్లి నుంచి అక్కడికి కూడా బస్ సౌకర్యం వున్నది. అక్కడినుంచి అలా దేవీపట్నం ఏజెన్సీ ఏరియా కూడా వెరిఫై చేసుకుందాం!"

"సరే, ముందు మారేడుమిల్లి వెళ్దాం."

ఓ అరగంట తర్వాత బస్ మారేడుమిల్లి బయల్దేరింది.

## 3

బస్ దిగేసరికి మధ్యాహ్నం పన్నెండు కావస్తోంది. మారేడుమిల్లి మరీ వెనకబడిన ఫారెస్టు ఏరియా కాదు. అక్కడ గిరిజన కోపరేటివ్ స్టోర్సు, ఆసుపత్రి, హైస్కూలు యింకా చాలా సౌకర్యాలు వచ్చేశాయి. ప్రభుత్వోద్యోగులు వుండటానికి క్వార్టర్సు కూడా వెలిశాయి.

మారేడుమిల్లిని ఆనుకుని అనేక కుగ్రామాలు వున్నాయి. కొండలు, మిట్టలు, చిన్న చిన్న వాగులు అనేకం.

బస్ దిగుతునే భార్గవ జయంత్ గురించి ఎంక్వయిరీ

చేశాడు. పోలికలు చెప్పినా యెవరూ మాకు తెలియదంటే మాకు తెలీదన్నారు. అలాంటి గుర్తులున్న మనిషిని ఆ ప్రాంతాల తాము చూడలేదని చాలామంది గిరిజనులు, అక్కడ నివాసముంటున్న ఉద్యోగులు చెప్పారు.

"వీళ్ళందరు యింత ఖచ్చితంగా చెప్తున్నారంటే బహుశా మీ ప్రొఫెసర్ యిక్కడికి వచ్చివుండడు" అన్నాడు మాళి.

భార్గవ సాలోచనగా తలూపాడు. "చుట్టుపక్కల యెక్కడయినా వెతుకుతున్నారేమో! లేదా మారేడుమిల్లి వచ్చేలోపల మనకు రంపచోడవరం వంటి మరికొన్ని ఏజెన్సీ ప్రాంతాలు కనబడ్డాయి కదా! అక్కడెక్కడైనా మధ్యలో దిగిపోయారేమో!" అన్నాడు.

మాళి కూడా ఆలోచిస్తున్నాడు.

"ఈ చుట్టుపట్ల ఫారెస్టు యెంతవరకు వ్యాపించి వుంది?" అనడిగాడు భార్గవ-కోఆపరేటివ్ స్టోర్సు ఉద్యోగి నుద్దేశించి.

అతను వెంటనే, "అబ్బో, చాలా మైళ్ళుంది సార్! కొన్ని కొన్ని గ్రామాలకు-అంటే చిన్న చిన్న గూడెల మాదిరుంటాయి—కాలినడకన కూడా వెళ్ళలేం. ఎక్కే కొండ, దిగే కొండ. క్రూరజంతువులు కూడా మస్తుగా వుంటాయి. ఈ ఏరియాలో నివసించటానికి అలవాటుపడ్డ వాళ్ళు తప్ప, చీకటిపడితే ఎవరూ అటు వెళ్ళరు. వెళ్తే ప్రాణాలతో బయటపడరు!" అన్నాడు.

"చీకటిపడ్డాక పెద్దపులులవీ తిరుగుతాయంటారు, నిజమేనా?"

"పెద్దపులులే కాదు, చిరుతలు, ఎలుగ్గొడ్లు చాలా

భయంకరమైన తోడేళ్ళు, అడవి దున్నలు—ఒకటేమిటి, రకరకాల క్రూరజంతువులు. రెండు రోజుల క్రితం ఓ మనిషిని చంపి తినేశాయి."

వింటున్న శ్రోతలిద్దరు ఉలిక్కిపడ్డారు.

"చంపేశాయి? ఎవరతను? ఎక్కడివాడు?" భార్గవ గొంతు తడారిపోయింది.

"అతను ఫారెస్టుగార్డు. పాపం నిండా పాతికేళ్ళు కూడా వుండవు సార్! ఆర్నెళ్ళక్రితమే పెళ్ళయింది. భార్యని కాపరానికి తీసుకొచ్చి రెండు నెలలయింది. ఇంతలోనే నూరేళ్ళు నిండిపోయాయి. ఆమె జీవితం మోడయిపోయింది."

"మరి యీ జంతువుల్ని యెవరూ చంపరా?"

"చంపటానికి వీల్లేదుగదా సార్! వన్యమృగ సంరక్షణ చట్టముంది కదండీ! చంపినవాడికి జైలు శిక్ష వేస్తారని భయపడి యెవ్వరూ వాటి జోలికి పోరు!"

"ప్రాణ రక్షణ కోసం కూడా చంపకూడదా?"

"చంపకూడదనే అంటారండి. కాని మరీ మారుమూల అడవిలో గూడెపోళ్ళు చంపేస్తుంటారండి! ఇంకా ఏనుగులు, దుప్పులు, లేళ్ళు కూడా చాలా వున్నాయండి. కొన్ని లెక్కలు వేశారు ప్రభుత్వం. చాలా జంతువులు యింకా లెక్కకు రానివి ఎన్నో వున్నాయి" అన్నాడు ఆ ఉద్యోగి.

భార్గవ తలూపి, ఈ ప్రాంతాల వనమూలికలు అవీ విస్తారంగా దొరుకుతాయా?" అనడిగాడు.

"ఇక్కడికి దగ్గరలో కుట్రవాడ, రామన్నగూడెం ప్రాంతాల్లో దొరుకుతాయండి. చాలామంది ఆయుర్వేద మందుల్లోకి వాడటానికి మూలికలు, వేర్లు తీసుకుపో

తుంటారండి."

"షట్రవాడ, ఆ గూడెం యిక్కడికి ఎన్ని మైళ్ళ దూరంలో వున్నాయి?"

"దాదాపు నాలుగు మైళ్ళుండొచ్చు. అంతా డొంక దారి, మెట్టదారీనండి. మీరు వెళ్ళలేరు."

"బస్ సౌకర్యం అదీ...."

"అ దడగొద్దండి. కాలినడకే శరణ్యం."

"ఆ రెండు గ్రామాలు కాక మరింకేవీ లేవా మూలికలు దొరికేవి?"

"దేవీ పట్నం ప్రాంతాల్లో కూడా దొరుకుతాయని విన్నాను. అక్కడినుంచి అదంతా గోదావరి తీర ప్రాంతం. లాంచీలమీద ప్రయాణంచేసి వెళ్తుంటారు. అక్కడినుంచి రాజమండ్రి, భద్రాచలం ఇంకా ఎన్నో. తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాల తీరప్రాంతాలకు లాంచీలమీదే ఎక్కువగా ప్రయాణాలు చేస్తుంటారు" అన్నాడతను.

"చాలా మంచి విషయాలు చెప్పారండీ! మేమిద్దరం రాజమండ్రినించే వస్తున్నాం. ఈయన పేరు మాళి, రిసెర్చి చేస్తున్నారు. నా పేరు భార్గవ, సైంటిస్టుని. మా ప్రొఫెసర్ గారు మూలికాన్వేషణలో ఈ అడవిప్రాంతాల కొచ్చారు. ఆయన రెండురోజులుగా తిరిగి రాలేదు. అప్పుడు వారిని వెతుక్కుంటూ మేము వచ్చాము" అన్నాడు భార్గవ.

"చాలా సంతోషం సార్! మీలాంటి పెద్దవారిని కల్సుకునే భాగ్యం కలిగింది. నా పేరు సంతాల్" అన్నాడు ఆ ఉద్యోగి సంతోషం వ్యక్తపరుస్తూ.

ఇంతలో అక్కడికి ఓ ముప్ఫయ్యేళ్ళ యువకుడు వచ్చాడు ఏవో సరుకులు కొనటానికి.

సంతాల్ అతని కావలసినవి యిస్తూ "అన్నట్టు యీాయనకు తెలియవచ్చునండీ — యీాయన మలేరియా ఉద్యోగి. కుగ్రామాలన్నీ సర్వే చేస్తాడు.... చూడు, రంగా, నీవు రామన్నగూడెం అదీ తిరుగుతావు కదా, యీా రెండు రోజులుగా నీకు అక్కడ ఎవరైనా ప్రొఫెసరుగారు కనిపించారా?" అన్నాడు.

ఆ ఉద్యోగి-రంగా-"పోలికలు చెప్పండి" అన్నాడు.

భార్గవలో ఆశ మొలకెత్తింది. ప్రొఫెసర్ జయవంత్ పోలికలు చెప్పాడు.

రంగా వెంటనే, "సరిగ్గా యిలాంటి పోలికలున్న మనిషిని చూశానండి. నిన్న రామన్నగూడెంనించి బోయగూడెం వెళ్తూండగా, మెట్టవైపు వెళ్తూ ఒకాయన కనిపించాడు. ఆయన చేతిలో భూతద్దం, చిన్న సూట్ కేసు వున్నాయి. నేలమీద వంగి ఏదో పరీక్షగా భూతద్దంతో చూస్తూ కొన్ని మొక్కల్ని తీసి సూట్ కేసులో వేస్తూ కనిపించాడు. ఎవరో ఆయుర్వేద వైద్యుడయి వుంటాడనుకున్నాను" అన్నాడు.

"నిన్న ఎన్నిగంటలకు చూశారు?" భార్గవ గుండె దడదడ కొట్టుకుంటోంది.

"పదిన్నర—పదకొండు మధ్య, ఓ మలేరియా రోగికి రాడికల్ ట్రీట్ మెంటు యిచ్చివస్తున్నానండి. ఇక్కడ చాలా మలేరియా కేసులున్నాయండి, పోజిటివ్ కేసులు! దాంతో నేను ఈ ఏరియాలోని గూడేలన్నిటికీ తిరుగుతుంటాను" అన్నాడు రంగా.

"అయితే, ఆయన తర్వాత మళ్ళీ కన్పించారా?"

"లేదండి."

"మీరు చూసిన ప్రాంతం ఏ గ్రామంలోది?"

"రామన్న గూడెంది."

"ఇక్కడికి యెన్ని మైళ్ళుంటుంది?"

"మూడున్నర నాలుగు మైళ్ళుండొచ్చు. వస్తాను సార్, మళ్ళీ మరో పాజిటివ్ కేసుకి ట్రీట్ మెంటి వ్వాలి" రంగా వెళ్ళిపోయాడు.

సంతాల్, భార్గవవంక చూసి, "మీకు ఈ ప్రాంతం బాగా తెలిసిన కుర్రాడిని తోడిస్తాను. వాడు మీకు ఈ గట్లు పుట్టలు మెట్టలు అన్నీ చూపిస్తాడు. దారి చూపి స్తాడు!" అన్నాడు.

మాళీ ఆనందంగా సంతాల్ వంక చూసి, "మీ మేలు మరిచిపోం. మేం మీ దగ్గరకొచ్చి చాలా మంచి పని చేశాం. ఇంత నిస్వార్థంగా సేవచేసేవాళ్ళు చాలా అరు దుగా వుంటారు" అన్నాడు.

సంతాల్ సిగ్గుపడి, "నన్నూరికే పొగిడెయ్యకండి సార్, గర్వం వచ్చేస్తుంది" అన్నాడు.

ఈలోపల పని కుర్రాడు వచ్చాడు. పదేళ్ళుంటాయి.

సంతాల్ వాడిని పిలిచి, "వీడే సార్. పేరు అర్జున- అర్జునుడికన్న చురుకైనవాడు. ఈ అడవిలో పుట్టి పెరిగిన వాడు. మీకు అడివంతా ఒక్క రోజులో చుట్టి చూపిం చెయ్యగల చిచ్చర పిడుగు ...అరే అర్జునా, దొరలతో వెళ్ళి రామన్నగూడెం అయ్యా జూపిస్తావా?" అన్నాడు వాడి భాషలో.

"గట్టనే దొరా? ఏంగావాలి అయ్యలకు?" అన్నాడు అర్జున. వాడి ఒంటిమీద చిన్న గోచీపాత, తలకి చిన్న గుడ్డ వున్నాయి—అంతే!

"ఏం లేదులే, మన్నెం జూడాలని వచ్చిర్రు వెంట బెట్టుకు జూపిస్తావా?"

"గట్టనే దొరా! వొస్తురా?"

"గిప్పుడు గాదులే, గూసింత బువ్వ తిన్నక వొస్తారు."

"గట్టనే!" అన్నాడు అర్జున.

మాళి, భార్గవల గుండెలు సంతాల్ పట్ల కృతజ్ఞతతో నిండిపోయాయి.

## 4

గంట తర్వాత మాళి, భార్గవ, అర్జున బయల్దేరారు.

"మీరు ఆ పని చూసుకుని చీకటి పడ్తుండగా తిరిగొచ్చెయ్యండి సార్! ఈలోపల మీకు ఇన్‌స్పెక్షన్ బంగళాలో రూం మాట్లాడి వుంచుతాను. ప్రొఫెసర్ గారి ఆచూకీ తెలిస్తే సరే లేకుంటే యింకా చుట్టుపట్ల వెతకాల్సి వుంటుంది కదా!" అన్నాడు సంతాల్.

"అవును ప్రొఫెసర్ గారు దొరికితే రాత్రికి వుండే పనిలేదు. దొరక్కపోతేనే సమస్య...."

"మీరేం బెంగపడకండి. ఈలోపల నేను చుట్టుపక్కల గ్రామాలనుంచి వచ్చే గిరిజనుల్ని ఎంక్వయిరీ చేస్తాను. సరుకులు తెచ్చి స్టోర్సుకి అప్పచెపుతుంటారు కదా, నా దగ్గరికి దాదాపు అన్ని గూడేలనుంచి మనుషులు వస్తుంటారు. ఈ చుట్టుపక్కల అడవిలో ఏ మూల వున్నా మీ ప్రొఫెసర్ గారి విషయం వీళ్ళు చెప్పేస్తారు" అన్నాడు సంతాల్.

ముగ్గురు బయల్దేరారు.

రామన్నగూడెం చేరేసరికి సాయంత్రం నాలుగు అయింది. అంతా డొంకదారి, ముళ్ళకంపలు, రాళ్ళు రప్పలు దాటుకుని నడవటం వాళ్ళిద్దరికీ చాలా కష్టమైంది.

అర్జున చెంగు చెంగున దూకుతూ వాళ్ళిద్దరికంటె పది గజాలు ముందుండేవాడు. వాడికందుకోవటం యిద్దరికీ

సాక్ష్యంకాలేదు.

అర్జున గూడెం ప్రజల్ని ప్రొఫెసర్ గురించి అడిగాడు. వాళ్ళ మాటలు మాలి, భార్గవలకు చాలా భాగం అర్థం కాలేదు. అందుకే ముందుగా తామొచ్చిన పని గురించి అర్జునకి చెప్పి, ప్రొఫెసర్ పోలికలు వివరంగా, అలాంటి మనిషిని ఆ గూడెం ప్రజలెవరైనా చూశారేమో కనుక్కోమని చెప్పారు. అర్జున వాళ్ళు అడగమన్నట్టే అక్కడి ప్రజల్ని అడుగుతూ వచ్చాడు.

ఒక ముసలతను మాత్రం సమాచారం యిచ్చాడు.

"నిన్న మద్దేల జూసినాను దొరా! అచ్చం నువు జెప్పినట్టే వున్నాడు. నిన్న సందేలదాకా యిటిట్టే దిరిగినడు" అన్నాడు.

ఆ తర్వాత ప్రొఫెసర్‌ని చూసినట్టు యెవరూ చెప్పలేకపోయారు.

భార్గవ, మాలి నిరాశపడిపోయారు.

అర్జున ప్రశ్నార్థకంగా చూశాడు వాళ్ళ వంక.

"తిరిగి బోదామా దొరా?" అన్నాడు. అప్పటికి చీకటి పడిపోయింది.

"దాదాపు రెండుగంటల ప్రయాణం. వెళ్దామా, యిక్కడే ఆగిపోదామా?" అన్నాడు భార్గవ.

"సంతాల్ మనకోసం బంగళా రూం తీసుకుంటానన్నాడుకదా! ఈ రాత్రికి మారేడుమిల్లిలోనే గడిపేద్దాం" అన్నాడు మాలి.

"అది సరే, అసలు యిప్పుడు మారేడుమిల్లి వెళ్ళగలమా? బాగా చీకటి పడిపోయిందికదా!"

"మరి ఈ అడవిలో ఎక్కడుంటాం?"

అర్జున కలుగజేసుకుని "యిక్కడ కాపలా మడిసుందే

పోతుందిగదా దొరలూ!" అన్నాడు.

మాళి చిన్నగా నవ్వి, "అక్కడెవరుంటారు?" అన్నాడు.

"కాపలా మనుసులిద్దరుంటారు. ఆళ్ళకో పెద్ద ఇల్లుండది" అన్నాడు అర్జున.

"ఫారెస్టు తాణా అనుకుంటాను. ఫారెస్టు గార్డు వుండివుంటాడు" అన్నాడు మాళి.

"రిస్క్ తీసుకుని ఈ టైంలో మారేడుమిల్లి వెళ్ళే బదులు, ఆ ఫారెస్టు తాణాలో ఈ రాత్రి గడిపేసే మంచిది కదూ! జయవంత్ గారు ఈ ప్రాంతాలనే యెక్కడో తప్పిపోయారన్నది నిర్వివాదాంశం. నిన్న సాయంత్రనించి ఆయన్ని చూసినవారు లేరు. అంటే ఆయన ఈ పరిసరప్రాంతాల యెక్కడో వుండివుండాలి. ఫారెస్టు తాణేదారు మనకేమైనా చెప్పగలదేమో అదీ చూడొచ్చు" అన్నాడు భార్గవ.

ఇద్దరు అర్జున దారిచూపగా ఫారెస్టు తాణా చేరారు. తాణేదారు వాకిట్లోనే వాళ్ళను నిలేశాడు.

భార్గవ తమను పరిచయం చేసుకున్నాడు. "నిన్న సాయంత్రం ఈ ప్రాంతాల మా ప్రొఫెసరుగారు మూలికల సేకరణకు రావటం చూసినవాళ్ళు చెప్పారు. మీకుగాని కనిపించారేమో కాస్త గుర్తుచేసుకు చెప్పండి" అన్నాడు.

"సారీ, అలాంటి మనిషినెవర్నీ నేను చూళ్ళేదు" అన్నాడు తాణేదారు సంభాషణ తుంచేస్తూ.

అర్జున తాణేదారుకి దండంపెట్టి, "దొరా, పొద్దోయింది. ఈ రేతిరికిక్కడుంటరంటి దొర్లు!" అన్నాడు.

"అదెలా కుదుర్తుంది? నేను, గార్డు తప్ప యిక్కడ

బయటివాళ్ళెవరూ వుండటానికి వీల్లేదు. అది రూలు!"
అన్నాడు ఠాణేదారు నిర్మొగమాటంగా.

మాళి, భార్గవ ముఖాలు చూసుకున్నారు.

"ఈ టైంలో మారేడుమిల్లి తిరిగి వెళ్ళటం కష్టమనీ, రిస్కు తీసుకోవటమెందుకని ఇక్కడ ఈ రాత్రి గడపాలనుకున్నాం" అన్నాడు భార్గవ.

"చెప్పానుగా, వీలుకాదని!" మొహమ్మీద కొట్టినట్టు చెప్పి లోపలికి వెళ్ళిపోయిన ఠాణేదారు సంస్కారం ఏ పాటిదో వాళ్ళకి అర్థమయిపోయింది.

"పద భార్గవా, ఈ ఠాణేదారుకన్న అడవి జంతువులు క్రూరమైనవి కావు" అన్నాడు మాళి.

"రండి దొరా, నే నే తోల్కపోతాను. ఓ గడీసేపు నడిచారంటే సరిపోద్ది!" అన్నాడు అర్జున ముందుకిదారి తీస్తూ.

ఆ అడవిలో తమకు అండదండగా వున్నది ఆ సమయంలో అర్జున ఒకడే! వాడు కూడా లేకపోయివుంటే తమకా నిర్జన ప్రదేశంలో దిక్కెవరు?

మాళి భార్గవల మనసుల్లో అర్జున అక్కడి కొండకన్న ఉన్నతంగా కనిపించాడు.

# 5

అర్జున ముందు దారితీస్తుండగా వెనక వాళ్ళిద్దరూ నడుస్తున్నారు.

అప్పటికి రాత్రి ఎనిమిది కావస్తోంది. చీకటి రాత్రులు కావటంతో చుక్కల గుడ్డి వెలుతురు తప్ప వెలుగు కనపడటంలేదు. డొంకదారి రాత్రి సమయంలో మరింత భీభత్సంగా వుంది. పక్కలకు చూడాలంటేనే భయం కొలిపేలాగా జుట్లు విరబోసుకున్న దయ్యాల్లా వున్నాయి

దట్టమైన చెట్లు.

అర్జున చటుక్కున ఆగిపోయాడు.

మాళి, భార్గవ కూడా చటుక్కున ఆగిపోయారు.

అర్జున చెవులు రిక్కించాడు. ఏవో అరుపులు. అరుపు కాదు గాండ్రింపు, పులి గాండ్రింపు!

మాళి, భార్గవల గుండెలు అవిసిపోయాయి.

"పులి ఒత్తన్నాది దోర్లూ! మీకు చెట్టెక్కడం వొచ్చా?" అడిగాడు అర్జున వాళ్ళిద్దరివైపు పెద్ద ఆరిందాలాగా చూస్తూ.

"వచ్చు" అన్నారిద్దరం.

"అవుతే వెంటనే ఈ సింతసెట్టెక్కెయ్యండి. పులొత్తే మీద పడిపోద్ది" అన్నాడు అర్జున.

వాడిమాటలింకా పూర్తికానేలేదు. గాండ్రుమంటూ పెద్ద పులి పరుగెత్తుకుంటూ వచ్చింది. మనిషి రక్తానికి అలవాటుపడ్డ పులి. మనిషి జాడ పొడకడితే చాలు వచ్చి మీద పడిపోతుంది.

"ఎక్కండి బాబూ ఎక్కండి" అరిచాడు అర్జున.

మాళి, భార్గవ చెట్టెక్కబోతూ జారిపోయారు.

పులి దగ్గరకొచ్చేసింది.

మరు క్షణంలో మాళి, భార్గవలమీద ఉరికేదే!

కాని ఈ లోపల అనుకోని విధంగా అర్జున పులికీ, వాళ్ళిద్దరికీ మధ్య అడ్డొచ్చేశాడు.

పులి అర్జునమీదికి పంజా విసిరింది.

అర్జున కింద దొర్లుతున్నట్టుగా ఒకసారి దొర్లి పులి దృష్టిని మరలించాడు.

పులి దృష్టి అర్జునమీద కేంద్రీకృతమైంది.

ఈ లోపల మాళి, భార్గవ చెట్టెక్కేసి, కొమ్మల

మధ్యకు వెళ్ళి దాక్కున్నారు.

అర్జున చెంగు చెంగున లేడిలా గెంతుతూ పులికి దొరక్కుండా అడివంతా కలియతిరగేస్తున్నాడు. పులి వాడి వెంటపడి వేటాడుతోంది.

అర్జున దానికి దొరకటంలేదు. పులి మహా క్రోధంతో గాండ్రిస్తోంది.

అర్జున దార్లో కనపడ్డ ఓ చెట్టు ఎక్కేయటానికి ప్రయత్నించాడు. మొదలు పట్టుకుని చకచకా ఎక్కాడు. కాని అప్పటికే సమయం మించిపోయింది.

కోపంతో వున్న పులి మహోద్రేకంతో పంజా విసిరింది.... దాని దెబ్బకు అర్జున పట్టుజారి దబ్బున కింద పడిపోయాడు.

పులి ఒక్క క్షణంలో అర్జునమీదికురికి కంఠం కొరికేసింది. క్షణాల్లో ముక్కలు ముక్కలుగా చీల్చేసింది వాడ్ని-అరిచేందుకూడా టైంలేదు!

దూరంనించి కొమ్మల మధ్యగా కూచుని చూస్తున్న మాళి, భార్గవల గుండెలు చెదిరిపోయాయి. మనసులు మూగగా రోదించాయి. తమకు సాయంగా వచ్చిన ఆ చిన్నారి అడవి కూన తమను రక్షించే ప్రయత్నంలో ఘోరంగా ప్రాణాలు కోల్పోయాడు.

వాళ్ళ కళ్ళనుండి అప్రయత్నంగానే కన్నీరు ధార కట్టింది. మనసులు మూగబోయాయి. కంఠం రుద్ధమాయిపోయింది.

పులి అర్జున కళేబరాన్ని లాక్కుని మహా వేగంతో పొదల మధ్యకు ఈడ్చుకుపోయింది.

కొద్ది క్షణాలవరకు చెంగున లేడి కూనలా గంతులు

వేసి తమతో కలిసివున్న అర్జున చరిత్ర శాశ్వతంగా ముగిసిపోయినందుకు, అందుకు కారణం తామే అయినందుకు భార్గవ, మాళి — మనసులోనే తమని తాము నిందించుకున్నారు. పాపం, వాడి అమ్మా నాన్నా ఎవరో, ఏమిటో? సంతాల్ కి వాడు ఏమయినా బంధువో, చుట్టమో—ఏమీ తెలీదు.

సంతాల్ కి ఏం సమాధానం చెప్పాలి? ఒక నిండు ప్రాణానికి విలువకట్టడం ఎవరితరం?

అడవిలో మళ్ళీ భయంకర నిశ్శబ్దం తాండవిస్తోంది. ఆ నిశ్శబ్ద వాతావరణంలో ఏవో లారీల ఇంజను చప్పుళ్లు వినిపించాయి వాళ్ళకి.

భార్గవ చప్పున అటు చూపించి, "మాళీ, ఆ లారీల వెంట వున్న మనిషి తాణేదారులా లేదూ?" అన్నాడు.

మాళి గుర్తుపట్టి "అవును! చూడబోతే అడవి సంపద దొంగతనంగా రవాణా అవుతున్నట్టనిపిస్తోంది నాకు! విద్రోహులతో థాణాదారు చేయికలిపినట్టు కనిపిస్తోంది!" అన్నాడు.

"ఎగ్జాక్ట్లీ! అదిగో చందనం చెక్కలు కాబోలు లోడ్ చేస్తున్నారు. కచ్చితంగా అక్రమ రవాణాయే!"

"నాకిప్పుడు అర్థమయింది వాడు మనకి ఆశ్రయమివ్వటానికి ఎందుకు నిరాకరించాడో....?"

"వాడి సంగతి బయటపడిపోతుందని భయపడ్డాడు. ఈ రవాణా విషయం ముందే నిర్ణయమైపోయి వుంటుంది కదా!"

"రాస్కెల్! ప్రభుత్వాన్ని కళ్ళుగప్పి మోసంచేసి తన కడుపు నింపుకుంటున్నాడు. దేశద్రోహి! ఇలాంటి వాడ్ని పట్టి పోలీసులకి అప్పగించాలి!"

"సరే, అది మన పని కాదు. అందుకు వేరే డిపార్టు మెంటుంది. ప్రస్తుతం మా గురువుగారి విషయం చూసుకుంటే, ఆనక యిలాంటి ద్రోహుల విషయం తీరిగ్గా ప్రభుత్వానికి తెలియచేద్దాం."

మాలి ఏదో చెప్పటానికి తెరిచిన నోరు అలాగే వుండి పోయింది. భార్గవ ప్రశ్నార్థకంగా చూశాడతనివంక. మాలి కళ్ళతోనే సూచించాడు.

అటు చూసిన భార్గవ గుండె ఝల్లుమంది. ఏదో నల్లటి ఆకారం వెనుక కాళ్ళమీద వాళ్ళు కూచున్న చెట్టెక్కుతోంది. అదేమిటో వెంటనే గుర్తించారు వాళ్ళు!

ఎలుగుబంటి! అడవిలో తిరిగే ఎలుగ్గొడ్లు ప్రమాదకరమైనవని తను విని వుండటంతో మాలి హెచ్చరికగా పాడిచాడు భార్గవను మోచేత్తో!

"కిందికి ఉరికేద్దామా? అన్నాడు భార్గవ.

ఎలుగుబంటి వీళ్ళిద్దర్నీ చూసిందనటానికి నిదర్శనంగా, అది సరాసరి వాళ్ళు కూచున్న కొమ్మవైపు చురుగ్గా వచ్చేస్తోంది. టైంలేదు.

ఇద్దరు కొమ్మల్ని వాటంగా పట్టుకుని చటుక్కున నేలమీదికి జారారు. కాళ్ళకి నేల అందలేదు. కింద ఏముందో తెలీదు. అయినా తప్పదు, ఎలుగ్గొడ్డు గుర్రుమంటూ వచ్చేస్తోంది.

చటుక్కున కొమ్మలు వదిలేసి ఉరికేశారు.

వెంటనే వాళ్ళు స్వాధీనంలోకి రాలేదు. ఎలుగ్గొడ్డు వాళ్ళని వదల్లేదు. చకచకా చెట్టు దిగిపోయింది.

ఈ లోపల, మాలి, భార్గవ ముందుకు పరుగులు పెట్టారు. ఆ చీకట్లో ఎటు పరుగెడుతున్నారో, ఎదుట ఏముందో కూడా వాళ్ళకు తెలియటంలేదు. ముందీ ఎలుగు

వారినుండి తప్పించుకోవాలి, అంతే!

ఒక్క క్షణం ఆగి వెనక్కి తిరిగిచూశారు.

ఎలుగుబంటి జాడలేదు.

ఇద్దరు ఆగి అలుపు తీర్చుకున్నారు కాసేపు.

చుట్టూ చూశారు. అది తాము వచ్చిన దారికాదు. అర్జున తీసుకునివచ్చిన దారి గుర్తుపెట్టుకున్నా రిదివరలో. ఇప్పుడు తామున్న ప్రదేశం పూర్తిగా గుర్తు తెలియనిది!

"ఏం చేద్దాం? ఈ రాత్రికి ఎక్కడ గడపాలి?" అన్నాడు భార్గవ ఆయాసం తీరాక.

మాలి వెంటనే సమాధానం చెప్పలేదు.

"ఏదైనా చెట్టెక్కి తెల్లవారేవరకు ప్రాణ రక్షణ చేసుకుంటే మంచిదేమో!" అన్నాడు భార్గవ మళ్ళీ.

మాలి నోరు తెరిచి ఏదో చెప్పేంతలో వాళ్ళిద్దరి మీదా ఎక్కడినుంచో వెలుగు ఫోకస్ అయ్యింది.

త్రుళ్ళిపడ్డారిద్దరు. ఇంజను శబ్దం వినిపించింది.

"ఓహో,ఇందాక మనం చూసిన లారీలయివుంటాయి. లోడింగ్ అయినట్టుంది" అన్నాడు మాలి.

"ఓ అయిడియా?"

"ఏమిటది?"

"ఈ లారీల వెనక వెళ్ళాడి రోడ్ చేరుకుందామా? ఇవి బహుశా మారేడుమిల్లినుంచే కదా వెళ్ళాల్సి వుంటుంది?"

"ఏమో, వీటికి రహస్య మార్గాలేమైనా వున్నాయేమో? వీటిని నమ్ముకుంటే మరో గుర్తుతెలీని చోటుకి పోయే ప్రమాదముంది."

"నిజమే! ఈలోపల డ్రైవరుగాని ఇంకా లారీవెంట వున్నవాళ్ళుగాని చూస్తే మనల్ని అన్ది స్పాట్ చంపి

పారేస్తారు! అసలే స్మగ్లర్స్. దయాదాక్షిణ్యం, కనికరం అనే పదాలకు వీళ్ళకి అర్థం తెలీదు!"

"పక్కకు ఆ పొదల మధ్యకు తప్పుకుందాం. ఆ లారీలు దగ్గరవుతున్నాయి. మనల్ని చూశారంటే ఇక్కడే పాతేస్తారు."

ఇద్దరు గుబురుగా వున్న పొదల పక్కకు తప్పుకున్నారు.

రెండు లారీలు నిండు గర్భిణీల్లాగా మెల్లగా సాగి పోయాయి.

## 6

"మాలీ, టైమెంతయిందో చూడు!"

"పన్నెండు కావస్తోంది."

"అంటే కనీసం అయిదు గంటలు గడిస్తేనేగాని తెల్లవారదు."

"వాతావరణం చాలా భయంకరంగా కనిపిస్తోంది కదూ! ఏ ప్రమాదమూ లేకుండా ఈ రాత్రి గడుస్తుందనుకోను."

"ఆశ్చర్యపడితే ఎలా? చూదాం, మన అదృష్టమెలా వుందో?"

"మనం వెంట ఏమైనా ఆయుధాలవంటివైవా తెచ్చుకున్నాం కాదు. పెద్ద హీరోల్లా బయల్దేరి వచ్చేశాం చేతులూపుకుంటూ!"

"మనం యిలాంటి పరిస్థితుల్లో యిరుక్కుంటామని ఏమన్నా కలగన్నామా?"

"జాగ్రత్త! కన్ను మూశావంటే కలలూ వస్తాయి, కిందపడి కాళ్ళు చేతులూ విరగ్గొట్టుకుంటావు!" మాలి హెచ్చరికతో కొమ్మల మధ్య సరిగ్గా సర్దుకుని చేరగిల

బడ్డాడు భార్గవ.

"అటు చూడు, ఎవరో యిటే వస్తున్నట్టనిపించటం లేదూ....?" అన్నాడు భార్గవ.

మాళి పరికించి చూసి, "అవును. ఎవరో మనిషయితే కదిలి వస్తున్నాడు. జాగ్రత్త, అలికిడి చెయ్యకు. ఆ మనిషి యెలాంటి వాడో, ఏమిటో....?" అన్నాడు.

కాసేపటికి ఆ ఆకారం దగ్గరయ్యింది.

అతని ఒంటిమీద ఏదో జంతు చర్మం నడుం చుట్టూ కట్టుకున్నాడు తప్పితే ఏ విధమైన ఆచ్ఛాదనాలేదు. అతను జుట్టు చాలా పొడవుగా ఆడవాళ్ళ జుట్టుకన్న పొడవుగా వుంది. అట్టలు కట్టివుంది. నుదుటిమీద సింధూరంతో పెట్టుకున్న బొట్టు ఆ చీకట్లో కూడా చాలా ఎర్రగా కనిపిస్తోంది. ఒడలునిండా విభూతి కాబోలు పూసుకున్నాడు.

చేతిలో ఏవో పుర్రెలు, యెముకలు వున్నాయి. పుర్రెలో ఏదో ఎర్రటి ద్రవం కనిపిస్తోంది. మనుషి చాలా భయంకరంగా వున్నాడు.

మాళి, భార్గవ ఊపిరి బిగించి అతనివంకే చూస్తున్నారు.

"ఎవడో మాంత్రికుడిలా వున్నాడు" అన్నాడు మాళి.

"చిన్నప్పుడు చదువుకున్న బేతాళ మాంత్రికుడి కథలు గుర్తొస్తున్నాయి."

"ఎవడో క్షుద్రదేవతా ఉపాసకుడిలా వున్నాడు. అందులోనూ ఆటవిక జాతికి క్షుద్ర దేవతలే ఆరాధనీయులు. ,పుట్టలకి, కొండలకీ, చెట్లకీ మొక్కుతారు. జంతు బలులు యథేచ్ఛగా యిస్తుంటారు. ఆ దేవతల

ప్రీత్యర్థం!"

"వీడూ అలాంటివాడేననిపిస్తోంది జంతు బలులతో పాటు నర బలులు కూడా యిస్తుంటారని విన్నాను. ముఖ్యంగా మారుమూల కొండ ప్రదేశాల్లోని కోయ వాళ్ళు యిప్పటికీ పురాతన ఆచారాలను పట్టుకు వేళ్ళాడుతుంటారనీ, నరబలులివ్వటం చాలా సాధారణమైన విషయంగా భావిస్తారనీ విన్నాను."

"ష్!....వాడు పంతం పట్టినట్టు సరాసరి మన చెట్టు కిందకే వస్తున్నాడు. ఏ మాత్రం మాట బయటికొచ్చినా మన ఉనికి గుర్తుపట్టి తాట ఒలిచేస్తాడు."

"ఎస్, బీకామ్!"

ఇద్దరు మౌనం వహించారు.

ఆ మాంత్రికుడిలాంటి మనిషి తిన్నగా మాళి, భార్గవులు కూచున్న చెట్టుకిందనే వచ్చి నించున్నాడు. అతని నడుంచుట్టు కట్టుకున్న చర్మం విప్పాడు. దానికింద మరో చర్మముంది—జింక చర్మం.

విప్పిన చర్మం నేలమీద పరిచి దానిమీద కూచున్నాడు. పుర్రెను కిందపెట్టాడు. ఎముకల్ని ఖాళీ పుర్రెల్ని చెట్టు మొదలుకి చేరవేసి వాటికి బొట్లు పెట్టాడు సింధూరంతో.

పుర్రెలో వున్న ఎర్రటి ద్రవాన్ని ఓ ఎముకతో తీసి నేలమీద చుక్కలుగా పడేలా చేశాడు. చిత్రంగా ఆ చుక్కలన్నీ క్షణాలమీద ఆవిరైపోయాయి. ఏవో మంత్రాలు చదివాడు.

ఆ పుర్రెలోని ద్రవం నెత్తురని గ్రహించటానికి మాళి భార్గవలకు యెక్కువ సమయం పట్టలేదు. ఇద్దరు ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. ఇది మనిషి రక్తం కాదు

గదా!

ఇద్దరి మ న సు ల్లో నూ తేలుకొండీలాంటి ప్రశ్న తలెత్తింది.

మనిషి ర క్త మే అయితే, కొంపతీసి....?

అంతవరకుమించి ఆలోచించటానికి ఇద్దరికీ భయం వేసింది.

ఆ మంత్రగాడు తన కార్యక్రమాన్ని అలా నిర్వర్తిస్తూనే వున్నాడు.

దాదాపు రెండు గంటలు సాగింది.

మాళి, భార్గవ ఊపిరి గట్టిగా విడవటానిక్కూడా భయపడుతున్నారు.

ఉన్నట్టుండి ఆ మంత్రగాడు పైకి లేచాడు. గాలిలో ఏదో అలజడి వచ్చినట్టు వినిపించింది. వాతావరణంలో వచ్చిన భేదం స్పష్టంగా తెలుస్తోంది వాళ్ళకు. గాలిలో ఏవో అస్పష్టమైన శబ్దాలు కూడా వినిపిస్తున్నాయి. ఏవో గుసగుసల్లాగా యెవరో మాట్లాడుకుంటున్నట్టు వున్నాయా శబ్దాలు.

బహుశా మాంత్రికుడు స్పిరిట్సుతో మాట్లాడటం లేదు కదా! క్షుద్ర దేవతోపాసకులకు చనిపోయినవారి ఆత్మలతో మాట్లాడే శక్తి అలవడుతుందనీ, దాని సాయంతోనే వాళ్ళు కావలసిన పనులు కూడా చేయ గలుగుతారనీ తాము విన్న చదివిన సంఘటనలు వాళ్ళిద్దరి మనుసుల్లోను మెదులుతున్నాయి.

మాంత్రికుడు కింద పేర్చిన పుర్రెలనీ, ఎముకలనీ తీసుకున్నాడు. కిందపరచిన చర్మాన్ని మళ్ళీ నడుముకు కట్టేసుకున్నాడు. పుర్రెలో మిగిలిన రక్తాన్ని ధారగా నేల మీదకు వదిలేశాడు. అయితే ఆ రక్తం నేలమీదకు జారకుండానే ఆవిరైపోవటం చూసి యిద్దరికీ గుండె

లవిసిపోయాయి.

క్షుద్రదేవతలు పిల్చేస్తున్నాయా? ఏమో....?

మాంత్రికుడు కదిలి వెళ్తున్నాడు. నోరు తెరిచి ఏదో మాట్లాడుతున్నాడు. అంతవరకు వినిపించిన గాలిలోని శబ్దాలు అతనితోనే దూరమయిపోయాయి.

మాళి, భార్గవ గట్టిగా వూపిరి పీల్చుకున్నారు.

"నాకు చాలా భయంవేసింది. అతను మనల్ని ఎక్కడ గమనించి భస్మం చేసేస్తాడోననిపించింది" అన్నాడు భార్గవ.

"నిజానికి అంతే మరి! ఈ మంత్రగాళ్ళని నమ్మడానికి వీల్లేదు. అదీగాకుండా వీళ్ళు నరమాంస భక్షకులు కూడా అయివుంటారు. క్షుద్ర దేవతలకు మానవ రక్తంతో తర్పణంచేసి, మాంసాన్ని ఆరగిస్తారని నువ్వు వినలేదా? అందునా యిలాంటి అనాగరిక అడవి మనుషులు మరీ డేంజర్!"

"మా గురువుగారికేదైనా ప్రమాదం సంభవించ లేదుకదా!....నా మనసు కీడు శంకిస్తోంది" భార్గవ చెప్పలేక చెప్పాడు.

"ఏమో, ఈ మంత్రగాడిని చూశాక నాకూ భయం పుట్టుకుంది. ప్రొఫెసర్ గారి విషయం కూడా అనుమానా స్పదమే!"

"నువ్వు నా ధైర్యాన్ని మరింత దిగజార్చుతున్నావు. ప్రొఫెసర్ గారు క్షేమంగా వుండాలని భగవంతుడ్ని కోరుకుంటున్నాను. ఆయనకేదైనా అయితే ఆయన్ని నమ్ముకున్న భార్యాబిడ్డలు నేనూ యేమయిపోతాం?"

"ఆయన క్షేమంగా వుండాలనే ఆశిద్దాం! పోతే నిండు ప్రాణాన్ని చేతులారా పోగొట్టుకున్న అర్జున

విషయం తలుచుకుంటే నే గుండె చెదిరిపోతోంది. సంతాల్ కి యేమని సమాధానం చెప్పాలి? మనల్ని నమ్మి మనకు తోడుగా ఆ కుర్రాడ్ని పంపితే, మనకోసం బలి పెట్టేశాం కుర్రాడ్ని. యిప్పటికీ ఆ దృశ్యం తలుచుకుంటే ఒళ్ళు గగుర్పొడుస్తోంది.

"ఏమైనా సంతాల్ కి తెలియచెయ్యటం మన విధి!"

"కరెక్టేననుకో! అసలు ముందీ గండంనించి బయట పడగలమా?—అని తెల్లవారాక దారి గుర్తు దొరికితే తప్పకుండా సంతాల్ ని కలియాల్సిందే!"

"ఇంకా తెల్లారటానికెంత టైముంది?"

మాలీ రేడియం డైల్ వాచీ చూసి, "ఇంకో రెండు గంటలు. ఇంకేవిధమైన అవాంఛనీయ సంఘటనా జరక్కపోతే యీ రేయి తెల్లవారుతుంది! మనం సూర్యుడ్ని చూడగలుగుతాం" అన్నాడు.

## 7

ప్రొఫెసర్ జయవంత్ బోనులో వున్న ఆ గుహలో అటు యిటు పచార్లు చేస్తున్నాడు.

తనపాలిటకిదొక బందిఖానా! గుహ బయట దయ, కనికరంలేని అడవి మనుషులు కాపలా!

తెల్లవారితే తనను కొండదేవరకి బలిస్తారు. ఈ ఆటవికుల అజ్ఞానానికి, మూర్ఖత్వానికి వాళ్ళమీద వాళ్ళ నాయకుడిమీద చాలా కోపం వచ్చిందాయనకు.

అసలు, రెండు రోజులక్రితమే తనను బలిచ్చివుండే వాళ్ళు! కాని, యీ రోజువరకు వాయిదా వేశారు.

తను ఎన్నో విధాల నాయకుడికి నచ్చచెప్పాడు. తను నిజంగా మూలికలకోసమే అడవికి వచ్చాననీ, ఆవి వెతుక్కుంటూనే గూడెం వున్న ప్రాంతానికి వచ్చాననీ,

తనను వదిలిపెట్టాల్సిందనీ కోరాడు.

"నువ్జెప్పేదేదీ నమ్మటానికి వీల్లేకుండా వుంది. మా కొండదేవరకూ కోపమొచ్చినాది. నిన్నిక పేనాల్తో ఒగ్గం" అన్నాడు నాయకుడు.

తను విసిగివేసారిపోయాడు. గూడెంలో ఎవరూ చదువుకున్నవారే కనపడలేదు. ఆ నాయకుడు పరమ మూర్ఖుడిలా వున్నాడు. ఎన్ని విధాల చెప్పినా తన పట్టు వదల్లేదు.

"ఇయ్యాళే నిన్ను బతేసేవోళ్ళం గానీ, ఎల్లుండు మావ గూడెంలో జాతరుంది. అప్పుడేత్తాం నిన్ను బలి! ఈ లోగడ బాగా కొవ్వెక్కే తిండి పెడతాం, తినుకో!" అన్నాడు నాయకుడు.

తర్వాత యిద్దరు ఆటవికులు తనని చెరో రెక్కా పట్టుకుని యీ గుహలోకి లాక్కొచ్చి పడేశారు. బయట బల్లేలు పట్టుకుని పహరా తిరుగుతున్నారు. ఎందుకో తనంటే యింత కక్ష పూనారో అర్థంకాలేదు.

ఇదివరలో కూడా చాలాసార్లు యీ ప్రాంతానికి వన మూలికలకోసం వచ్చాడు తను! అప్పుడు యింతదూరం రానక్కర్లేకుండానే రోడ్డుకి దగ్గర్లో వున్న అడవి ప్రాంతంలోనే దొరికేవి. కాని ఎందుకో అడవి కొట్టేయటం జరిగింది కొంత మేర. తను ఎంత గాలించినా కావలసిన వేర్లు, మూలికలు దొరకలేదు. వాటిని వెతుక్కుంటూ దారితప్పి బాగా దూరంగా ఎక్కడో మారుమూలగా వున్న యీ గూడెం చేరుకున్నాడు.

ఇక్కడి ఆటవికులు మరీ యింత వెనకబడ్డవాళ్ళనీ, నరబలులిచ్చే ఘోరమైన సంప్రదాయం కలవాళ్ళనీ తనకు సూచన ప్రాయంగానైనా తెలీదు.

తను యిలా వాళ్ళ ప్రాంతంలో అడుగు పెట్టాడో లేదో అలా తనని పట్టి బంధించేశారు. తనేం చెప్తున్నదీ వినకుండా మూర్ఖంగా బలివ్వటానికే నిర్ణయించుకున్నారు. ఈ రెండు రోజులుగా రకరకాల తినుబండారాలు పంపిస్తూనే వున్నారు. కాని తను పచ్చి మంచినీళ్ళు కూడా ముట్టలేదు.

రేపే బలిస్తారు తనని!

# 8

తెల్లవారింది.

"మాళీ, చెట్టు దిగుదామా?" అన్నాడు భార్గవ.

"ఇంకా బాగా వెలుగు రానివ్వు. ఆ పాటికి క్రూర మృగాలు సురక్షిత ప్రాంతాలకి పోయి దాక్కుంటాయి. మనకీ సురక్షితంగా వుంటుంది."

"అవును. ఈలోపల మనుషులు కూడా అటు యిటు మసలటం మొదలవుతారు. మనగోడు చెప్పుకుని దారి కనుక్కుని బయటపడదాం."

"కనుమాపు మేరలో ఎక్కడ చూసినా చెట్లు గుట్టలు తప్పితే మనుషుల జాడ వున్నట్టు కనపడలేదు."

"అడవి కదా, అలాగే అనిపిస్తుంది. గిరిజనులు చాలా కొద్ది సంఖ్యలో వుంటారు కదా! ఇంత పెద్ద అడవిలో కొండల మధ్య చిన్న చిన్న గూడెలు కట్టుకుని అలాగే బతుకులు వెళ్ళబుచ్చుతుంటారు. ఇంకా యిప్పుడిప్పుడు వాళ్ళు కూడా చదువుకుని ఉద్యోగాలకోసం పట్టణాలు వస్తున్నారు. వాళ్ళకోసం ప్రభుత్వం యెన్నో సదుపాయాలు రిజర్వేషన్‌లు కల్పిస్తోందికదా!"

"ఎస్, వాళ్ళు కూడా అభివృద్ధి చెందుతున్నారు."

"వెలుగు బాగా వచ్చింది, యిక దిగుదామా?"

ఇద్దరు చెట్టు దిగి వచ్చారు. రాత్రంతా నిద్రలేకుండా టెన్షన్‌తో, మానసిక వ్యథతో అలాగే కొమ్మలమధ్య భయం భయంగా కాలం గడపాల్సి రావటంతో ఇద్దరి శరీరాలు కాసేపటివరకు స్వాధీనంలోకి రాలేదు.

చుట్టూ కలయజూశారు. యెక్కడా నరసంచారం కనిపించలేదు. చెవులపిల్లులు, కుందేళ్ళు చాలా వాడా విడిగా పొదల్లోకి పొదల్లోంచి బయటకు గంతులు వేస్తూ పరుగులు పెడ్తున్నాయి.

కింద ఎక్కడా కాలిబాట కూడా లేదు.

"పోయిన రాత్రి యీ డొంకలు తుప్పలు ఎలా దాటుకుని వచ్చామో నాకు చాలా చిత్రంగా వుంది."

"ప్రాణ భయం అలాంటిది మైడియర్ ఫ్రెండ్! ఏమై పోతున్నామో, యెక్కడికి పోతున్నామో ఆలోచించుకోవటానికి సావకాశం, సమయం వుండవు. స్ట్రగుల్ ఫర్ ఎగ్జిటెన్స్! జీవన పోరాటం—అంతే!" ఫకీర్ చెప్తున్నాడు మాలి.

"నిన్న సాయంత్రం మనం అర్జునతో వచ్చిన ఏరియా కాదిది. పూర్తిగా కొత్త ప్రదేశం."

"పద, తెలిసిన ప్రాంతం ఎదురుపడేవరకు వెతుకుదాం. ఈ లోపల ఎవరోకరు కనిపించకపోరు. అడిగి తెలుసుకుందాం."

"తాణేదారు నివాసం కూడా కనుచూపు మేరలో యెక్కడా కనపడటంలేదు. మారేడుమిల్లికి ఈ ప్రాంతం ఏ దిశలో వుందో, ఎంత దూరంలో వుందో అంతా అగమ్యగోచరం."

"కబుర్లతో కాలం వ్యర్థం చెయ్యొద్దు. ఎలుగుబంటి పుణ్యమా అని కాసేపు పరుగుపందెం వేసుకున్నాం. మనం

చాలా వేగంగా పరుగె త్తగలమని నాకు నిన్న రాత్రే తెలిసింది. ఈసారి యింటర్నేషనల్ స్పోర్ట్సులో పాల్గొంటాను—రన్నింగ్ రేస్‌కి.

"అలాగే పాల్గొందువుగాని ముందు యీ అడవిలో నించి బయటపడనియ్ క్షేమంగా."

వాళ్ళిద్దరు కొద్దిదూరం వెళ్ళారో లేదో చెట్లమీది నుంచి నలుగురైదుగురు మనుషులు చటుక్కున వాళ్ళ ముందు దూకారు. వాళ్ళ చేతుల్లో బల్లేలున్నాయి. నడుంచుట్టు అంగవస్త్రంలా యేదో కట్టుకున్నారు. మెడలో పూసలున్నాయి. ఒంటిమీద మరే ఆచ్ఛాదనా లేదు.

మాలి, భార్గవ చటుక్కున ఆగిపోయారు.

"ఎవరు మీరు, యీడకెందుకొచ్చినారు? అన్నారు వాళ్ళు క్రూరంగా వాళ్ళిద్దరివంకా చూస్తూ.

భార్గవ గొంతు తడారిపోయింది. "మా తాలూకు ఓ మనిషికోసం వెతుకుతున్నాం. ఆయన యీ అడవిలోని కొన్ని మూలికలకోసం మూడు రోజుల క్రితం వచ్చారు. మీరుగాని చూశారా?...."

"భార్గవ మాటలింకా పూర్తికానేలేదు, యిద్దరు మనుషులు అతని పెడరెక్కలు విరిచి పట్టుకున్నారు. చేతులు మొదల్లోకి విరిగిపోయాయా అన్నంత బాధ కలిగింది భార్గవకు.

మరో యిద్దరు మాలికి అదే సన్మానం చేశారు.

"ఇదేమిటయ్యా బాబూ, మేము చెప్పేది పూర్తిగా వినిపించుకోకుండా యిలా చేతులు విరిచేస్తున్నారు? కాస్త మేం చెప్పేది...."

మధ్యలోనే ఒకడు గట్టిగా కసురుకున్నాడు.

"అయ్యన్నీ మా దొరతో చెప్పుకొండహే. మీ యిసయం ఆరే జూస్కుంటాడు" అన్నాడు.

భార్గవ, మాళి వాళ్ళకు నచ్చచెప్పటం వృథా ప్రయాస అన్న నిర్ణయానికొచ్చి మౌనం వహించారు.

వాళ్ళు ముందు వెనక నడుస్తుండగా చాలా దూరం నడిచి నడిచి ఓ కొండను చుట్టి ఓ లోయలాంటి ప్రదేశానికి చేరారు.

## 9

"ఈళ్లెవరు?" గూడెం నాయకుడు హుంకరిస్తున్నట్టు అడిగాడు.

"మొన్నొచ్చిన మడిసిలాంటోళ్లే దొరా. అక్కడ తచ్చాడతాంటే తోల్కొచ్చినం" అన్నారు ఆటవికులు. మాళి, భార్గవ వాళ్ళవంకే పరీక్షగా చూస్తున్నారు.

తాము చూసిన కోయివాళ్ళకన్న వీళ్ళు బాగా వెనక పడినవాళ్ళలాగా వున్నారు. చాలా క్రూర స్వభావమున్న వాళ్ళలా కనిపిస్తున్నారు. తాము వీళ్ళకేదో అపకారం చేయదలచుకున్నట్టు వీళ్ళు భయపడుతున్నారా, లేక వీళ్ళ నైజమే అంతనా?—అన్న విషయం వాళ్ళకు అంతుబట్టలేదు.

"ఎందుకొచ్చినరు, యీడ మీకేం పని?" అంటూ చాలాసేపు వాళ్ళిద్దర్నీ ప్రశ్నలవర్షంలో ముంచెత్తాడు.

మాళి, భార్గవ చెప్పిన విషయాలు అతని తలకెక్కలేదు. చెప్పి చెప్పి విసుగొచ్చింది వాళ్ళకి.

చివరికి నాయకుడు తేల్చి చెప్పేశాడు.

"ఈళ్ళనిగూడా ఆసితో కట్టిపారెయ్యండహే! ఈ రోజు అమ్మోరి జాతర మాంచి జోరుగ సాగాలి. కొండ దేవరకి మూడు పేనాలతో యిందుజెయ్యాల" అన్నాడు

నాయకుడు హుంకరిస్తూ.

వాళ్ళు తమని ఏం చెయ్యబోతున్నారో మాలికి, భార్గవకు అర్థమైపోయింది.

నాయకుడి ఆదేశం ప్రకారం ఆటవికులు వాళ్ళిద్దర్నీ తీసుకుపోయి ఓ గుహలో పడేశారు. కొండని తొలిచి మలిచినట్టుందా గుహ. లోపల కటిక చీకటి యేదో దుర్గంధం నాసికాపుటల్ని బద్దలుకొడుతోంది.

కాసేపటివరకు వాళ్ళ కళ్ళు చీకటికి అలవాటు పడ లేదు.

కళ్ళు చికిలించి చూసేసరికి తమతోపాటు మరో వ్యక్తి ఉనికి కూడా వాళ్ళకు కనిపించింది.

ఆ వ్యక్తి ఒంటిమీద చిన్న అంగవస్త్రం తప్ప మరే ఆచ్ఛాదనా లేదు. ఒంటినిండా ఏవేవో పసర్లు, పూతలు, విబూతితో గీసిన నామాలు వున్నాయి. మెడలో పూల దండలు, ఆకులు తీగెలతో అల్లిన దండలు వున్నాయి. కాళ్ళకు కూడా యేవో అల్లికలు, నుదుట — దాదాపు ముఖానికంతకూ — సింధూరంతో గుర్తు తెలీకుండా బొట్లు పెట్టబడి వున్నాయి.

ముందుగా ఆ వ్యక్తే గుర్తుపట్టి పలకరించాడు.

"భార్గవా, నువ్వా? ఆ పక్క మీ స్నేహితుడు మాలి కదూ!" అన్నాడు.

భార్గవ తదేక దీక్షగా చూసి, "సార్, మీరేనా? ఏమిటీ అలంకరణలు? మిమ్మల్ని వెంటనే గుర్తుపట్టలేక పోయాం" అన్నాడు. ఆయన ప్రొఫెసర్ జయవంత్.

మాలి కూడా ఆనందంగా చూశాడాయనవంక.

"మిమ్మల్నిలా చూడటం బాధాకరంగానే వున్నా, మిమ్మల్ని చూడగలిగినందుకు చాలా సంతోషంగావుంది"

అన్నాడు.

ఒకరితో మరొకరు తన అనుభవాలు చెప్పుకున్నాక ప్రొఫెసర్ జయవంత్ అన్నాడు.

"వీళ్ళు చాలా ప్రమాదకరమైన ఆటవికులు. ఈ రోజుల్లో కూడా యింత క్రూరమైన అడవి మనుషులు వుంటారని మనం కనీసం వూహించలేం. ప్రతి ఏజెన్సీ ప్రాంతంలోను ప్రభుత్వం అనేక రకాల సదుపాయాలు, సౌకర్యాలు సమకూర్చింది. అయినా యింకా యింత అజ్ఞానంలో, మూర్ఖత్వంలో మారుమూల పడున్న కోయగూడేలున్నట్టు బహుశా ప్రభుత్వానికి కూడా తెలీదేమో!

ఇది మా రేదుమిల్లికి దగ్గర్లోనే వుంది. కాకుంటే బాగా రవాణాసౌకర్యంగాని ఓ మూలను విసిరేయబడి వుందీ ప్రాంతం! ఇక్కడి మనుషులు బాగా అనాగరికులు, కొండదేవత ఉపాసకులు. నరబలులు వీళ్ళకు సర్వసాధారణం. బహుశా నరమాంస భక్షణకు కూడా వీళ్ళు దూరంకాదని నా అనుమానం! ఆ బలి కార్యక్రమంలో ప్రస్తుతం ఈనాటి బలి పశువును నేను! ఈ రోజు వీళ్ళ కొండ దేవతకు యేదో జాతరట! అందుకు నన్ను రెడీ చేసుకున్నారు" అన్నాడు.

ప్రొఫెసర్ చెప్పిన విషయాలు తమ అనుభవంతో అన్వయించుకున్నారు వాళ్ళిద్దరు.

"బహుశా మాక్కూడా కొద్ది నిమిషాల్లో మీకు చేసిన మర్యాదే చెయ్యబోతున్నారు వీళ్ళు. ఈ గూడెం నాయకుడు ఇందాకా చెప్తున్నాడు. యీ రోజు మూడు ప్రాణాలని బలిపెట్టబోతున్నట్టు!" అన్నాడు భార్గవ.

వీళ్ళ దారుణకృత్యానికి బలికాక తప్పదని నిరాశపడి

పోయాను. ఇంతలో మీరొచ్చారు. మనం ఎలాగైనా ఇక్కడినుంచి తప్పించుకోవాలి. వీళ్ళ చేతుల్లో నిర్భాగ్యపు చావు చావకూడదు. ఈ గూడెం నుంచి మారేడుమిల్లి యే దశలో వుందో, యే దారిన అక్కడికి చేరుకోవచ్చో నేను బాగా స్టడీ చేశాను. వీళ్ళ బంధనాలనుంచి తప్పించుకోగలిగితే ఒక్క గంటలో మనం సురక్షిత ప్రాంతానికి చేరుకోవచ్చు" అన్నాడు జయవంత్.

"అదెలా? వీళ్లు కాలు కదిపితే కాళ్ళు విగగ్గొట్టి పొయ్యిలో పెట్టేసేలా వున్నారు. పైగావాళ్ళు దాదాపు ఓ వందమంది వుంటారేమో అంతా కలిసి. మనం ముగ్గురం. వాళ్ళ చేతుల్లో కత్తులు బళ్ళేలూ వున్నాయి. మనం నిరాయుధులం!" అన్నాడు మాళి.

"అయితే మీ దగ్గర ఎలాంటి ఆయుధాలు లేవన్న మాట!" అన్నాడు ప్రొఫెసర్.

"మిమ్మల్ని జాడ తెలుసుకోవటానికి ఉన్నపళంగా బయల్దేరి వచ్చేశాం. ఇలాంటి రాక్షసుల పాలబడతామని ముందుగా మాకేం తెలుసు?" అన్నాడు భార్గవ.

"నాకు తెలుసు. గతంలో మరోచోట ఇలాంటి అనుభవమే యెదురైంది నాకు. అయితే వాళ్ళు యింత ఘోరంగా 'బలి' యేర్పాటు చెయ్యలేదు. వాళ్ళ ప్రాంతంలోనికి రయెందుకొచ్చావని పట్టుకుని వేధించి వదిలేశారంతే! అప్పట్నించీ ఇలా కలెక్షన్స్‌కి వచ్చినపుడు రివాల్వర్ వెంట తెస్తుంటాను" అన్నాడు జయవంత్.

"అయితే మీ దగ్గర రివాల్వర్ వుందా ఇప్పుడు?" భార్గవ గట్టిగా అరిచినట్టే అడిగాడు.

"ఉష్! .... మనకి కొన్ని అడుగుల దూరంలోనే కాపలా మనుషులున్నారన్న విషయం మరిచిపోవద్దు.

వాళ్ళు వింటే అంతా రసాభాసవుతుంది.... నా బ్రీఫ్ కేసులో వుంది రివాల్వర్. నేను కలెక్టు చేసిన మూలిక లతోబాటు దాన్ని బ్రీఫ్ కేసులో దాచాను. అయితే ఆ బ్రీఫ్ మాత్రం ప్రస్తుతం నా దగ్గర లేదు."

మాలి, భార్గవ నీరసపడిపోయారు.

"మరెలాగ?" అన్నారు ఒకేసారి.

"అది ఈ గుహలోనికి నేనొచ్చేవరకు నా దగ్గరే వుండేది. వచ్చేముందు నేనే ఈ గుహకి కుడిపక్కన వున్న బండరాళ్ళ వెనకాల జారవిడిచి వచ్చాను. అది బండలమధ్యనున్న జాగాలో సురక్షితంగానే వుంటుంది. వీళ్ళకి బుర్ర తక్కువ. అది అప్పటిదాకా నా చేతిలోనే వుందనిగాని, అది యేమయిందిగానీ పట్టించుకోలేదు" అన్నాడు ప్రొఫెసర్.

"మరి దాన్ని ఎలా చేజిక్కించుకోవటం?"

"అదే ఆలోచించాలి. మనం ఒక్క అడుగు కూడా ముందుకు జరపలేని హీనస్థితిలో వున్నాం. వేటకుక్కల్లా చర్యల్ని అనుక్షణం కనిపెడుతున్నారు వీళ్ళు! ఏమాత్రం అనుమానం వచ్చినా అమ్మవారికి కాదు, యిక్కడి కిక్కడే బలి కార్యక్రమం ముగించేస్తారు. చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి!"

ముగ్గురు కాసేపు తీవ్రమైన ఆలోచనలో పడ్డారు.

"అయితే ఒక్క రివాల్వర్ సహాయంతో వీళ్ళందరి నుంచీ తప్పించుకోగలమా?" అన్నాడు భార్గవ సందేహం వెలిబుచ్చుతూ.

"అసలు ఏమీ లేకుండా పోయేకన్న ఏదోక ఆధార ముందికదా! ఒకటి రెండు గుళ్ళు పేల్చేసరికి వాళ్ళేదారి కాస్తారు భయపడి!"

"ఏమో, చూడగా వీళ్ళలో భయంకరమైన మంత్రిగాళ్ళు కూడా వున్నట్టున్నారు. రక్త తర్పణాలు విడిచి క్షుద్ర శక్తుల్ని ఉపాసిస్తున్న ఓ భయంకర మాంత్రికుడ్ని చూశాం. సమయానికి ప్రేతాత్మలని మనమీద వదిలేసినా వదిలెయ్యొచ్చు" అన్నాడు భార్గవ.

"డోంట్ బి సిల్లీ! ప్రేతాత్మలు, దయ్యాలు అంటూ వెనుతియ్యటానికి నీకు సిగ్గు వెయ్యటంలేదూ? నీ విజ్ఞాన శాస్త్ర పరిజ్ఞానం యేమయిపోయింది? ఇలాంటివి నమ్ముతావా?" అన్నాడు ప్రొఫెసర్ మందలింపుగా.

భార్గవ మాట్లాడలేదు.

కాసేపు ముగ్గురు లోస్వరంలో అక్కడినుంచి తప్పించుకునే సమస్యగురించి చర్చించుకున్నారు.

# 10

గంట తర్వాత నలుగురు ఆటవికులు నాయకుడితో కలిసి అక్కడికొచ్చారు.

వాళ్ళ చేతుల్లో కొబ్బరి చిప్పలున్నాయి. వాటిలో రకరకాల రంగులు, పసర్లు, లేపనాలు వున్నాయి. వారి వెనుక యిద్దరు ఆడవాళ్ళు—వచ్చారు. వాళ్ళ చేతుల్లో పూసల పేర్లు, సింధూరం ఇంకా నారబట్టలు వున్నాయి.

జయకంత్ కళ్ళతోనే మాళికి, భార్గవకు సంజ్ఞ చేశాడు. అంటే బలి కార్యక్రమం మొదలయిందని ఇద్దరికీ అర్థమయింది.

"గుడ్డలిప్పెయ్యండి" ఆజ్ఞ ధ్వనించింది నాయకుడి కంఠంలో.

మాళి, భార్గవ ముఖాలు చూసుకున్నారు.

"ఊం, సెపతంటే ఇనబడలే!" హూంకరించాడు నాయకుడు. అతని చేతిలోని బరిసె వాళ్ళ గుండెలని

చీల్చేయటానికి సిద్ధంగా వున్నట్టుంది.

జయవంత్ కళ్ళతోనే సంకేతాలు పంపాడు.

భార్గవ గుడ్డలు ఒకటొకటే విప్పసాగాడు.

మాలి లేచి నాయకుడి దగ్గరగా వెళ్ళబోతుంటే, "ఎందుకు? అక్కడే గుడ్డిప్పు" అన్నాడు నాయకుడు.

మాలి తనకు పడ్డ అవసరం వేలితో సూచించాడు.

అనుచరుడికి సైగచేశాడు నాయకుడు. మాలి వెంట వాడు బయలుదేరాడు.

మాలి జయవంత్ చెప్పిన బండల వెనక్కు వెళ్ళాడు. అయిదు నిమిషాల తర్వాత బయటికొచ్చాడు.

అనుచరుడు మళ్ళీ వెంబడించాడు గుహ లోపలివరకు.

మాలి లోనికొచ్చేసరికి భార్గవకు బలితంతు జరుగుతోంది. లేపనాలు పూస్తున్నారు. సింధూరం బొట్లు పెడుతున్నారు. భార్గవ లోపల్నుంచి తన్నుకొస్తున్న కోపాన్ని బలంగా నిగ్రహించుకుని మామూలుగా వుండటానికి ప్రయత్నిస్తున్నాడు.

"గుడ్డిప్పు" అన్నాడు నాయకుడు మాలితో.

మాలి గుడ్డలు విప్పసాగాడు. బనీను లోపల రివాల్వర్ చుట్టేశాడు. గుడ్డలు విసురుతున్నట్టుగా జయవంత్ ఒళ్ళోకి విసిరాడు.

జయవంత్ లాఘవంగా రివాల్వర్‌ని తన కాళ్ళ కిందుగా దాచేసి గుడ్డల్ని పక్కకి పారేశాడు.

నాయకుడుగాని, అనుచరులుగాని ఇదేమీ గమనించలేదు.

ఓ గంటతర్వాత తంతు ముగిసింది.

ఇంతలో గుహ బయట పెద్ద కోలాహలం. డప్పుల మోతలు, బాకాలు కర్ణకఠోరంగా వినిపిస్తున్నాయి.

గూడెంలోని పిల్లాపీచు, ఆడ మగ అందరూ గుహ బయట చేరారు. దాదాపు అందరూ మద్యం సేవించినట్టుంది. ముక్కుపుటాలు దుర్వాసనతో అదిరిపోయాయి వాళ్ళకి.

“పదండి, మీ దేవతల్ని తల్చుకోండి. మీ ఆఖరి దినాలు దగ్గరడ్డాయి. లెగండెహే!” అన్నాడు నాయకుడు.

జయవంత్ నడుముకున్న గుడ్డలో జాగ్రత్తగా రివాల్వర్ ని భద్రపరిచాడు. మాళి, భార్గవ మౌనంగా లేచి జయవంత్ తో బాటు బయటకు నడిచారు.

బాకాల మోతలు, డప్పుల మోతల అంతకంతకు తారస్థాయిని చేరుకుంటున్నాయి. మధ్యలో యెక్కడా వాళ్ళకు తప్పించుకునే అవకాశం దొరకలేదు.

దాదాపు పదినిమిషాల తర్వాత వాళ్ళు ముగ్గుర్ని ఓ నిలువెత్తు విగ్రహమున్న ప్రదేశానికి తీసుకుపోయారు. ఆ విగ్రహమే వాళ్ళ కొండదేవతయి వుంటుందని వాళ్ళు గ్రహించారు.

విగ్రహం ముందు నించుని వున్న వ్యక్తిని చూడగానే మాళి, భార్గవ ఉలిక్కిపడ్డారు.

అతను తామిదివరకు చెట్టుకింద చూసిన మంత్రగాడు! క్షుద్ర దేవతా ఉపాసకుడు. ఈ బలితంతు వాడే కొనసాగిస్తాడు కాబోలు!

వాళ్ళ శరీరాలు గగుర్పొడిచాయి. ఆ మంత్రగాడు చాలా భయంకరంగా వున్నాడు. నిన్న చూసినదానికన్న యింకా భయోత్పాదం కలిగించేలా వున్నాయి వాడి అలంకరణలు! ఈసారి కపాలాలను దండ గుచ్చి మెడలో ధరించాడు.

జయవంత్ కళ్ళతోనే మాలికి, భార్గవకు సంకేతాలు పంపిస్తున్నాడు.

ఆటవికులందరు మహోత్సాహంతో అరుస్తున్నారు. నాట్యం చేస్తున్నారు.

విగ్రహం ముందు హోమం తయారుచేసి అందులో రకరకాల వేర్లు, రక్తం యెండుకట్టెలు సమిధలుగా వేస్తున్నారు మంత్రగాడు.

నలుగురైదుగురు అనుచరుల చేతుల్లో ఆయుధాలున్నాయి—బల్లాలు. నాయకుడి చేతిలో పొడవాటి దండం వుంది! దాన్ని మాటిమాటికీ గాల్లో ఊపుతున్నాడు—మంత్రదండంలాగా.

జయవంత్ పరిస్థితి జాగ్రత్తగా గమనిస్తున్నాడు. దాదాపు అందరు తన్మయత్వంతో ఏదో పాట పాడుతూ వికట నాట్యం చేస్తున్నారు. తాము ఎటాక్ యిచ్చినా వాళ్ళు పొజిషన్‌లోకి వచ్చి తమ దాడి నెదుర్కోవటానికి ఎటూ కొంత టైం తీసుకుంటుంది. ఆ కాస్త సమయాన్నీ మెలకువగా ఉపయోగించుకోవాలి.

జయవంత్—ఏం చెయ్యాల్సిందీ ముందుగానే మాలికీ, భార్గవకీ చెప్పి వున్నాడు. వాళ్ళు రెడీగానే వున్నారని నిర్ధారణ చేసుకున్నాడు.

డప్పుల మోత, బాకాల మోత కర్ణభేరిని పగలగొట్టేటంత ఉచ్ఛస్థాయికి చేరిపోతున్నాయి. నాట్యంలో వేగం పెరిగింది.

మంత్రగాడు కూడా లయబద్ధంగా ఊగుతున్నాడు. కుడిచేతిలోకి పొడవాటి పదునైన కత్తిని తీసుకున్నాడు. విగ్రహం పాదాల చెంతనుంచి.

నాయకుడివంక చూశాడు మంత్రగాడు.

నాయకుడు జయవంత్‌ని సమీపించి, అతని మెడమీద చెయ్యివేసి వధ్యశిలదగ్గరకు మెల్లగా తీసుకుపోసాగాడు. భార్గవని, మాళిని దాటివెళ్తూ జయవంత్ మాళికి రివాల్వర్‌ని లాఘవంగా అందించాడు.

జయవంత్‌ని వధ్య శిలమీద మెడనొక్కి పట్టాడు నాయకుడు.

"సివరగా అమ్మోరిని పేద్రన సేస్కో!" అన్నాడు నాయకుడు జయవంత్ నుద్దేశించి.

మంత్రగాడు పూనకం వచ్చినట్టు ఊగిపోతున్నాడు. చేతిలోని కత్తిని గాలిలో తిప్పుతున్నాడు.

వధ్య శిలని సమీపించాడు. మరుక్షణంలో జయవంత్ తల మొండెంనుంచి వేరు పడేదే!

కాని మాళి చేతిలోని రివాల్వర్ రెండుసార్లు గర్జించింది. ఓ గుండు మంత్రగాడి చేతిలోని కత్తిని జారిపోయేలా చేస్తే మరోగుండు మంత్రగాడి గుండెల్లోంచి దూసుకుపోయి వాడిని అమాంతం నేల కూల్చేసింది.

జయవంత్ మెరుపులా లేచాడు.

"డోంట్ వేస్టు బులెట్స్. రన్ వే! ఫాలోమీ" అంటూ లేడిలా ముందుకి ఉరికాడు జయవంత్.

పరిస్థితి గ్రహించి ఆటవికులు వెంటబడే లోపల ఫర్లాంగు దూరం పారిపోయారు ముగ్గురూ. చేత బల్లే లున్న నలుగురు ఆటవికులు ముందుగా వాళ్ళని వెంటాడారు. ముగ్గురూ దాటిపోతున్నారని అనుమానం రాగానే చేతుల్లోని ఆయుధాలు గురిచూసి వాళ్ళమీదకు విసిరారు.

ప్రమాదాన్ని ముందుగానే వూహించిన ముగ్గురూ అమాంతం నేలమీద బోర్లా పడిపోయారు. వాళ్ళ వీపుల మీదుగా సర్రున దూసుకుంటూ పోయి నేలమీద పడి

పోయాయి బళ్ళెలు.

మాలి వెంటనే నలుగురిమీద ఒకరివెంట మరొకర్ని నిర్దాక్షిణ్యంగా రివాల్వర్‌తో కాల్చేశాడు.

నలుగురు అనుచరులు నేల కూలిపోయారు.

దూరంగా గూడెం అంతా ఉప్పెనలా కదిలిరావటం కనిపించింది.

జయవంత్ లేచాడు. మాలి, భార్గవ కూడా లేచారు.

"మన గుడ్డలు తెచ్చుకోవద్దా?" అనబోయిన భార్గవ జయవంత్ ఉరిమి చూడటంతో మళ్ళీ నోరెత్తలేదు.

"హరియవ్, వాళ్ళు దగ్గరకొచ్చేస్తున్నారు. రెండు మైళ్ళు వేగంగా పరుగెత్తాలి. మారేడుమిల్లి రోడ్ కనెక్షన్‌కొస్తే చాలు, మనం బతికిపోయినట్టే!" అన్నాడు జయవంత్ పరుగుపెడుతూ.

మాలి, భార్గవ ఆయన్ని అందుకోలేక వెనక పడిపోతున్నారు.

వెనక గూడెం జనం అంతకంతకు దగ్గరపడుతున్నారు. అందులోనించి యిద్దరు మహావేగంగా బల్లెలు పట్టుకుని పరుగెత్తుకొస్తున్నారు. ఏ క్షణాలలోనైనా వాళ్ళు తమని అందుకునేలాగా వున్నారు.

"ఇంకో ఫర్లాంగు దూరం పరుగెడితే చాలు, రోడ్ కొచ్చేస్తాం. హరియవ్!" అన్నాడు జయవంత్.

ఇంతలోనే ఓ బల్లెం వేగంగా వచ్చి మాలి కాలికి తగిలింది. అతను అమాంతం ముందుకు పడిపోయాడు. బల్లెం అతని కాల్లో గుచ్చుకుంది.

సరిగ్గా అదే సమయంలో రోడ్ క్రాసింగ్ దగ్గర్నుంచి ఓ లారీ అటే వస్తోంది.

జయవంత్ వెనక్కి చూశాడు. గూడెం జనం వెను

తిరిగి పారిపోతున్నారు. వాళ్ళు లారీని చూసినట్టుంది.

భార్గవ లారీ ఆపేశాడు. డ్రైవరు పక్కనున్న వ్యక్తి ఆశ్చర్యంగా కిందికి దిగుతూ "మీరా?" అన్నాడు.

అతను సంతాల్! వీళ్ళ ముగ్గురి వేషాలు చూసి విస్తుపోయాడు.

మాలికి గుచ్చుకున్న బళ్ళెం లాగేశాడు సంతాల్. "మరేం ప్రమాదం లేదు. ఇక్కడ హాస్పిటల్ వుంది. పదండి వెళ్దాం" అన్నాడు.

జయవంత్ మాలివంక ప్రశంసగా, జాలిగా చూశాడు. మాలి హీనస్వరంతో మెల్లగా నవ్వాడు.

అర్జున గురించి ఏం చెప్పాలా అని ఆలోచిస్తున్నాడు భార్గవ. నరబలులిచ్చే ఆ గూడెం గురించి, ప్రభుత్వాన్ని దోచుకుంటున్న ఫారెస్టు తాణేదారు గురించీ కూడా ఆలోచిస్తున్నాడు—ఎలా పట్టించాలా అని!

—:అయిపోయింది:—

# లిల్లీ

## వసుంధర

లతను చూడగానే ఒక్కసారి నా హృదయం స్పందించింది. అయితే లత నన్ను చూడలేదు.

లతను నేను ప్రాణంకంటే ఎక్కువగా ప్రేమిస్తున్నాను. ఆమె రూపం నా మనసులో స్థిరమైన ముద్ర వేసుకున్నది.

ఆమె నాకు ఆరు నెలలుగా తెలుసు. తొలి చూపులోనే ఆగలేక ఆమెను పలకరించాను. తర్వాత పరిచయం పెంపొందింది. ఆమెకు నా వివరాలు చెప్పాను. మేము తరచుగా కలుసుకుంటూండేవాళ్ళం.

లత నన్ను ప్రేమించానని ఒక్కసారి కూడా నాకు చెప్పలేదు. మేమిద్దరం ఎప్పుడు కలుసుకున్నప్పటికీ— ప్రేమ గురించి తప్ప ఇతరాలే మాట్లాడుకునే వాళ్ళం. నేనెప్పుడైనా ప్రేమ ప్రసక్తి తీసుకువస్తే లత మార్చేసేది. నన్ను తరచుగా కలుసుకుంటున్నది కాబట్టి ఆమె నన్ను ప్రేమిస్తున్నదనే అనుకున్నాను.

ఈ ఆరు నెలలలోనూ నేనొకసారి క్యాంపుకు వెళ్ళాను. అప్పుడు మేమిద్దరమూ ఉత్తరాలు కూడా రాసుకున్నాం. వాటిలో కూడా ఎక్కడా ప్రేమలేదు. అమెరికన్సు రీగన్ వల్ల ఇబ్బంది పడుతున్నారని విచారించడం కోసం ఆ ఉత్తరాలు రాసుకున్నాం.

లత నాకు అర్థం కావడంలేదు. కానీ ఆమె నా అర్ధాంగి కావాలన్నది నా కోరిక. అందువల్ల నే ఏమో— లత కనబడినప్పుడల్లా నా హృదయం స్పందించక మానదు.

లత హోటలు ముందాగింది. అది హోటలంటే కాఫీ హోటలు కాదు. అక్కడ టిఫిను, భోజనం ఏమీ దొరకవు. అది లాడ్జి.

ఆమె లాడ్జిముందు ఆగడం నాకూ చాలా ఆశ్చర్యంగా ఉన్నది. లాడ్జిలో ఆమెకు పనేముంటుంది?

నేను లతను చూస్తూనే ఉన్నాను. ఆమె లాడ్జిలో ప్రవేశించింది.

నేనింకా ఆశ్చర్యపడ్డాను. ఏం చేయాలో అని ఓ క్షణం తటపటాయించాను. చివరకు ధైర్యం చేసి నేనూ లోపలకు వెళ్ళాను.

లత రిసెప్షన్‌లో ఏమో అడిగింది. తర్వాత చకచకా నడిచింది.

అక్కడ నన్నాపే వాళ్ళెవ్వరూ లేరు. కానీపోగి నేను లతను అనుసరించాను. ఆమె మెట్లెక్కితే నేనూ యెక్కాను. అయితే ఆమె కళ్ళబడకుండా జాగ్రత్త పడ్డాను.

లత ఓ గదిలోకి వెళ్ళింది.

నేను గదిదాకా వెళ్ళి ఆగిపోయాను.

లోపలకు వెడితే?

ఎందుకో మనసొప్పలేదు. అలాగని తలుపు దగ్గర కాపలా కాయలేను.

లోపల్నుంచి అస్పష్టంగా మాటలు వినబడుతున్నాయి. ఎవరో పురుష పుంగవు డున్నాడు లోపల.

నా చెవులు రిక్కించాను. క్రమంగా అవి పదునెక్కాయి. లోపల మాటలు వినగల్గుతున్నాను.

గదికి ఎదురుగా ఉన్న పిట్టగోడ నానుకుని ఎవరికీ అనుమానం కలుగని విధంగా ఆ మాటలు నేను వింటున్నాను. నా ముందునుంచి ఒకరిద్దరు రూం బాయిస్ వెళ్ళడం జరిగింది. యెవరూ నన్ను పట్టించుకోవడంలేదు.

లత గొంతులో తడి ఉన్నది — "నువ్వు నాకు అన్యాయం చేయకూడదు రఘూ!" అన్నదామె.

"అయాం సారీ లతా!" అన్నాడతడు.

"నువ్వొప్పుకోకపోతే ఆత్మహత్యే నాకు గత్యంతరం...."

అతడేమీ మాట్లాడలేదనుకుంటాను. కొద్ది క్షణాల అనంతరం లత యేడుపు నాకు వినబడింది. ఆమె వెక్కి వెక్కి ఏడుస్తున్నది.

నా హృదయం ద్రవించుకుపోయింది. నా లత యేడుస్తున్నది. ఆమె ఏడుస్తూంటే నిస్సహాయంగా వింటున్నాను.

ఏమయింది లతకు?

ఆ రఘు ఆమెను మోసం చేశాడా? మోసం చేయడమంటే....

ఒక్కసారి నా శరీరం వణికింది.

నా లత నాకు కాకుండా పోయిందా? ఆమె వేరే

దుర్మార్గుడి వలలో చిక్కుకుందా? ఆమె చుట్టూ అల్లు కున్న నా ఆశాలతలను నేను ఛేధించవలసిందేనా?

లత తమాయించుకున్నట్లుంది-"వెళ్ళొస్తాను రఘూ!" అన్నదామె.

"వెళ్ళేముందు ముఖం కడుక్కొని వెళ్ళు. కళ్ళు బాగా ఉబ్బాయి...."

"ఎందుకులే రఘూ — ఏడుపు నా జీవితానికింక శాశ్వతం—" అంది లత.

నా కేడుపు వచ్చింది. ఏం జరిగింది? ఎలా జరిగింది? లత ఎంతో తెలివైనది. ఆమె ఓ దుర్మార్గుడి వలలో ఎలా చిక్కుకుంది? లతవంటి యువతిని ఆ దుర్మార్గుడు యెలా తిరస్కరించగలుగుతున్నాడు?

నేను ఆలోచిస్తూనే ఉన్నాను.

ఛళ్ళున గది తలుపులు తెరుచుకున్నాయి. నాకు తప్పించుకునే వ్యవధి లేకపోయింది. లత నన్ను చూసింది. నేనామెను చూశాను.

లత కళ్ళు బాగా ఉబ్బి ఉన్నాయి. ముఖంమీద కూడా కన్నీటి చారలు స్పష్టంగా కనబడుతున్నాయి.

లత నన్ను చూసి ఉలిక్కిపడింది. ఏదో అడగా లనుకుని ఆగిపోయింది. తర్వాత అపరిచితురాలిలా వెళ్ళి పోయింది చరచరా!

నేనూ లతతో మాట్లాడాలనుకున్నాను. కానీ మాట రాలేదు. ఈలోగా తలుపులు వేసుకునేందుకు కాబోలు అతను వచ్చాడు.

నేనతడిని చూశాను.

రూపం నేనూహించుకున్నట్లు లేదు. అతడు చాలా బాగున్నాడు. చూడగానే అందగాడనీ, మంచివాడనీ

అనిపిస్తుంది. అలా ఉండబట్టే లత మోసంలో పడిపోయి ఉంటుంది. ఆశ్చర్యమేమంటే అతడికున్న మీసాలు కూడా అతడి అందాన్ని పెంచడానికీ, అతడు మరింత మంచివాడనిపించడానికీ దోహదం చేస్తున్నాయి. కానీ అతడు దుర్మార్గుడు!

నేనతడివంక క్రూరంగా చూశాను. నా చూపుల్లోని క్రూరత్వాన్నతడు గుర్తించినట్లు లేదు. మామూలుగా తలుపులు వేసుకుని వెళ్ళిపోయాడు.

లతకేదైనా జరిగితే అతడి అంతు చూస్తానని అప్పట్లో అతడికి తెలిసి వుండదు.

నేను రిసెప్షన్‌లో అడిగి రఘు వివరాలన్నీ సేకరించగలిగాను. అందుకని నేను కొన్ని అబద్ధాలు కూడా చెప్పవలసి వచ్చింది.

## 2

నాకున్న మంచి స్నేహితుల్లో కిషోర్ ఒకడు. కిషోర్‌తో నాకు ఆర్నెల్లనుంచి స్నేహం.

అతడు సరదా అయినవాడు. హుషారైనవాడు. భాగ్యవంతుల బిడ్డ. ఎందులోనూ లోటు లేనివాడు. అయితే తన సుఖం కోసం యెదుటివారిని కష్టపెట్టే మనస్తత్వం మాత్రం అతడికి లేదు.

అతడి పద్ధతులు మంచివి కావనీ—సమాజ విద్రోహచర్యలలో అతడికి భాగమున్నదనీ కొందరు నాకు చెప్పారు. నేను పట్టించుకోలేదు. ఈ రోజుల్లో నేరానికి నిర్వచనం — నేరం చేసినవాడి పలుకుబడినిబట్టి మారుతున్నది. కిషోర్ యెలాంటివాడైతేనేం—సమాజంలో అతడికి మంచి పేరే ఉన్నది. నాతోనూ అతడు మంచిగా ఉంటాడు.

కిషోర్ కారణంగానే ఇతరులకు అసాధ్యమైన క్లబ్బుల్లో నాకు ప్రవేశం లభించింది. అక్కడి జీవితం నా డబ్బుతో నేను కొనలేనిది. శారీరకంగా మలినం కాకపోయినా మానసికంగా మలినమయే దృశ్యాలు చాలా చూశాను. నా వయసు కారణంగానేమో—ఆ దృశ్యాలు నాకు జుగుప్సాకరంగాకాక ఆకర్షణీయంగా అనిపించేవి.

నాకు కావాలంటే కిషోర్ ఆడపిల్లల్ని కూడా అప్ప గించి ఉండేవాడు. కానీ నేను లతను ప్రేమించాను. మలినపడిన శరీరంతో నేనామెను పొందాలనుకోరాదు. లతవంటి అపురూప యువతికి స్వచ్ఛమైన ,యువకుడే అర్హుడు. అందుకే యెన్నోమార్లు నా మనసు పక్క దారులు పట్టినా నిగ్రహించుకోగలిగాను. కిషోర్ నన్నె ప్పుడూ నా మనసుకు వ్యతిరేకంగా ప్రోత్సహించడు.

"ఇఫ్ యూ వాంట్ ఐ కన్ అరేంజ్—" అంటా డతడు.

అందుకే అతడంటే నాకు ఇష్టం.

నా మూలంగా కిషోర్ పొందుతున్న ప్రయోజనాలకు అతడినుంచి నాకు లభించే ప్రతిఫలం స్వల్పమైనదని కొందరంటారు. కిషోర్ కోరికమీద నేను కొన్ని చిన్న చిన్న వస్తువులను కొందరికి అందజేస్తూంటాను. స్నేహి తుడిగా నేనతడికి చేసే సాయమది!

ఆ మాత్రం సాయం కిషోర్ కావాలనుకుంటే యే నిరుద్యోగి గ్రాడ్యుయేట్‌కో పదిరూపాయలిచ్చి చేయిం చుకోగలడు. నావల్ల కిషోర్ లాభం పొందుతున్నాడను కోవడం అహంకారంతో కూడిన భ్రమ అవుతుంది. ఈ మాటలు చాలాసార్లు కిషోర్‌తో అన్నాను.

"అందుకే నువ్వంటే నాకు చాలా ఇష్టం—" అన్నాడు కిషోర్.

ఇంతకాలం కిషోర్‌ను నేనేమీ కోరలేదు. అతడా విషయం తలచుకుని బాధపడుతూండేవాడు. ఈ విషయమై అతడు బాధపడడం నాకు సంతోషంగానే ఉండేది. నాకు కిషోర్ అవసరం యెప్పటికి కలగకూడదని కూడా భగవంతుణ్ని ప్రార్థించుకునేవాడిని.

కానీ ఇప్పుడు నాకు కిషోర్ అవసరం వచ్చింది.

లత దుఃఖంలో ఉంది. ఆమెను రఘు తిరస్కరించాడు. రఘునూ ఆమెనూ కలపాలి. లత నాకక్కర్కుండాపోయినా ఫరవాలేదు. ఆమె సుఖంగా వుండాలి. రఘును పెళ్లాడితే ఆమె తప్పక సుఖసంతోషాలతో మనగలుగుతుంది.

కిషోర్‌కు లతను గురించి చెప్పాను.

అతడికి కలిగిన ఆశ్చర్యమింతా అంతా కాదు — "వ్వాట్....నువ్వు ఓ అమ్మాయిని ప్రేమించడమా?" అన్నాడతడు.

"ఏం?" అన్నాను.

"మీ అమ్మా నాన్నా ఏదో సంబంధం చూసి పిలిచేదాకా అసలు నువ్వు ఆడపిల్లల గురించి ఆలోచిస్తావా అనుకున్నాను—" అన్నాడు కిషోర్.

"సరే—లతను నేను ప్రేమిస్తే మాత్రం ఏ మయింది? ఆమెను నే నెలాగూ పెళ్ళిచేసుకోను—" అన్నాడు.

కిషోర్ మళ్ళీ ఆశ్చర్యపడ్డాడు. అప్పుడు నేను లత మోసపోయిన విషయం చెప్పాను.

"బాస్టర్డ్—వాడెవరో నీకు తెలిసిందా?" అన్నాడు కిషోర్.

"తెలిసింది. లతను ప్రేమించినందుకు వాడు నాకు శత్రువు. లత చేత ప్రేమించబడడంవల్ల వాడిని నేను తాకనైనా తాకలేను. లత చావుకు వాడు కారకుడైతే వాడిని నేను బ్రతకనివ్వను...." అన్నాడు.

"ఇదంతా నువ్వు నా కెందుకు చెబుతున్నావు?" చిరాగ్గా అడిగాడు కిషోర్.

"ఈ విషయంలో సాయపడగలవాడివి నువ్వే— వాడినీ లతనూ ఒకటి చేయాలి...."

"సారీ.... నేనిలాంటి విషయాల్లో సాయం చేయలేను" కటువుగా అన్నాడు కిషోర్.

నేను లెక్క చేయలేదు — "అయితే ఆ దుర్మార్గుడు రఘు కారణంగా ఓ అమాయకురాలి ప్రాణం అంతం కావలసిందేనా?" అన్నాను.

కిషోర్ ఉలిక్కిపడి—"లతను వంచించినవాడి పేరు రఘుయా?" అన్నాడు.

"అవును—" అన్నాను.

"నీకెలా తెలుసు?"

జరిగిందంతా కిషోర్‌కు చెప్పాను. వింటూనే కిషోర్ పిడికిళ్ళు బిగిశాయి. అతడు నా భుజం తట్టి—"ఆ రఘు నాకు తెలుసు. వాడిలాంటి పనులు చాలా చేశాడు. అయినా క్షమించాను. కానీ నా స్నేహితుడి ప్రియురాలిని వంచిస్తే వాణ్ని క్షమించలేను. వాడికి మూడిందనే అనుకో—" అన్నాడు.

"వద్దు కిషోర్....వాళ్ళిద్దర్నీ ఒకటి చేయి-చాలు-" అన్నాను.

"కుదరదనుకుంటాను. అతడికిప్పటికే పెళ్ళయింది..."

నేను ప్రొనపడిపోయాను.

కిషోర్ నా భుజం తట్టి—"ఏమిటలాగై పోయావు?" అన్నాడు.

"మరి నా లత జీవితం...."

"లత ఆ రఘుకు భార్య కావాలనుకుంటే రఘు భార్యను ఈ లోకంనుంచి పంపేయాలి. అందుకేర్పాట్లు చేయమంటావా?" అన్నాడు కిషోర్.

అది చాలా అన్యాయమనిపించింది — "వద్దు—" అన్నాను.

కిషోర్ నా వంక జాలిగా చూసి—నువ్వేమీ అనుకోనంటే ఓ మాట చెబుతాను—" అన్నాడు.

"చెప్పు!" అన్నాను.

"రఘుకు లత మొదటి కేసు కాదు. వాడిని నువ్వు చూసే వుంటావు. అమ్మాయిలనిట్టే ఆకర్షించే రూపం వాడిది...."

నాకు రఘు రూపం గుర్తుకు వచ్చింది. భగవంతుడు వాడికి అందాన్నే కాకుండా క్రూరత్వాన్ని అమాయకత్వంగా ప్రదర్శించగల శక్తి కూడా ఇచ్చాడు. అప్పుడే ఏడ్చి వెళ్ళిన లత వాడి గదినుంచే వెళ్ళిందని వాడి ముఖం చూస్తే యెవ్వరూ అనుకోరు. అప్పుడు వాడొక అమాయకుడిలా దిగులుగా కనిపించాడు.

"రఘు, లత కలిసి — కావాలని నీతో నాటక మాడారన్న అనుమానం నాక్కలుగుతోంది-" అన్నాడు కిషోర్.

"అంటే?" అన్నాను.

"ఇదివరలో రఘు ఇలాగే చేశాడు— ఆవేశంలో మనవల్ల ఏదో తప్పు జరిగిపోయింది. నేను వివాహితుడిని కాబట్టి మన వివాహం అసాధ్యం. ఆ జయరాజా నిన్ను

ప్రేమ పేరుతో వెంటాడుతున్నాడంటున్నావు కదా—ఒక్కసారి వాడు చూసేలా మనం మాట్లాడుకుందాం. నువ్వు నన్ను ప్రేమించి మోసపోయినట్లు వాడికి తెలియనీ-అని మోసపోయిన ఆ యువతికి చెప్పాడు—" అన్నాడు కిషోర్.

"అందువల్ల ప్రయోజనమేమిటి?"

"ఒక్కసారి లతపట్ల నీకు కలిగిన భావాలు—ఆ సమయంలో ఎలా ఉన్నాయో గుర్తుచేసుకో—" అన్నాడు కిషోర్.

ఆ సమయంలో నాకు రఘుపట్ల కలిగిన అసహ్యం కంటె లతమీద కలిగిన జాలి యెక్కువ. ఆ జాలి నాలో ఆవేశాన్ని కూడా రగిలించింది. లత జీవితం అన్యాయం కాకుండా ఆమెను పెళ్ళిచేసుకోవాలని కూడా అనుకున్నాను.

నేను చెప్పింది విని—"అదే రఘు ఆ లతకు చేయగల ఉపకారం. అందుకే ఆమె చేత అలా నాటకమాడించాడు" అన్నాడు కిషోర్.

తెల్లబోయాను. లత నన్ను ట్రాప్ చేయాలనుకుంటున్నదా? అయితే జరిగినదేమిటి?

నేను లతను ప్రేమించాను. ఆమెను తరచుగా కలుసుకుంటున్నాను. ఆమె నన్ను కాకుండా రఘును ప్రేమించి అతడివల్ల మోసపోయింది. ఇప్పుడామెకు వివాహమవుతుందా? ఏదో ఒక రోజున గత చరిత్ర ఆమె భావికి అడ్డు తగలవచ్చు. గతం తెలిసీ ఆమెనెవడు వివాహం చేసుకుంటాడు?

అందుకు నన్ను సంసిద్ధుణ్ని చేసే పథకం రఘు తయారు చేశాడు. ఇప్పుడు నేనేం చేయాలి?

నా మనసు లతపట్ల లాగుతున్నది. కానీ రఘు ఆడిన నాటకంలోని ఒక పావుగా, అతడి ఎంగిలి కూడుకు ఆశపడే దౌర్భాగ్యుడిగా నేను మారగలనా?

"నేను నీకు సాయపడలేనన్నాను. అర్థం చేసుకున్నావా?" అన్నాడు కిషోర్.

"రఘు ఆడిన నాటకం నామీద పనిచేయలేదు. అందుకు నువ్వే కారణం. మరి లత ఏమవుతుంది?" అన్నాను.

"కాలు జారిన ఆడది ఏమవుతుంది?" అన్నాడు కిషోర్ హేళనగా.

"ఆమె అందరికిలా కాదు—" అన్నాను ఆవేశంగా.

"అంటే?"

"లత గనుక ఆత్మహత్య చేసుకుంటే నేను రఘును చంపేస్తాను...." అన్నాను.

"రఘును చంపడంవల్ల నీ జీవితం కూడా నాశనమవుతుంది. అలాంటి పిచ్చి పిచ్చి పనులు తలపెట్టకు—" అన్నాడు కిషోర్.

"కిషోర్ — నా గురించి నీకు పూర్తిగా తెలియదు. నేను లతను ప్రాణప్రదంగా ప్రేమిస్తున్నాను. నా లత జీవితంలో నిప్పులు కురిపించిన వాడి బ్రతుకు బయటపెట్టి పదిమందిలో తలెత్తుకోకుండా చేస్తాను. నా దృష్టిలో చంపడం అంటే అదే!" అన్నాను.

"అంతకంటే లతను వివాహం చేసుకోనడం మెరుగు."

"అయ్యో—కిషోర్! నువ్వింకా నన్నర్థం చేసుకోలేదా? నేను లతనెలాగూ వివాహం చేసుకుంటాను. అయినా రఘును వదిలిపెట్టను. అతడి జీవితం నరకం చేస్తాను—" అన్నాను.

కిషోర్ మళ్ళీ ఆప్యాయంగా నా భుజం తట్టి-"నువ్వు చాలా మంచివాడివి. ఇలాంటి మంచితనం చాలా అరుదు. అయితే ఈ మంచితనాన్ని దుర్వినియోగం చేసుకునే వారే ఎక్కువ. నా మాట విని ఒక వారం రోజులు ఈ ఊరు వదిలిపెట్టు. అప్పుడు నీలోని ఆవేశం తగ్గి మామూలు మనిషివి కాగల్గుతావు—" అన్నాడు.

"ఈలోగా లత ఏమైపోతుందో?"

"నువ్వు ప్రేమించిన అమ్మాయి కాబట్టి ఏమీ అనకూడదు కానీ లతమీద కొన్ని అనుమానాలున్నాయి. లత పొరపాటున రఘు వలలో పడిందా—లేక ఆమె ప్రవర్తనలో లోపమున్నదా అన్నది విచారించి ఈ వారం రోజుల్లోనూ నీ కోసం ఓ రిపోర్టు తయారుచేస్తాను.... ఒకవేళ ఆమె నిజంగా అమాయకురాలే అయితే—మీ ఇరువురి వివాహాన్ని నేనే ప్రోత్సహిస్తాను—...." అన్నాడు కిషోర్.

"వారం రోజులు ఎక్కడికి వెళ్ళను? ఏం చేయను?" అన్నాను.

"నేను పని చెబుతాను—" అన్నాడు కిషోర్.

కిషోర్‌లో అదే గొప్పతనం. అందరి అవసరాలనూ తనకు అనుకూలంగా మార్చుకోగల శక్తి అతడికున్నది.

## 3

నాకు ఓ చిన్న బ్రీఫ్‌కేసు ఇచ్చాడు కిషోర్. నాకు చాలా కుతూహలంగా ఉన్నది-అందులో ఏమున్నదోనని!

ట్రెయిన్‌లో తెరిచి చూశాను. సులభంగా నే తెరుచుకుంది. అందులో ఒక చీర వున్నది. అదే రంగు బ్లౌజు పీసు ఉన్నది. ఓ చిన్న కాగితం. దానిమీద రంగురంగుల అక్షరాలు—ఇంగ్లీషులో!

"టు లిల్లీ విత్ లవ్ ఫ్రం కిషోర్."

ఈ బ్రీఫ్ కేసును నేను లిల్లీ కే అందజేయవలసి ఉన్నది. ఆ లిల్లీ యెవరో నాకు తెలియదు. ఆమెతో కిషోర్ కు ప్రేమ తప్ప ఇంకేమీ లేదని ఈ బ్రీఫ్ కేసు ఋజావు చేస్తున్నది.

తాడి చెట్టు క్రింద పాలు తాగినా అనుమానిస్తారు. కిషోర్ పై చాలామందికి ఉన్న అనుమానాలలాంటివేనని నాకు అనిపించింది. అతడా మెకుద్దేశించిన చీరలో రహస్యమేదో ఉన్నదని నేననుకోను.

ట్రయిన్ గమ్యస్థానం చేరగానే దిగి — అడ్రసు వెతుక్కుంటూ లిల్లీ ఇంటికి వెళ్ళాను.

అది ఒక చిన్న బంగళా! విశేషమేమిటంటే అంత బంగళాలోనూ లిల్లీ ఒక్కతె మాత్రమే ఉంటున్నది.

లిల్లీ సౌందర్యవతి. ఆ అందానికి ఆమె వేషధారణ తోడై మగవాళ్ళను రెచ్చగొడుతుంది.

ఆమె చాలా ఆత్రుతగా నానుంచి ఆ బ్రీఫ్ కేసు అందుకున్నది. తెరిచి చూసింది. "ఓహ్!" అన్నది సంబరంగా. నేను ఆశ్చర్యపోయి చూస్తూండగా నా కళ్ళ ముందే చకచకా తనవంటినున్న చీర విప్పి ఆ చీర చుట్టబెట్టుకున్నది.

ఆమె చీర అంత బాగా యెలా కట్టుకుంటుందో తెలియదు. చీర మార్చినా వెంటనే ఆమె షో కేసులో బొమ్మలా తయారై పోయింది. తర్వాత ఆమె నన్ను చూసి నవ్వింది.

నేనింకా షాక్ లో నే వున్నాను.

ఆమె నన్ను సమీపించి-"అయ్యో-నాకు స్ఫురించనే లేదు. నేను చీర నీముందే మార్చుకున్నాను కదూ!"

అన్నది.

"నేను మాట్లాడలేదు.

"నాకు సిగ్గులేదనుకుంటున్నావా?" అన్నదామె.

తల ఊపాను. అలాంటి నిజం ఆమె నుండి తెలుసుకోవాలనిపించింది నాకు.

ఆమె వెంటనే నాకు కాస్త దూరంగా వెళ్ళింది—

"మంచి చీర చూస్తే వెంటనే కట్టుకోవాలనిపిస్తుంది. అది నా బలహీనత...." అన్నది.

"అయితే నీవు షాపింగుకి వెళ్ళకూడదు-" అన్నాను.

నా విసురామెకు అర్థమైనట్లే ఉన్నది. మళ్ళీ నవ్వి—

"షాపులో అందరి ముందూ ఒకో చీరే కట్టుకుని చూస్తానని కదూ నీ అభిప్రాయం. అలా చేసినా అందులో తప్పేమిటో తెలియదు నాకు. నీలాంటి బుద్ధే కిషోర్ దీను. నాకు కావలసిన బట్టలన్నీ తనే పంపిస్తాడు తప్పితే నన్ను షాపింగుకి వెళ్ళొద్దని శాసించాడు—" అన్నదామె.

"నలుగురిముందూ ఒక ఆడది బట్టలు మార్చుకోవడం తప్పని నీకు తెలియకపోవడం నాకు చాలా ఆశ్చర్యంగా ఉన్నది—" అన్నాను.

"నీ ఆశ్చర్యం సంగతి నువ్వు చెప్పావు. మరి నా ఆశ్చర్యం సంగతి నేను చెబుతాను—" అన్నది లిల్లీ.

"ఆడపిల్ల మాక్సీ వేసుకుంటే తప్పులేదు. బెల్ బాటంలో వుంటే తప్పులేదు. నా ఒంటిమీద చీర తీసినప్పుడు నాలో వున్న మార్పేమిటి? నా ఒంటిమీద పెట్టీకోటున్నది. బ్లౌజున్నది. కేరళలో అమ్మాయిలైతే అలాగే ఉంటారు ఎప్పుడూ. చీర శరీరానికి అదనంగా చ్చేది ఓ పైట మాత్రమే. పైట లేకుండా ఆడవాళ్ళు న్నో డ్రస్సులు వేసుకొని తిరిగితే తప్పులేదు. కానీ

ఒక్క చీరలో మాత్రమే పైట లేకపోవడం తప్పు. ఇది నాకు చాలా ఆశ్చర్యంగా వుంటుంది. నా అభిప్రాయంలో చీర అదనపు అందం ఇస్తుంది తప్పితే-శరీరాన్ని కప్పేది ఏం లేదు. యెప్పుడు పడితే అప్పుడు యెక్కడ పడితే అక్కడ మార్చుకునేందుకు వీలైనది చీర అని నాకు అనిపిస్తుంది. కానీ ఏమిటో — మీ మగవాళ్ళ ఆలోచన్లు నాకు అర్థంకావు—"

"చాలా తెలివైనదే—" అనుకున్నాను. తెలివైనదే కాదు. ఆమె చాలాదూరం కూడా ఆలోచిస్తుంది. లిల్లీకీ, కిషోర్ కీ ఏం సంబంధమో అనిపించింది.

"నా మాట ఒప్పుకుంటారా?" అన్నది లిల్లీ.

"ఒప్పుకోను—" అన్నాను — "అనాగరికమైన ఆటవికుల్లో కొన్ని జాతుల్లో బట్టలు ధరించే సంప్రదాయమే లేదు. అయినప్పటికీ వాళ్ళు ఆడవాళ్ళను చూసి అన్ని సమయాల్లోనూ కాక కొన్ని సమయాల్లో మాత్రమే ఆవేశ పడతారు. ఆడపిల్లను అలా చూడ్డానికి వాళ్ళు అలవాటు పడడం అందుకు కారణం.

"నాగరిక ప్రపంచంలో అలా కాదు. ఇక్కడ దుస్తులు ధరించకపోవడం అసాధారణం. అందువల్ల దుస్తులు ధరించనివారు అసాధారణంగా కనబడతారు. అలాగే చీర విషయంలోనూ! చీరను ఒక పద్ధతిలో కట్టుకోవడం అలవాటు. అలా చూడడం మా అలవాటు. ఆ పద్ధతి మారితే మాకు అసాధారణంగానే ఉంటుంది. అందుకు కారణం మనసు అని తెలుసును. అయితే మనస్సును శాసించేది సమాజన్యాయం అనీ నీవు తెలుసుకోవాలి—"

లిల్లీ నవ్వి—"చాలా తెలివైనవాడివి నువ్వు. అందుకే కిషోర్ నిన్ను చేరదీసి ఉంటాడు. అది సరే — నేను

చటుక్కున చీర మార్చుకుందుకు అసలు కారణం చెప్పనా—" అన్నదామె.

"ఇంకో కారణం కూడా ఉన్నదా?" అన్నాను. ఆమె చెప్పేలోగా ఆ కారణం ఊహించడానికి ప్రయత్నిస్తున్నాను. మాకున్న స్వల్ప పరిచయంలో ఆమె నాతో అలా మాట్లాడుతుందని నేననుకోను. మనిషిని చూడగానే గౌరవం పుట్టించేలాగునే ఉంటుంది లిల్లీ.

"నేను ఎప్పుడూ నా అదుపులో ఉంటాను. ఈ సమాజంలో అందులోనూ ఓ ఆడపిల్ల చాలా జాగ్రత్తగా మసలాలన్న విషయం నాకు బాగా తెలుసు. అయితే నిన్ను చూడగానే నాకు పరాయివాడివనిపించలేదు. ఎప్పట్నించో తెలిసినట్లు, యెంతో ఆత్మీయుడవైనట్లు అనిపించింది. అందుకు కారణం బహుశా నాకే తెలియదు...."

నేను ఆశ్చర్యపోయాను. నేనూహించినది లిల్లీ చెప్పిందానికి యెంతో దగ్గర్లో ఉన్నది. అయితే లిల్లీ నోట విన్నాక ఆ కారణం ఎంతో రమ్యంగా, ఆహ్లాకరంగా ఉన్నది. "థాంక్స్—" అన్నాను.

"నేనే నీకు థాంక్స్ చెప్పాలి—నా వద్దకు వచ్చినందుకు...."

## 4

లిల్లీ అందం మగవాళ్ళని రెచ్చగొట్టేదైతే — లిల్లీకి మగవాళ్ళను రెచ్చగొట్టడం తెలుసు. ఆ ఇంట్లో అడుగు పెట్టిన కొద్ది గంటల్లోనే నేను లిల్లీకి లొంగిపోయాను. అసలాయింట్లో నేను లిల్లీకోసం అడుగుపెట్టినట్లే ప్రవర్తించింది లిల్లీ.

మొదటిసారి లొంగిపోయాక నాకెంతో బాధనిపిం

చింది. ఎంతో కాలంగా పవిత్రంగా కాపాడుకుంటూ వస్తున్న ఈ శరీరాన్ని ఎంత సులభంగా మలినపరిచాను?

నా మనసు నా, బలహీనతను అంత సులభంగా ఒప్పుకోదల్చుకున్నట్లు లేదు. నేను లొంగకపోవడానికది కారణాలు వెలికి పెడుతున్నది. అందులో ఒకటి లత.

నేను పవిత్రంగా ఉండాలనుకున్నది లతకోసం. లత నాకు దక్కకుండా పోయిందని తెలిసేక ఆ పవిత్రతకు అర్థంలేదు.

ఒకవేళ లత ప్రాణాలు రక్షించడంకోసం నేనామెను వివాహం చేసుకున్నా ఆమె పవిత్రురాలు కాదు. ఆ బాధ ఆమెను దహించకుండా నేనూ ఓ తప్పుచేశానని చెప్పుకోవచ్చు. ఆమె మనసు ఊరట కలిగించవచ్చు.

లతకోసం ఎన్ని ఎత్తులైనా అధిరోహించగలను. ఎంత పాతాళానికైనా దిగిపోగలను.

“ఎంత నీచానికైనా ఒడిగట్టగలవా?” అని మనసు వెనుకనుంచి అంతరాత్మలాంటిదేదో ప్రశ్నించబోయింది. మనసది వినిపించుకోలేదు.

లతకోసం నేను లిల్లీకి లొంగిపోయాను.

అయితే మొదటిరోజునే లిల్లీ నాతో అన్నది— “నువ్విక్కడ వారంరోజులుంటావు—” అని!

నేను లతకోసమే లిల్లీకి లొంగిపోయి ఉండవచ్చు. కానీ లిల్లీకోసం లిల్లీ మాట కూడా వినగలిగాను. నేనామె చెప్పిన మాట విన్నాను.

నేనేం చేసినా లిల్లీ సంతోషంకోసమే అనుకున్నాను. నా సంతోషం గురించి ఒక్కసారికూడా అనుకోలేను.

లిల్లీ నేనూ ఆ వారంరోజులూ, కేవలం ఆ బంగాళాలోనే గడిపాననుకోవడం పొరపాటు. లిల్లీ నాకు చాలా

పనులు చెప్పింది.

రోజంతా యెన్నో కార్యక్రమాలుండేవి. అన్నింటికీ ఓ టైముండేది. కార్యక్రమాల్లో ఆఖరున నేను లిల్లీతో గడపాలి. అదెలాగో కూడా ఆమె ముందే చెప్పేది. ఒక విధంగా చెప్పాలంటే ఆమె నన్ను ఊరించేది. ఆ కార్యక్రమంకోసం అంతవరకూ లిల్లీ చెప్పిన పనులన్నీ చేసేవాణ్ని—తూచా తప్పకుండా. లిల్లీ నన్ను మెచ్చుకునేది. అన్నమాట తప్పకుండా ఆఖరి కార్యక్రమాన్నమలు పరిచేది.

ఒకరోజు నేను సేఠ్, దుర్గాదాస్ నగల దుకాణానికి వెళ్లాను. లిల్లీ పేరు చెప్పగానే ఆయన నాకు చిన్న ప్యాకెట్ ఇచ్చాడు. అందులో ఏముందో చూసే అవకాశం నాకు కలగలేదు. అది మామూలుగా బంగారు గొలుసులుంచే పెట్టెలాగానే ఉన్నది. కానీ మూత తెరవడం నాకు సాధ్యపడలేదు.

ఆ ప్యాకెట్ తీసుకుని బృందావన్ హోటలుకి వెళ్ళాను. మేనేజరుకి లిల్లీ పేరు చెప్పగానే—ఆయన నన్ను పక్క గదిలోకి తీసుకుని వెళ్ళాడు. నేనిచ్చిన ప్యాకెట్ తీసుకుని నాకో బ్రీఫ్ కేసు ఇచ్చాడు. ఆ బ్రీఫ్ కేసును ఇంకోచోట ఇచ్చాను. అలా రోజంతా వస్తువులు మార్పిడీ చేస్తూనే ఉన్నాను.

ఆఖరున మళ్ళీ నా చేతికి ఓ చిన్న ప్యాకెట్ వచ్చింది. మొదట నాకు దుర్గాదాస్ ఇచ్చినలాంటిదే. విచిత్రమేమంటే నేను ఆ ప్యాకెట్ దుర్గాదాస్ కివ్వడంతో ఆనాటి కార్యక్రమం ముగుస్తుంది.

అయితే నా కార్యక్రమం నేననుకున్నంత సులభంగా ముగియలేదు.

నేను దుర్గాదాస్ షాపులో అడుగుపెట్టగానే పోలీసు డ్రెస్సులోని ఓ మనిషి నన్నటకాయించాడు. అతడు ఇన్‌స్పెక్టరయి ఉండాలనుకున్నాను. అతడి పక్కనే వున్న మరో పోలీసు—"సార్! అదే పాంటు—అదే షర్టు..." అన్నాడు.

"మిస్టర్ — నీ చేతిలోని ఆ ప్యాకెట్ ఏమిటి?" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"అదా?" అన్నాను—"ఉదయం ఓ నగ తీసుకుని వెళ్ళాను. అది నా లిల్లీకి నచ్చలేదు. తిరిగి ఇచ్చేస్తున్నాను."

"నేనోసారి ఆ ప్యాకెట్ తెరవ్వచ్చా?" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

నేను దుర్గాదాస్‌వంక కంగారుగా మాశాను.

"ఉదయం నా దగ్గర అతడు నగ తీసుకున్నాడు సార్! లిల్లీగారు మావద్ద తరచుగా షాపింగు చేస్తూంటారు. ఇందులో అనుమానించదగ్గదేమీ లేదు సార్.." అన్నాడు దుర్గాదాస్ కంగారులో వినయాన్ని జోడించి.

లిల్లీ పేరు మరోసారి వినబడగానే ఇన్‌స్పెక్టరు తడబడ్డాడు — "ఏమైనా ఒకసారి చూడాలి. ఇతగాడు లిల్లీ పేరు తన ప్రయోజనానికి వాడుకుంటున్నాడేమో-"

నాకు ఆశ్చర్యంవేసింది. లిల్లీ అందరికీ లిల్లీయేనా? అదే ఆమె అసలు పేరా? ఆమెకేదో పెద్ద పేరు ఉంటుందనీ కిషోర్ ఆమెకు లిల్లీ అన్న ముద్దు పేరుంచాడనీ నా అనుమానం. అయితే ఊరంతా ఆమెను లిల్లీ అనడమే కాక — ఆమెకు బాగా పలుకుబడి కూడా ఉన్నట్లు తోచింది.

నేను మాట్లాడకుండా ఇన్‌స్పెక్టరుకు ఆ ప్యాకెట్ అందించాను. ఆయన అది తెరిచాడు.

నాకు కలిగిన ఆశ్చర్యం ఇంతా అంతా కాదు. ఆ పెట్టె అంత సులభంగా ఎలా తెరుచుకుంది? ఉదయం నేను చాలా తంటాలు పడ్డానే?

పెట్టెలో ఓ నగ వున్నది. అంతకుమించి అందులో ఇంకేమీ లేదు.

దుర్గాదాస్ ఇన్‌స్పెక్టర్నించి ఆ నగ అందుకుని నా చేతికి ఓ నోట్లకట్ట ఇచ్చి—"ఉదయం మీరిచ్చిన పాతిక వేలూ తిరిగి ఇచ్చేస్తున్నాను—" అన్నాడు.

నేను ఉదయం సేఫ్ కు డబ్బివ్వలేదు. అయితే ఎక్కడా నేను ఏమీ యెదురు ప్రశ్నలు వేయరాదన్నది లిల్లీ ఉత్తరువు.

ఇంటికి వెళ్ళినపుడు లిల్లీని ఆశ్చర్యంగా నా కార్య క్రమం గురించి ప్రశ్నలు వేశాను. లిల్లీ అందంగా విసు క్కుని — "మన కార్యక్రమం గురించి నువ్వేమైనా ప్రశ్నలు వేస్తే నేను చాలా సంతోషిస్తాను—" అన్నది.

ప్రతిరోజూ నేను ఓ కొత్తచోటుకి వెడుతున్నాను. వెళ్ళిన చోటుకి మళ్ళీ వెళ్ళడంలేదు. నా పనేమిటో నాకు అర్థంకావడంలేదు. కానీ మొత్తం నాలుగుసార్లు నన్ను పోలీసులు అనుమానించారు. నాలుగుసార్లూ సుల భంగానే బయటపడ్డాను. అందువల్ల నామీద నాకే నమ్మకం కలిగింది. లిల్లీ చెప్పే పనుల్లో తేడా ఏమీలేదనీ అనిపించింది.

ఎందుకంటే మొదటి రోజున నా కార్యక్రమం చివర్లో పోలీసులు నన్నుమానించారు. మూడో రోజున నేను కార్యక్రమాన్ని ఓ బొమ్మల షాపులో ప్రారం భించాను. అక్కడ షాపువాడు నాకో ప్యాకెట్ ఇచ్చాడు. ప్యాకెట్ అందుకుంటూండగా పోలీసులు

వచ్చారు.

"సార్—అదే మనిషి—" అన్నాడు ఇన్‌స్పెక్టర్ పక్క పోలీసు.

ఇన్‌స్పెక్టర్ నా చేతిలోని ప్యాకెట్ చెక్ చేశాడు. అందులో ఓ బొమ్మ వున్నది. బొమ్మ అందమైనది. ఖరీదైనది. పోలీసులకు సంబంధించినందవరకూ అది సాధారణమైనది.

"ఈ బొమ్మ దేనికి నీకు?" అనడిగాడు ఇన్‌స్పెక్టర్.

"నా స్నేహితుడి పాపకీరోజు పుట్టిన రోజు—" అన్నాను.

ఇన్‌స్పెక్టరు నాతో వచ్చాడు. నేను స్నేహితుడి ఇంటికి వెళ్ళాను. అతదెవరో నాకు తెలియదు. కానీ తలుపు తీస్తూనే అతడు నన్ను చూసి—"హలో—ఏమిటో చేశావే — అయినా నీ పంక్చ్యుయాలిటీ నాకు తెలియంది కాదులే—" అన్నాడు.

అతడి చనువుకు నేనాశ్చర్యపోయాను.

అప్పుడతడు నా వెనుకనున్న పోలీసుల్ని చూశాడు- "అరె—వీళ్ళెవరు?" అన్నాడు.

"ఈ యన తో నాకు మొన్న పరిచయమయింది. ఈయనకీవూరు క్రొత్తగా ట్రాన్సుఫరయిందట. ఇళ్ళకోసం అన్వేషిస్తున్నారు. నువ్వేమైనా సాయపడగలవని తీసుకొచ్చాను—" అన్నాను.

"ఓ—ష్యూర్—మీరు కూడా లోపలకు రండి—" అన్నాడతడు.

అంతా లోపల అడుగుపెట్టాం. అప్పుడు వచ్చింది అతడి భార్య. నన్ను చూస్తూనే—"వచ్చారా అన్నయ్యగారూ—ఏమంటే మరీ అంత కరెక్టుగా ఉండాలా?

అన్న టైముకి ఓ అరగంట ముందువస్తే మీ సొమ్మేం పోయింది?" అన్నదామె.

నేను తెల్లబోయాను. ఆమెను నేను ఒక్కసారికూడా చూడలేదు. ఏమనాలో తెలియక — "పప్పీ ఏదీ?" అన్నాను. ఆ పాప పేరు పప్పీ అని లిల్లీ నాకు చెప్పింది.

"మీకోసం ఒకటే మారాం చేస్తోంది ఇందాకట్నుంచీ! ఇప్పుడే దొడ్లో జారి పడింది. బాత్రూంలోకి వెళ్ళింది వళ్ళు కడుక్కుందుకు. అదృష్టంకొద్దీ ఇంకా కొత్త బట్టలు వేసుకోలేదు. మీరు వచ్చేకనే వేసుకుంటుందిట. మీరే దానికి తొడగాలిట...." అన్నదామె.

ఇంతలోనే ఓ పాప అక్కడకు వచ్చి నన్ను చూస్తూనే "అంకుల్!" అంటూ ఒక్కసారి మీదపడి నా మెడ చుట్టూ తన రెండు చేతులూ వేసింది.

ఆ పాపకు అయిదారేళ్ళు మాత్రం ఉంటాయి. నేనెప్పుడూ ఆ పాపను చూడలేదు. అంత చిన్న పాప నన్ను గుర్తుపట్టి నామీద పడడం నాకు ఆశ్చర్యంగా ఉన్నది. అయితే అలా మీదపడే పిల్లలంటే నాకు అసహ్యం. అయినా ప్రకటించలేదు.

ఇన్‌స్పెక్టరు లేచి-"మరి నేను వస్తాను.." అన్నాడు.

ఆ పాప కూడా నన్ను గుర్తుపట్టి మీద పడటంతో నామీద ఆయనకు కలిగిన సందేహాలన్నీ పటాపంచలైనట్లున్నాయి.

"వచ్చిన పని మరిచిపోయారా?" అన్నాను.

ఇన్‌స్పెక్టరు కళ్ళు తుడుచుకుని— "జీవితంలో నాకు స్నేహితులు లేరు.' మా యింట్లో కుటుంబ సభ్యులమే అంటీ ముట్టనట్లుంటాము. మీ స్నేహం చూస్తూంటే నా మనసేదోలాగైపోయింది. నాకూ ఇలాంటి స్నేహితులుంటే

రయంలో బాగుండుననిపిస్తోంది—" అన్నాడు.

ఇన్‌స్పెక్టరు ముఖం చూశాను. ఆయన్ను చూస్తుంటే నిజంగానే చలించిపోయిన వాడిలాగున్నాడు.

మా స్నేహం ఆయన్ను కదిలించింది. కానీ మా స్నేహం ఒక నాటకం.

తెరపై అమితాబ్ బచ్చన్, శతృఘ్న సిన్హా ప్రాణానికి ప్రాణమిచ్చే స్నేహితులు. కానీ తెర వెనుక....! ఆ సంగతి చాలామందికి తెలియదు. ఆ నటుల పాత్ర పోషణలో వారి స్నేహం నిజమవుతుంది. మేము కూడా ఇప్పుడు అటువంటి అద్భుతరస పోషణ చేస్తున్నాము.

నేను చూస్తూండగా అతడు ఇన్‌స్పెక్టరుకు స్వీట్సు పెట్టి—ఇళ్ళ వివరాలిచ్చి పంపించాడు. నాతో నాటకం యథాప్రకారం కొనసాగించాడు. నేను పాపకు స్వయంగా బట్టలు తొడిగాను. బొమ్మను బహుమతిగా ఇచ్చాను.

అతడు నాకో చిన్న సంచీ యిచ్చాడు. అది తీసుకుని ఇంకోచోటకు బయల్దేరాను. అలా అన్నీ పూర్తిచేసుకుని లిల్లీ దగ్గరకు వచ్చాను. ఆమెను ఉదయపు విశేషాల గురించి ప్రశ్నించకుండా ఉండలేకపోయాను.

"ఆ సమయంలో నాకు నువ్వూ, నీకు నేనూ తప్ప మరేమీ కనిపించకూడదు. అర్జునుడి ఏకాగ్రత ఉండాలి. మన మనసుల్లో మన గురించి తప్ప మరో ఆలోచన ఉండకూడదు ..."

లిల్లీ నన్ను మంత్రముగ్ధుణ్ని చేసి మైమరిపిస్తోంది. కానీ అదెంత సేపు?

ఆ యింట్లో అతను, ఆమె, ఆ చిన్న పాప—అంతలా ఎలా నటించగలిగారు? ఒక పోలీసు ఇన్‌స్పెక్టర్నే కది

లించ గలిగిన విశేషమది!

నాకు ఆశ్చర్యంగా వున్నది. లిల్లీ చెప్పడంలేదు.

మరో రెండుసార్లు నేనూ ఇన్స్పెక్టరు తటస్థపడ్డాము.

"మాటిమాటికీ మీ వెంటబడుతున్నందుకు ఏమీ అనుకోవద్దు. మాకు ఆకాశరామన్న ఫోన్ వస్తున్నది. దాని మీద యాక్షన్ తీసుకోవాలని బయల్దేరితే మీరు తటస్థపడుతున్నారు. ఆ ఫోన్ చేస్తున్నదెవరో తెలుసుకుందామంటే రోజుకొక టైములో—రోజుకొక చోటు చొప్పున మార్చేస్తున్నాడు. సాధారణంగా పబ్లిక్ బూత్ ఉపయోగిస్తున్నాడు—" అన్నాడు ఇన్స్పెక్టర్ నాతో మూడవ సారి మేమిద్దరం కలిసినప్పుడు.

ఆయన చివరి రెండు పర్యాయాలూ నామీద అనుమానంతో కాక తను సక్రమంగా బాధ్యతను నిర్వహించానన్న తృప్తికోసం నన్ను పరీక్షించి చివర్న సారీ కూడా చెప్పాడు. ఆయన నాకు స్నేహితుడైనాడని చెప్పుకోవాలి.

ఆఖరు రోజున నేను లిల్లీని మరీమరీ నొక్కించాను.

"నా మనసును ఎన్నో ప్రశ్నలు దొలిచేస్తున్నాయి. అలాంటప్పుడు అర్జునుడిలా ఏకాగ్రత వహించడం ఎలా కుదురుతుంది?" అన్నాను.

"ఇన్నాళ్ళూ కుదిరి ఇప్పుడెందుకు కుదరదు? నీకు నా మీద వ్యామోహం తగ్గిపోయిందన్నమాట...." అన్నది లిల్లీ.

"పోనీ అలాగే అనుకో—అయితే అందుకు కారణం నువ్వనుకుంటున్నది కాదు. నా నుంచి నువ్వు రహస్యాలు దాచడం...." అన్నాను.

"నీనుంచి రహస్యాలు దాచడం నీకిష్టంలేదు. ఆ

సంగతి నువ్వు నాకు చెప్పేశావు అంటే....ఇంక రేపు నీవు ప్రయాణం కావచ్చు—" అన్నది లిల్లీ.

అర్థమయింది నాకు.

లిల్లీ ఓ పెద్ద ఆకర్షణ! ఆ ఆకర్షణలో యెవరైనా యెటువంటి పనైనా చేయగలరు? కానీ ఆ ఆకర్షణ యెన్నాళ్ళు? అందుబాటులో వున్న ఆడది మగవాడికి లోకువ కావడానికి యెన్నాళ్ళో పట్టదు! ఏ రోజునైతే మగవాడిమీద లిల్లీకి అదుపు తప్పుతుందో—ఆ రోజే వాడికీ లిల్లీకీ ఋణం తీరిపోతుంది.

బహుశా మరో కొత్తవాడు లిల్లీ జీవితంలోకి ప్రవేశిస్తాడు. ఇదీ కిషోర్ ఆడుతున్న నాటకం!

నాకు కోపం వచ్చింది. లిల్లీ నన్ను ప్రేమించలేదు. మోహించలేదు. ఆడుకుంది. నాతో తన పనులకు నన్నుపయోగించుకుంది.

నేను మగవాణ్ని. లిల్లీ ఆడది!

ఆ యింట్లో మేమిద్దరమే ఉన్నాం. లిల్లీ చేత నేను నిజం చెప్పించలేనా? చెప్పించలేకుంటే నా మగతనం ఏమున్నది?

"చూడు....నీమీద చేయి చేసుకోనడం నాకిష్టంలేదు. కానీ నువ్వేమిటో నీ కథేమిటో నువ్వు నాకు చెప్పాలి.." అన్నాను.

"చెప్పకపోతే...." అన్నది లిల్లీ. ఆమె కళ్ళలో భయం స్పష్టంగా కనబడింది. బహుశా నా ఉద్దేశ్యం ఆమెకు అర్థమయే ఉంటుంది.

"ఇంతకాలం నా ప్రేమను రుచిచూశావు. ఈ రోజు ద్వేషాన్ని రుచిమాస్తావు...." అన్నాను.

"నన్ను ద్వేషించడం నీకు అసాధ్యం...." అన్నది

లిల్లీ.

నేను చటుక్కున గది తలుపులు మూశాను. లిల్లీ నా వంక ఆశ్చర్యంగా చూస్తూండగా—"బహుశా పులుసు లోకి కూడా ఎముక మిగలదు....." అన్నాను.

నేను లిల్లీని యెక్కువగా హింసించవలసిన అవసరం లేకపోయింది. చిన్న శాంపిల్ దెబ్బలకే ఆమె భయపడి పోయి నిజం చెబుతానన్నది.

ఆ గదిలో టేపురికార్డరున్నది. ఓ కాసెట్టెని లోడ్ చేసి ఆమె చెప్పిందంతా రికార్డు చేశాను.

లిల్లీ ఓ పెద్ద స్మగ్లింగ్ గ్యాంగుకు చెందిన మనిషి. ఆమెకు సంఘంలో మంచి పలుకుబడి ఉన్నది. ఎందరో రాజకీయ నాయకులు, పురప్రముఖులు, పోలీసు ఆఫీసర్లు ఆమెకు అనుకూలురు. ఆమె బంగళాలో ఒంటరిగా వుంటున్నది. కానీ రాత్రిళ్ళు జంటగా లేని రోజు అరుదు.

స్మగ్లింగ్ అపరేషన్సుకు పథకాలు వేయడంలో ఆమె అందె వేసిన చేయి. అయితే ఆమెకు అప్పుడప్పుడు కొత్త మనుషులు అవసరపడుతూంటారు. అందుకు కిషోర్ లాంటి వాళ్ళు సాయపడుతూంటారు. లిల్లీ పథకాలెంత పకడ్బందీగా వుంటాయో నేనే స్వయంగా చూశాను. అయినా కేళ్ళ పనిపాపలకు కూడా తను కోరిన విధంగా శిక్షణ ఇవ్వగల సామర్థ్యం ఆమెకున్నది.

నేను ఆ కాసెట్టె తీసుకుని జేబులో వేసుకుని—"ఇది యెప్పుడేనా నాకు అవసరపడుతుందేమోనని దగ్గరుంచు కుంటున్నాను. నీకు చెప్పకుండా మాత్రం దీన్ని ఉపయోగించనని హామీ ఇస్తున్నాను—" అన్నాను.

లిల్లీ నావంక చూసి—"ఇప్పుడేనా నీకు నా ప్రేమ మీద నమ్మకం కలగలేదా?" అన్నది.

"అంటే?" అన్నాను.

"నేను నిన్ను నిజంగా ప్రేమించాను. అందుకే నా వివరాలు నా నోటితో చెప్పాను—"

"నువ్వు ప్రేమతో నాకీ వివరాలు చెప్పలేదు. భయంతో—" అన్నాను.

లిల్లీ నవ్వి — "నాకు భయమా — అందులోనూ నువ్వంటే!" అన్నది.

"నా జేబులోని ఈ కాసెట్టే నీ భయానికి నిదర్శనం."

"నామీద నీకున్న అపోహను పోగొట్టి-నా ప్రేమను ఋజువుచేసుకోక తప్పదు—" అన్నది లిల్లీ.

అప్పుడు చూశాను నేను లిల్లీ అసలు ప్రతాపం.

నన్ను లొంగదీసి అశక్తుణ్ణి చేయడానికి ఆమెకు సరిగ్గా రెండేరెండు నిమిషాలు పట్టింది. అంతవరకూ నేను మగాణ్ణి, ఆమె ఆడది అని భావిస్తూ వచ్చాను. నా వెర్రిగానీ—ఓ పెద్ద స్మగ్లింగ్ గ్యాంగును నడుపుతున్న ఆడది సామాన్యురాలవుతుందా.

ఆమె నా భుజాలమీద, నడుం పక్కన, మోకాళ్ళకు పైన—మూడు దెబ్బలు వేసింది. తిరుగు దెబ్బతీసే అవకాశం నాకివ్వలేదు. నా వద్దనున్న కాసెట్టే తీసుకుంది. రికార్డర్లో వేసి ఆన్ చేసింది.

"నువ్వు టేప్ చేసిందంతా కానుకగా నీకే ఇచ్చేయాలనుకున్నాను. ఆ టేపు నన్నేమీ చేయలేదని నాకు తెలుసు. కానీ నువ్వు నా ప్రేమను అనుమానించావు. అందుకే మొత్తం చెరిపేస్తున్నాను—" అన్నది లిల్లీ.

## 5

కిషోర్ కిమ్మని లిల్లీ నాకో వాచీ ఇచ్చింది. దాన్ని భద్రంగా కిషోర్ కి అందజేశాను.

"ఎలా గడిచింది వారం రోజులూ!" అన్నాడు కిషోర్. అతడి ముఖం చూస్తూంటే ఎలా గడిచిందీ తెలిసినవాడిలాగే వున్నాడు.

నేను నవ్వాను.

"శిల్లీ ఈజే స్వీట్ గర్ల్—" అన్నాడు కిషోర్.

అంటే అతడికి వ్యవహారం పూర్తిగా తెలుసునన్న మాట!

"నీ కళ్ళలో వెలుగు కనబడుతోంది. అదే నేను చూడాలనుకున్నది—" అన్నాడు కిషోర్ మళ్ళీ.

"థాంక్స్!" అన్నాను. "అన్నట్లు లత ఎలాగున్నది?"

కిషోర్ ముఖం అదోలా అయిపోయింది — "లత గురించి నువ్వు ఆలోచించక పోవడం మంచిది—" అన్నాడు.

"ఏమయిందో చెప్పు—" అన్నాను.

"లత ప్రవర్తన మంచిదికాదు. ఆమె బారినుంచి తప్పించుకోవడం నీ అదృష్టం. ఆమెకు చాలామంది పురుషులతో సంబంధం ఉన్నది. అయితే నీ ఒక్కడికి తప్ప ఆమె పరిచయస్థులందరికీ ఆమె గురించి తెలుసు—" అన్నాడు కిషోర్.

"నేనోసారి లతను కలుసుకుని మాట్లాడతాను. ఆమె అలా యెందుకు ప్రవర్తించిందో తెలుసుకోవాలి—" అన్నాను ఆవేశంగా.

"లతను కలుసుకోవడం నీవల్లకాదు — ఆమె ఈ లోకంలో లేదు—" అన్నాడు కిషోర్. అతడి ముఖంలో ఏ విధమైన భావమూ లేదు.

కూర్చున్నవాడిని చటుక్కున లేచి నిలబడి— "ఏమన్నావ్?" అన్నాను.

"లత ఆత్మహత్య చేసుకుంది—"

"ఆమె ప్రవర్తన మంచిదికానప్పుడు ఆత్మహత్య చేసుకోవాల్సిన అవసరమేముంది?" అనడిగాను.

"ఆమె రఘును పెళ్ళి చేసుకోవాలనుకుంది. అతడికి తన గురించి తెలియదనుకుంది. అతడు తెలివిగా ఆమెను అనుభవించి తను వివాహితుడినని చెప్పాడు. అప్పుడామెకు ఏం చేయాలో తెలియలేదు. రఘు ఆమెకు ఉపాయం చెప్పాడు. నిన్ను ట్రాప్ చేయాలనుకున్నారు. కానీ నువ్వా ఆమెకు ముఖం తప్పించావు—" అన్నాడు కిషోర్.

"నేను ముఖం తప్పించలేదు. నువ్వే నన్ను బైటకు పంపావు—"

"నేను నా అభిప్రాయం చెప్పడంలేదు. లత ఏమనుకుని ఆత్మహత్య చేసుకున్నదో చెప్పాను—" అన్నాడు కిషోర్.

"లత చచ్చిపోతుందని తెలిస్తే నేనామెను వదిలివెళ్ళివుండేవాణ్నికాదు. కలుసుకుని ధైర్యంచెప్పి ఉండేవాణ్ని—" అన్నాను దిగులుగా.

"ఆమె ఆత్మహత్య చేసుకుంటుందని నేనూ అనుకోలేదు. వయసు తొందరలో కొన్ని తప్పులు చేసింది. ఆ తప్పులు సవరించుకోలేనని గ్రహించి నిరాశచెంది ఆత్మహత్య చేసుకుంది. ఈ దేశంలో ఆడది జాగ్రత్తగా వుండాలి. లేకుంటే లత గతే అందరికీ పడుతుంది—" అన్నాడు కిషోర్.

"వస్తాను కిషోర్—" అంటూ లేచాను.

"ఎక్కడికి బయల్దేరుతున్నావ్? కాసేపిక్కడే వుండు" అన్నాడు కిషోర్ జాలిగా నావంక చూస్తూ.

"ట్రెయిన్ దిగుతూనే నీ వద్దకు వచ్చాను. రూంకు వెళ్ళాలి—" అన్నాను.

కిషోర్ నవ్వి ఊరుకున్నాడు.

# 6

అయితే నేను నా గదికి వెళ్ళలేదు. నాలో ఆవేశం రగుల్తున్నది. లత ప్రవర్తన మంచిదికాదని కిషోర్ చెప్పినప్పటికీ—నాకు మాత్రం రఘు పాత్ర ఇందులో చాలా ఉన్నదనిపిస్తున్నది.

ముందు రఘు అంతం చూడాలి!

రఘు చిరునామా నాకు పూర్తిగా గుర్తున్నది. అందుకే తిన్నగా బస్‌స్టాండుకు వెళ్ళాను. సరిగ్గా గంటలో రఘు ఊరు చేరుకున్నాను. అతడి ఇంటికి వెళ్ళాను. ఓ అందమైన యువతి తలుపు తీసింది.

"రఘు ఇంట్లో వున్నాడా?" అన్నాను.

"లేరు—" అన్నదామె.

ఆమె అన్నదాన్నిబట్టి ఆమె రఘు భార్య అని అర్థం చేసుకోగలిగాను. ఇంత అందమైన భార్య వుండగా రఘు మరో ఆడదాని బ్రతుకు బండలు చేశాడు. అయితే తప్పు కొంత లతలోనూ ఉన్నది.

"నేను లోపలకు రావచ్చా?" మర్యాదగా అడిగాను.

"మీరెవరు?" అన్నదామె.

"నేను లతకు స్నేహితుడిని—" అన్నాను.

"లత ఎవరు?" అన్నదామె.

"రఘుకు కాబోయే భార్య—"

ఆమె ఉలిక్కిపడి — "లోపలకు రండి—" అన్నది. తానెవరో నేను గ్రహించలేదనుకున్నదో ఏమో తను చెప్పలేదు.

ఆమె అడగ్గా—లతను రఘు ప్రేమించినట్లూ—ఇద్దరికీ శారీరక సంబంధం ఏర్పడినట్లూ — ప్రస్తుతం ఆమె గర్భవతీ అనీ చెప్పాను.

ఆమె అంతా విని—"నేనెవరో మీకు తెలుసా?" అన్నది.

"తెలియదు—" అన్నాను.

"పోనీ ఈ యింట్లో యెందుకుంటున్నానో ఊహించు కోగలరా?" అన్నది.

నాలో సస్పెన్సు రేకెత్తించాలని ఆమె ప్రయత్నిస్తున్నదని గ్రహించాను. అందుకు నేనూ సహకరించా లనుకున్నాను.

"వయసుకు బాగా చిన్నవారిలాగున్నారు. మీరతడి చిట్టిచెల్లెలై ఉండాలి—" అన్నాను.

ఆమె ఈ పొగడ్తకు సంతోషించింది. ముఖం కాస్త ఎర్రబడింది. కానీ తొందరగానే తమాయించుకుని— "ఏ చెల్లెలైనా అన్నను మీరని మన్నిస్తుందా?" అంది.

"అదే—ఆ విషయం నేను గమనించనేలేదు—" అన్నాను.

"నేనాయన భార్యను—"

షాక్ తిన్నట్లు నటించాను.

"మీరామాత్రం ఊహించి వుండాల్సింది—" అన్న దామె.

"ఎలా వూహిస్తాను? రఘును నేను మర్యాదస్తుడిగా భావిస్తున్నాను. కేవలం పెళ్ళిమాటలకోసం వచ్చాను నేను—" అన్నాను.

ఆమె ముఖం అదోకలాగైపోయింది—"అది సాధ్య పడదని ఇప్పుడు గ్రహించారా?" అంది నెమ్మదిగా.

"ఎందుకు సాధ్యంకాదో తర్వాత ఆలోచిస్తాను. ముందు నేనతడితో చాలా మాట్లాడవలసి వున్నది—" అన్నాను కోపంగా.

"ప్లీజ్!" అన్నదామె అనునయంగా—"సాయంత్రం బీచికి రండి. అక్కడకు నేను మావారిని తీసుకుని వస్తాను—"

"ఇదేమైనా విహారయాత్రా బీచికి వెళ్ళడానికి...." అన్నాను.

"విహారయాత్ర కాదు. కానీ మేమిక్కడ నాలుగిళ్ళ మధ్య మర్యాదస్తుల్లా బ్రతుకుతున్నాం. ఆయనకిక్కడ మంచి పేరున్నది. ఇప్పుడు మీరిక్కడ రభసచేస్తే అది నలుగురికీ తెలిస్తే ఆయన నలుగురిలో తలెత్తుకోలేరు—" అన్నదామె.

"నలుగురిలో తలెత్తుకోలేనిపని చేశాక తప్పదుకదా!" అన్నాను.

"నాకు వారిమీద నమ్మకమున్నది. మీరాయన్నపార్థం చేసుకుని వుండాలని నా అనుమానం—" అన్నదామె.

"హిందూదేశంలో ప్రతి భార్యా ఈ విధంగా అనుకోవడంవల్లనే ప్రతి భర్తా తప్పులు చేస్తున్నాడు. ఫలితంగా ఆడదే నష్టపోతున్నది—" అన్నాను.

"ఒక్క క్షణం ప్లీజ్!" అన్నదామె—"మీరు నాణేనికి ఒకవైపు మాత్రమే చూస్తున్నారు. ఆడది భర్తను అనవసరంగా అనుమానించడంవల్ల కూడా ఎన్నో సంసారాల్లో కలతలు రేగుతున్నవన్న విషయమూ మీకు తెలిసే వుంటుంది—"

"అంటే?"

"మీరు లతకు స్నేహితిడినని చెప్పారు. ఆ అమ్మాయి ప్రేమించి మోసగించబడితే—మా వారివద్దకు రావడానికి ఆమెకు అయిన వాళ్ళెవ్వరూ లేరా?"

"వున్నారు. కానీ అయిన వాళ్ళలో చెప్పుకునేందుకు ఆమె మొహమాట పడింది—" అన్నాను.

"అంటే ఆమెకు అయినవాళ్ళలోకంటె మీతో యెక్కువ చనువు ఉన్నదన్నమాట—అందుకు కారణం ఏమిటి? మీరిద్దరూ చిన్ననాటి స్నేహితులా?"

"కాదు...." అన్నాను.

"పోనీ మీ యిరువురిదీ హఠాత్తుగా ఏర్పడిన అన్నా చెల్లెళ్ళ బంధమా?"

ఏం జవాబు చెప్పాలో నాకు తెలియలేదు.

"జవాబేం చెప్పాలో ఆలోచిస్తున్నారా?" అన్నదామె.

"మీకు నిజం చెప్పేస్తున్నాను. ఆమెను నేను ప్రేమించాను. ఆమె నన్ను ప్రేమించినదీ లేనిదీ తెలియదు. ఆమెకు నా ప్రేమ గురించి చెప్పి పెళ్ళి చేసుకోవాలనుకున్నాను. ఈలోగా ఈ విషయం తెలిసింది. ఇప్పుడైనా ఆమె నన్ను పంపలేదు. నా లతకు జరిగిన అన్యాయానికి నాలో కలిగిన ఆవేశం నన్నిందుకు అయత్త పరిచింది—" అన్నాను.

"ఆయన తనకు అన్యాయం చేసినట్లు లత మీకు చెప్పిందా?"

నాకు చిరాకేసింది — "ఇవన్నీ మీరెందుకడుగుతున్నట్లు?" అన్నాను.

"ఎందుకంటే...." అని ఆగిందామె—"మీరు చెప్పిన ఊళ్లోనే లత అనే ఆమె వున్నదనీ ఆమెకు అన్యాయం

జరిగితే తను రక్షించలేకపోయాననీ ఆయన కొద్దిరోజులుగా నావద్ద బాధపడుతున్నారు...."

"ఆ అన్యాయం తనవల్లనే జరిగిందని ఆయన చెప్ప లేదా?"

"ఆయన లతకు అన్యాయం చేస్తారని నేననుకోవడం లేదు...."

"ఎందుకని?"

"ఆయన వావివరసలు పాటించని మనిషి కాదు. లత ఆయన పినతండ్రి కూతురు—" అన్నదామె.

నేను చటుక్కున లేచి—"సరే—ఆయన్ను బీచీవద్ద కలుసుకుంటాను—" అన్నాను. సంకేత స్థలం ఆమె చెప్పింది.

7

రఘు భార్యను నేను పూర్తిగా నమ్మలేదు. నన్ను తాత్కాలికంగా వదిలించుకునేందుకామె నాకు చాలా పెద్ద అబద్ధం చెప్పిందని అనుమానంగా వున్నది.

బీచివద్ద కూర్చుని ఆలోచిస్తున్నాను. రఘుకీ లతకూ శారీరక సంబంధమున్నదనడానికి నా వద్ద తిరుగులేని సాక్ష్యమున్నది. రఘు భార్య నమ్మినా నమ్మకపోయినా—వారిరువురి విషయంలో నేను ప్రత్యక్ష సాక్షిని.

టైము సరిగ్గా ఆరయింది. తలెత్తి చుట్టూ చూశాను. దగ్గర్లోనే ఆమె కనిపించింది. ఆమె పక్కనే రఘు వున్నాడు. ఆమె నన్ను చూపిస్తోంది. రఘు నన్ను గుర్తు పట్టినట్లు లేదు.

ఎలా గుర్తుపడతాడు? మేమిద్దరం ఒకేసారి ఒకరి కొకరం యెదురుపడి ముఖాముఖీ చూసుకున్నాం. ఒక అపరిచితుడిలా అతడు నన్ను చూశాడు. అతడి ముఖం

గుర్తుంచుకోనడంకోసమే నేనతణ్ని చూశాను.

ఇద్దరూ నన్ను సమీపించారు.

అతడు నన్ను చూస్తూనే-"మిమ్మల్నెక్కడా చూసిన గుర్తులేదు ..." అన్నాడు.

ఇద్దరూ కూర్చున్నారు. ఆమె నాతో — "మీరు చెప్పినవేమీ నేనీయనకు చెప్పలేదు. మీరు తనను కలుసుకోగోరినట్లు చెప్పాను—" అన్నది.

నాకు ఆశ్చర్యం కలిగింది. అందుకే కాబోలు అతడి ముఖం ప్రసన్నంగా వున్నది. నేనేమి చెప్పబోతున్నానో అతడికేమీ తెలియదనే అనిపిస్తున్నది.

"అయితే మళ్ళీ మొదలుపెట్టాలా?" అన్నాను.

"అవసరంలేదు—" అన్నదామె—"నేను మిమ్మల్ని బీచివద్ద వుండమని యెందుకు చెప్పానో తెలుసా?"

తల అడ్డంగా ఊపాను.

"నాకు ఆవేశం యెక్కువ. మనసులోని కోపం మాటల్లో పోతే తప్ప నేను త్వరగా మామూలు మనిషిని కాలేను. అందుకని ఈయన్ను మీ యెదురుగా పెట్టి బీచివద్ద కడిగేయాలనుకున్నాను. ఇక్కడ ఎంత గట్టిగా మాట్లాడినా బాధలేదు—ఎవ్వరూ వినరు!"

అప్పుడు నేను అసలు సిసలు భార్యను చూశాను.

ఆమె ఆగ్రహావేశాలతో భర్తను నానా మాటలూ అన్నది. ఆమె అన్నదాన్నిబట్టి నేను గ్రహించిన కథ ఇది.

లత తలిదండ్రులకు ఒక్కతే కూతురు. ఆమెకు అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు లేకపోవడంవల్ల తోడుకోసం మహాతాపత్రయపడేది. ఆమెకు రఘు చాలా నచ్చాడు. అతడితో చాలా చనువుగా వుండేది. అతడామెను

చెల్లాయ్ అనేవాడు. ఆమె అతనిని అన్నయ్యా అనేది. అయితే వారి అనుబంధం సినిమా అన్నాచెల్లెళ్ళ అనుబంధంలా ఎబ్బెట్టుగా ఉండేది.

లత తండ్రి రఘు తండ్రికి ఏదో దూరపు వరుసలో తమ్ముడవుతాడు తప్పితే అసలు తమ్ముడు కాడు. అందువల్ల వాళ్ళ అన్నాచెల్లెళ్ళ బంధం కూడా బలహీనమైనదేనని బంధువర్గాల్లో కొందరనుకునేవారు. దానికి తోడు లత తలిదండ్రులిద్దరూ ఆమెకు పదిహేనేళ్ళప్పుడు కారు యాక్సిడెంట్లో మరణించడంవల్ల ఆమె వారి ఇంటనే వుండవలసి వచ్చింది. ఆమె పేరున బ్యాంకులో దెభ్బై వేల రూపాయలకు డిపాజిట్ వున్నది. అయినప్పటికీ ఈ అన్నాచెల్లెళ్ళ బంధంలోని అతి ఎన్నో అపార్థాలకు దారి తీసింది.

"అంతగా అదంటే నీకంత ఇష్టమైతే దాన్నే పెళ్ళి చేసుకో—తప్పులేదు—" అని కూడా రఘు తండ్రి ఓసారి అతడితో అన్నాడు.

"ఓ అన్న చెల్లెల్ని పెళ్ళాడతాడా?" అన్నాడు రఘు.

వారి బంధం అపార్థం చేసుకోబడ్డదని వారిరువురూ అంటారు. ఏమైతేనేం లతకు పెళ్ళి సంబంధాలు కుదరడం లేదు. ఆమెకు చాలా చెడ్డ పేరు వచ్చింది. ఆమె కారణంగా ఆ కుటుంబానికి ఇబ్బందిగా వున్నది. ఆమెకా యింట్లో గౌరవంలేదు. రఘు ఒక్కడే ఆమెను ఓదార్చేవాడు.

చివరకు లత మేజరుకాగానే ఆ యిల్లు వదిలిపెట్టి తన దారి తను చూసుకుంది. అయిన వాళ్ళంతా వుండి ఆమెకు యెందుకూ కొరగాకుండా పోయారు. రఘు

తానొక్కడూ వెళ్ళి ఆమెను చూసి వస్తూండేవాడు. అది తెలిసి తండ్రి కంగారుపడి అతడికి తొందరగా వివాహం జరిపించేశాడు. అతడి భార్య సరసుకు చూచాయగా ఈ విషయాలు తెలుసు. అయితే ఆమె భర్తను నమ్మింది. ఈ రోజులో ఆ నమ్మకం వమ్మయింది. తన ఆగ్రహాన్ని ప్రదర్శించిందామె.

ఆమె కాస్త శాంతించాక — "మీరీమెకు ఏం చెప్పాలో నేను తెలుసుకోవచ్చా?" అన్నాడు రఘు తాపీగా.

అతడి ముఖం చూస్తూంటే నిమ్మకు నీరెత్తినట్లున్నాడు. యెంతకైనా తగినవాడనిపించింది. ఆ రోజు హోటల్లో లతను అంత దుఃఖంలో బయటకు పంపినపుడూ అతడి ముఖం అలాగే వున్నది.

నేను లాడ్జిలో అతడినీ లతనూ కలిపి చూడడం, నేను విన్నవారి సంభాషణ చెప్పాను.

రఘు నిట్టూర్చి — "మీరు చూసినదేమిటి — అర్థం చేసుకున్నదేమిటి—ఇలాంటి అపార్థాలతో నే యెందరో మా జీవితాలను నరకం చేస్తున్నారు—" అన్నాడు.

"నాది అపార్థం. అర్థం మీరు చెప్పండి—" అన్నాను.

"లత ఓ మోసగాడి వలలో చిక్కుకుంది. మోసపోయింది. ఆ మోసగాడినుంచి తనను రక్షించమని వేడుకునేందుకు నా వద్దకు వచ్చింది. ఆ మోసగాడికి సంబంధించిన కొన్ని రహస్యాలు నాకు తెలుసు. అవి బయటపెడతానని బెదిరించి వాడిని తనతో పెళ్ళికి ఒప్పించమంది. ఆ పని నావల్ల కాదన్నాను. అయితే తన బ్రతుకు అన్యాయమై పోతుందంది. కాని నేను ఏం చేయను?"

"నువ్వెంతగానో ఆమెను ప్రేమించావుగదా—ఆమె కోసం ఆమాత్రం చేయలేవా?" అన్నాను వెటకారంగా.

అతడూ సంబోధనమార్చి — "మిస్టర్! నేను లతను అభిమానించినప్పటికీ — అంతకంటె యెక్కువగా నా జీవితాన్ని ప్రేమిస్తున్నాను. నా జీవితంలోకి సరసువచ్చి నప్పట్నించీ—అది మా యిరువురికీ మరింతగా పరిమితమై పోయింది—" అన్నాడు.

"ఆమెను కాపాడ్డంలో అంత ప్రమాదమున్నదా?"

"మాస్కు వెళ్ళి బ్రెజ్నేవ్‌ను తిడితే ప్రమాదముం టుందా అన్న అనుమానం యెవరికైనా వుంటుందా?"

"దానికీ దీనికీ సంబంధ మేమిటి?" అన్నాను.

"అయితే కిషోర్ సంగతి నీకు తెలియదన్నమాట!"

కిషోర్ పేరు వింటూనే ఉలిక్కిపడి—"కిషోర్—అంటే ఏ కిషోర్ ...." అన్నాను.

అతడు చెప్పిన వివరాలు నా స్నేహితుడు కిషోర్‌కు సరిపోయాయి. ఆ తర్వాత నాకు నోటమాట రావడానికి కొంతసేపు పట్టింది.

రఘు చెప్పుకుంటూ పోయాడు. లత కిషోర్‌ని ప్రేమిం చింది. అతడూ తన్ను ప్రేమించాడని నమ్మింది. ఓ బల హీన క్షణంలో అతడికి లొంగిపోయింది. తర్వాత ఆమెను కిషోర్ వివాహం చేసుకుందుకు నిరాకరించాడు. ఆమె రఘు సాయం కోరింది. కిషోర్‌కు భయపడి అతడు నిరాక రించాడు.

అతడు చెబుతూంటే నేను వినడంలేదు. ఆలోచి స్తున్నాను. ఇందులో కిషోర్ పాత్ర నిజంగా వున్నదా? అతడే ఆమెను మోసం చేశాడా? అందుకే నన్ను పారుగూరు పంపేశాడా?

నేను కిషోర్‌తో యేమన్నాను? వారం రోజుల్లో ఆమె ఆత్మహత్య చేసుకుంటే అందుకు కారకుడైనవాడి బ్రతుకు బయటపెడతానని! లతను నేను కలుసుకుంటే అసలు నిజం నాకు తెలిసి బయటపెడతానని కిషోర్ భయపడ్డాడా?

"నువ్వు చెప్పింది నిజం కావచ్చు. కానీ నమ్మదగ్గదిగా లేదు—" అన్నాను నేను రఘుతో.

"అన్నీ లత చేతే నీకూ, నరసుకూ కూడా చెప్పిస్తాను...."

"ఇంకా లత యెక్కడుంది రఘూ — ఆమె జరిగిన అన్యాయానికి తట్టుకోలేక ఆత్మహత్య చేసుకున్నది—" అన్నాను.

రఘు తెల్లబోయాడు. తర్వాత అతడు ముఖం చేతులతో కప్పుకుని ఏడ్వనారంభించాడు. అప్పుడు నరసు ప్రేమగా అతడితో అన్నది—"నా కోసం మీరు లతను కాపాడగలిగీ కాపాడలేదు. ఇది నేను జీవితాంతం గుర్తుంచుకుంటాను—"

రఘు ఇంకా ఏడుస్తూనే వున్నాడు.

అప్పుడామె నావంక తిరిగి — "మీ పగ ఇప్పుడా కిషోర్ మీదకు మళ్ళి వుండవచ్చు. కానీ ఆ కిషోర్ వద్ద ఈయన పేరు చెప్పి మా జీవితాల్లోకి తుఫాను తీసుకు రాకండి. పోయిన లత యెలాగూ బ్రతకదు—" అన్నది.

నేను లేచాను.

నా మనసంతా అయోమయంగా వున్నది.

లతను కులట అన్నాడు కిషోర్. రఘువల్ల ఆమె మోసపోయిందని తనసుకున్నాడు. కిషోర్ ఆమెను మోస

గించాడని రఘు అంటున్నాడు.

ఇందులో ఏది నిజం?

# 8

బస్సు దిగుతూనే గదికి వెళ్ళాను. గదిలో మూడు ఉత్తరాలున్నాయి. ఒకటి నాన్నగారి దగ్గర్నుంచి. మిగతా రెండింటిపైనా దస్తూరీ చూడగానే మనసేదోలా అయిపోయింది. ఆ దస్తూరీ లతది!

అంటే లత నాకు ఉత్తరాలు రాసిందన్నమాట. అప్పుడు నేనూహించలేను.

ఒక ఉత్తరం చిన్నది.

"మైడియర్!

జీవితంలో అనుకోనివిధంగా మోసపోయాను. నీతో అర్జంటుగా మాట్లాడాలి. ఎల్లుండి "కోరుకున్న మొగుడు" పిక్చర్‌కి మొదటి ఆటకు రా— అన్నీ అక్కడ మాట్లాడుకుందాం— నీ

లత."

రెండో ఉత్తరం కాస్త పెద్దది.

"మైడియర్!

నువ్వు రాలేదు. నీ ఉనికి కూడా తెలియనివ్వకుండా ముఖం చాటేసి నీ మగబుద్ధిని బుజువు చేసుకున్నావు. ఒకసారి జీవితంలో మోసపోయాక అది తెలిసి నీ జీవితంలోకి నేను ప్రవేశిస్తానని భయపడ్డావనుకుంటాను. ఈ లతను నువ్వు తప్పుగా అర్థం చేసుకున్నావు.

నీకు నామీద ప్రేమ ఉన్నదని తెలుసు. అది ఇంకా వుంటుందని నేననుకోవడంలేదు. ఈ ఉత్తరం నీకు అందే సమయానికి నేను నీకు అందని

చోటుకు వెళ్ళిపోతాను.

అయితే ఒక చిన్న మనవి. నా దుర్గతికి కారకుడు కిషోర్. చాలా తెలివిగా వాడు నన్ను మోసగించాడు. వాడి మోసంలో భయంకరమైన స్వార్థమున్నది. వాడి వివరాలు ఈ ఉత్తరంలో ఇస్తున్నాను. నాకు అయినవాళ్ళ శక్తి వుండీ కిషోర్ జోలికి వెళ్ళడానికి భయపడ్డారు. నువ్వేదో చేస్తావన్న ఆశ నాకు లేదు. ఏదో ఓ రాయి విసిరి చూస్తున్నాను. అంతే! నీకింకా నామీద ప్రేమ మిగిలి వుంటే — ఆ రాక్షసుడు కిషోర్ గుట్టుకు బయట పెట్టు.. అదొక్కటే నిన్ను కోరేది!

మరి నీనుంచి శాశ్వతంగా సెలవు తీసుకోనా?

నీ కేమీ కాని

లత."

ఉత్తరం చదవగానే నా పిడికిళ్ళు బిగిశాయి.

కిషోర్ నాకెంత మిత్రద్రోహం చేశాడు?

అంటే రఘు చెప్పిందంతా నిజం.... అనవసరంగా నేనతడిని అనుమానించాను. అతడి శాపురంలో నిప్పులు పోయాలనుకున్నాను.

కిషోర్ ఆయువుపట్టు చాలా తెలుసు నాకు. బయట పెడితే?

కిషోర్ ప్రమాదకరమైన మనిషి. లతను చిన్నప్పట్నించీ యెవరెన్ని విధాల అపార్థం చేసుకున్నా లెక్క చేయక ప్రాణానికి ప్రాణంగా చూసుకున్న రఘు— కిషోర్‌కి భయపడి ఆమెను ఆత్మహత్య చేసుకోనిచ్చాడు.

అంటే కిషోర్ యెంతటి ప్రమాదకరమైన మనిషి.....

అయినా నేను లెక్క చేయదల్చుకోలేదు. అప్పటి

కప్పుడు కిషోర్ దగ్గర కెళ్ళాలనుకున్నాను.

అప్పుడు నేను నాకు వచ్చిన మూడో ఉత్తరాన్ని గమనించాను.

నాన్నగారు వ్రాశారది. అంతవరకూ చదవనేలేదు. కవరు చింపి ఉత్తరం తీశాను.

“చిరంజీవి బుచ్చిని దీవించి వ్రాయునది—” నాన్న యెప్పుడూ నన్ను బుచ్చి అనే పిలుస్తాడు. ఉత్తరాల్లోనూ అలాగే వ్రాస్తాడు. ఏమిటో ఆ సంబోధన చూడగానే మనసేదోలాగై పోయింది. ఒక్కసారిగా నా వయసు తగ్గిపోయి చిన్నపిల్లవాడినై పోతాను.

“నీవు తక్షణం నీ ఉద్యోగానికి రాజీనామా చేసి ఇక్కడకు రావలసింది. నీకో మంచి పెళ్ళి సంబంధం వచ్చింది. అమ్మాయి కుందనపు బొమ్మ. వారిది లక్షల ఆస్తి. కొత్తగా మన వూరు వచ్చి స్థిరపడ్డారు. వారూ మనం ఏక కుటుంబంగా కలిసిపోయాం. తలిదండ్రులకు ఒక్కతే కూతురు....”

ఉత్తరం చదువుతూంటే నాకు మతిపోయినట్లయింది. లత గురించి బెంగపడుతూ నేనావేశపడుతూంటే ఈ ఉత్తరం నామీద నీళ్ళు చిలకరించినట్లయింది.

ఒకప్పుడు లతకోసం ఏమైనా చేయాలనుకున్నాను. ఇప్పుడు లత లేదు. అయినా నా ప్రేమని నిరూపించుకునేందుకు లత అవకాశమిచ్చింది. కానీ లత నాకోసం ఏమిచేసిందని నేనామెకోసం ఏమైనా చేయాలి? చిన్నతనంనుంచీ చెల్లిగా ప్రేమించిన రఘు చేయలేని త్యాగం నేనెందుకు చేయాలి? చేసి మాత్రం ప్రయోజనమేమిటి? ఇప్పుడు లత యెలాగూ లేదు.

నేను కిషోర్ వద్దకు వెళ్ళాను. అతడు నన్ను చూసి తడబడ్డాడు.

"రఘును కలిశావా?" అన్నాడు.

"లేదు. లత నాకు ఉత్తరం వ్రాసింది. అది చదివాక అతడిని కలవాల్సిన అవసరం లేదనిపించింది-" అన్నాను.

"మరి నన్నెందుకు కలుస్తున్నావు?" అనుమానంగా అడిగాడు.

"లత మోసపోయింది నీ వల్లనే అని నాకు తెలిసి పోయింది—"

"అయాం సారీ—" అన్నాడు కిషోర్.

"కిషోర్! ఇలా ఎందుకు చేశావ్?" అన్నాను.

"లతను నువ్వు ప్రేమించావని నాకు ముందే తెలిసి వుంటే ఈ పని జరిగుండేది కాదు. నువ్వు నాకా విషయం యెన్నడూ చెప్పలేదు—" అన్నాడతను.

"నేనడుగుతున్నది మిత్ర ద్రోహం గురించి కాదు. లతకెందుకు ద్రోహం చేశావని!" అన్నాను నెమ్మదిగా.

"ఆ విధంగా చెప్పాలంటే నేను నీకు ఉపకారమే చేశాను. లత నిజంగా మంచిది కాదు. సమాజంలో నాకున్న హోదాను, పలుకుబడిని ఆమె ప్రేమించింది. నన్ను పెళ్ళాడాలనుకుంది. ఓ రోజున ఏకాంతంలో నన్ను ప్రోత్సహించి, రెచ్చగొట్టింది. మోసపోయింది ఆమె కాదు—నేను!"

"ఏమైతేనేం—చివరికి నష్టపోయింది ఆమె కదా!" అన్నాను.

"నన్ను మోసం చేయాలనుకున్న వారందరూ నష్ట పోతారు—" అన్నాడు కిషోర్.

"కానీ యెల్లకాలం అసాధ్యపడదు...."

"ఏమిటి నువ్వనేది? లత గురించి నువ్వు నాకు ఎదురు తిరుగుతావా?" అన్నాడు కిషోర్.

"నేను మిత్రద్రోహం గురించి మాట్లాడలేదు. నువ్వు చేసుకునే ఆత్మవంచన గురించి చెబుతున్నాను...."

కిషోర్ కోపంగా—"నువ్వు నన్నేమైనా చేయగలనను కుంటున్నావేమో—నీ జీవితం నా గుప్పిట్లో వున్నది—" అన్నాడు.

"నేను నీ గురించి ఆలోచించను కూడా ఆలోచించను. ఇప్పుడు నేనిక్కడికి యెందుకు వచ్చాను? నేనీ వూరువదిలి వెడుతున్నాను. నీ ఆశీర్వచనం కావాలి—" అంటూ నాన్నగారి ఉత్తరం గురించి చెప్పాను.

"వెరీ గుడ్—ఐ విష్ యూ ఆల్ ది బెస్టు!" అన్నాడు కిషోర్.

## 9

నాకు పెళ్ళయి మూడు సంవత్సరాలయింది. జీవితం సుఖంగా కొనసాగిపోతున్నది. కిషోర్ మళ్ళీ నా జోలికి రాలేదు.

అనుకోకుండా కారు చెడిపోవడంవలన ఆ ఊళ్ళో ఆగవలసి వచ్చింది.

ఆ ఊరు నాకు బాగా గుర్తున్నది. నిజం చెప్పాలంటే నాకు ఆ ఊరి పేరు వినగానే లిల్లీ గుర్తొస్తుంది. లిల్లీతో గడిపిన వారం రోజులూ నేను మరిచిపోలేను. మగవాడిని ఎలా సుఖపెట్టాలో ఆమెకు తెలిసినంత బాగా కనీసం నా భార్యకు తెలియదని నేను ఒప్పుకోక తప్పదు.

కారును గ్యారేజిలో వదిలి సేఠ్ దుర్గాదాస్ షాపుకు వెళ్ళాను. అది కాకతాళీయమో ఏమో మరి—అప్పుడే ఒకతను దుర్గాదాస్‌తో — "నన్ను లిల్లీ పంపింది!"

అన్నాడు. దుర్గాదాస్ అతడికి ఏదో ప్యాకెట్ ఇచ్చాడు.

ఆ తర్వాత ఏం జరుగుతుందో నాకు తెలుసు. అతడు సాయంత్రం దాకా ఇల్లు చేరుకోడు.

నా మనసు లిల్లీవైపు లాగింది.

ఇప్పుడు ఇంట్లో లిల్లీ ఒంటరిగా ఉంటుంది. ఒక్క సారి నేను వెడితే ఏం చేస్తుంది? నాతో ఏమని మాట్లాడు తుంది.

సాయంత్రందాకా కారు సిద్ధం కాదు. అంతవరకూ లిల్లీతో కాలక్షేపం చేయాలనుకున్నాను.

ఆమె ఇంటికి వెళ్ళాను. లిల్లీయే స్వయంగా వచ్చి తలుపు తీసింది. ఇంట్లో ఇంకెవ్వరూ లేరు.

"గుర్తున్నానా?" అన్నాను.

ఆమె తల ఊపింది.

"నీతో గడిపిన ఆ వారం రోజుల అనుభూతి ఈ జన్మకు సరిపోతుంది—" అన్నాను ఆమె వంకనే పరి శీలనగా చూస్తూ.

ఆమె మాట్లాడలేదు.

"మరో జన్మకు సరిపడ అనుభూతులకోసం ఇక్కడకు వచ్చాను—" అన్నాను.

ఆమె మాట్లాడలేదు.

నేనామెను సమీపించి—"ఏళ్ళు గడిచినా నీ వంటి నునుపులో యేమీ మార్పులేదు—" అన్నాను.

అప్పటికీ ఆమె మాట్లాడలేదు.

"మాట్లాడవేం లిల్లీ!" అంటూ ఆమెను సమీపించి ఆమె మేలి ముసుగును తొలగించి ఉలిక్కిపడ్డాను.

ఆమె లిల్లీ కాదు.

నేను చనిపోయిందని భావిస్తున్న లత!

"లతా!" అన్నాను ఆశ్చర్యంగా.

"నా పేరు లత కాదు. లిల్లీ!" అన్నదామె.

"ఏమిటీ మాయ?" అన్నాను అర్ధంకాక.

"లత నీకో ఉత్తరం రాసింది. దానిమీద వెంటనే నీవు చర్య తీసుకునివుంటే లత లిల్లీగా మారివుండేది కాదు...."

"లత లిల్లీగా మారడమేమిటి?"

"లిల్లీలకోసమే కిషోర్ ఆడపిల్లలను మోసం చేస్తూంటాడు. మోసపోయిన ఆడదానికి వేరేదారి లేకుండా చేసి అప్పుడు తన నీడలో శిక్షణ ఇస్తాడు. ఈ యింట్లో లిల్లీ వుండదు. ఈ యింట్లో వుండే ఆమె పేరు లిల్లీ! నెల నెలా ఇక్కడి లిల్లీ మారుతూ వుంటుంది. మారిన లిల్లీ మరో ఊళ్ళో రోజీ అవుతుంది...."

"లతా-నిన్నీ నరకంనుంచి తప్పిస్తాను...." అన్నాను.

"నన్ను లతా అనకు. నన్నిక్కణ్ణించి తప్పించడం నీవల్ల కాదు. తప్పుకోవడం నాకు క్షేమంకాదు—" అన్నది లత.

"నేను బలవంతంగా నిన్నిక్కణ్ణించి తీసుకునిపోయి నీకు మంచి వరుణ్ని చూసి...."

"నేనింకా యేదో అనబోతుంటే — నీలో అంత సంకల్ప బలముంటే అందుకు ప్రేమ కారణమయుండాలి. నీలో అంత ప్రేముంటే ఈనాడు నేనిలా మారి వుండే దాన్ని కాదు. ఇప్పుడు నేను నీకంటే బలవంతురాల్ని— నన్ను బలవంతంగా ఇక్కణ్ణించి తీసుకుని వెళ్ళడం నీవల్లకాదు—" అన్నది లత.

హఠాత్తుగా నాకు ఆనాటి లిల్లీ గుర్తుకు వచ్చింది.

ఆమె నా దగ్గరనుంచి కాసెట్టేను యెంత సులభంగా లాక్కుంది?

నేను మారు మాట్లాడకుండా అక్కడ్నించి బయట పడ్డాను.

తనచుట్టూ జరిగే అన్యాయాలను పట్టించుకోకుండా తన బ్రతుకు బ్రతికే సామాన్యుడు భారత పౌరుడు. నేను భారత పౌరుణ్ణి!

—:ఐ పో యిం ది:—

# గాలికోడి – గాజుకన్ను

## అజీజ్

"డాక్టర్ నిర్మల స్పీకింగ్!"

"నా పేరు జయరామ్! వృత్తిరీత్యా లాయర్ని. మీతో కొన్ని ముఖ్య విషయాలు మాట్లాడాలని అర్జంటుగా కణ్ణనూర్ నించి మద్రాసు వచ్చాను."

నిర్మల కనుబొమలు ముడిపడ్డాయి. అతని పేరుగానీ, ఆ ఊరి పేరుగానీ అదివరకు ఎక్కడా, యెప్పుడూ విన్న గుర్తులేదు.

వినా మర్యాదకోసం ఆ వేమీ అడక్కుండా, "చెప్పండి" అంది సౌమ్యంగా.

"ఫోన్‌లో చెప్పే విషయాలు కావవి. పర్సనల్‌గా కలుసుకుని వివరించాలి. కణ్ణనూర్ నించి మద్రాసు రాగానే ముందు మీరు పనిచేస్తున్న ప్రభుత్వాస్పత్రికి ఫోన్ చేసి, మీ గురించి అడిగాను.

డ్యూటీ అయిపోయిందనీ, ఇప్పుడే ఇంటికెళ్లారనీ తెలిసింది. మీ ఫోన్ నెంబర్ కనుక్కుని, ముందు నా

గురించి పరిచయం చేసుకుందామని ఇలా ఫోన్ చేశాను."

"ఎక్కణ్నించి మాట్లాడుతున్నారు?"

"అశోకా హోటల్, రూం నెంబర్ నూటపదహారు నించి."

"సరే, మీకోసం యెదురుచూస్తుంటాను, రండి."

"థాంక్స్!" అవతల క్లిక్ మంది.

రిసీవర్ పెట్టేసి ఆలోచనలోపడింది నిర్మల. ముక్కూ, మొహం తెలీని ఓ లాయర్ కు తనతో ఏంపనబ్బా? ఎంత ఆలోచించినా ఓ పట్టాన అంతుబట్టడం లేదామెకు. కాసేపట్లో అసలు విషయం యెలాగూ తెలుస్తుందికదా, అనవసరంగా ఆలోచించి బుర్రకు అలసట ఇవ్వడం దేని కనుకుంటూ టవలందుకుని బాత్ రూంవైపు నడిచింది.

చన్నీళ్ళతో కాస్త కాళ్ళూ, చేతులూ, మొహం కడుక్కొని, పౌడర్ అదీ అద్దుకొని, కప్పు కాఫీ సేవించ గానే హాస్పిటల్లో అంకురించిన అలసట అంతా అదృశ్యమై, మనసు మళ్ళీ మామూలు స్థాయికి వచ్చేసింది.

అంతలో బైట టాక్సీ వచ్చి ఆగిన చప్పుడూ, ఆ వెంటనే కాలింగ్ బెల్ మోగిన చప్పుడూ వినిపించి, వెళ్ళి తలుపు తెరిచింది.

"గుడాఫ్టర్ నూన్ డాక్టర్!" అన్నాడతను చిరుదర హాసంతో.

తలతోనే అతనికి అభివాదంచేసి, "రండి, లోపలికి రండి" అంది నిర్మల తలుపుకడ్డం తొలుగుతూ.

అతను లోన అడుగుపెట్టాడు. సుమారు ముప్పై ఆరేళ్ళుంటాయతనికి. పొడుగు, పొడుక్కుతగ్గ లావు కాక పోయినా, మామూలు పెర్సనాలిటీ. పక్కపాపిడితీసి,

కాస్త నుదురుమీద పడేలా దువ్వుకున్న జుత్తు, లైట్ బ్లూ కలర్ సూటు, మెడలో నేరేడు రంగు టై, చేతిలో బ్రీఫ్ కేస్.

"కూర్చోండి" అంది నిర్మల డ్రాయింగ్ రూంలోని సోఫా చూపుతూ.

అతను కూర్చున్నాక అడిగింది, "కాఫీ, కూల్ డ్రింక్స్ ఏం తీసుకుంటారు?"

"ఈ సీజన్‌లో మద్రాసు వాతావరణం మరీ భరింప రాని వేడితో నిండిపోతుంది. చల్లని నిమ్మరసం వుంటే."

నిర్మల లేచి, ఫ్రిజ్‌లో రెడీగా వున్న నిమ్మరసం బాటిల్ అందుకొని, గ్లాసునిండా పోసి అతనిముందుంచింది.

గ్లాసు ఖాళీచేసి, "సిగరెట్ అంటించవచ్చా?" అడిగాడతను.

"ఇష్టంలేదు. కానీ కొందరికి అత్యవసరమైన అలవాటును అభ్యంతర పెట్టడం భావ్యంకాదు. అంటించండి" అంటూ అతని ముందు సోఫాలో కూర్చుంది నిర్మల.

"థాంక్స్" అంటూ సిగరెట్ తీసి అంటించి, డాక్టర్ల జ్ఞాపకశక్తి చాలా చురుకైనదంటారు. కణ్ణనూర్ వాస్తవ్యురాలు శ్రీమతి సరస్వతీదేవి జ్ఞాపకం వున్నారా మీకు?" అడిగాడు.

ఆశ్చర్యంతో నిర్మల కళ్ళు విప్పారాయి. "నాకు తెలిసినంతవరకూ ఆ పేరుగల స్త్రీ మా బంధువర్గంలో గానీ, పరిచయస్థుల్లో గానీ యెవ్వరూలేరు. పైగా ఆ ఊరిపేరు కూడా ఇప్పుడే కొత్తగా వింటున్నాను."

ఈసారి అతని మొహంలో ఆశ్చర్యం ప్రస్ఫుటమైంది. బాగా జ్ఞాపకం చేసుకోండి. ఏడాది క్రితం కణ్ణనూర్

నించి హృద్రోగంతో వచ్చి, మీ ఆస్పత్రిలో, మీ నేతృత్వంలో చికిత్సపొంది వెళ్ళిందామె, జ్ఞాపకం వచ్చిందా?"

తల విదిల్చింది నిర్మల, "సారీ, సరిగ్గా గుర్తురావడం లేదు. వివిధ రోగాలతో రోజూ హాస్పిటల్‌కు ఎందరో వస్తుంటారు. పోతుంటారు. ఎందరినని గుర్తుంచుకుంటాం? ఆ పేరు యెప్పుడో విన్నట్టే వున్నా, స్పష్టంగా గుర్తు రావడంలేదు. పైగా నేను హార్టు స్పెషలిస్టుని కూడా కాను. ఆర్థోపెడిక్ డాక్టర్ని!"

"చిత్రంగా వుంది. ఏ బంధుత్వమూ లేకుండా బలీయమైన బాంధవ్యమూ లేకుండా ఆవిడ యేకపక్షంగా మీ పట్ల ఇంతటి అనుబంధం పెంచుకుందంటే చాలా ఆశ్చర్యంగా వుంది" అంటూ బ్రీఫ్‌కేస్ ఎత్తి ఒళ్లో పెట్టుకుని తెరిచాడతను.

అందులోంచి ఓ ఫోటోతీసి, "చూడండి, ఈ ఫోటో చూశాకనైనా ఆవిడ జ్ఞాపకాలు మీలో జాగృతం అవుతాయేమో!" అంటూ నిర్మల కందించాడు.

ఫోటోమీద దృష్టిపడ్డ మరుక్షణం ఆమె బుర్రలో జ్ఞాపకాలబల్బు తళుక్కుమంది ఒక్కసారి. హాస్పిటల్ ఆవరణలో పూలచెట్టుముందు నిల్చుని, తానూ ఓ అరవై ఏళ్ళ వృద్ధ నారీ కలిసి తీయించుకున్న ఫోటో అది!

"ఆఁ, ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది, నిజమే. ఏడాది క్రితం ఈవిడ మా హాస్పిటల్లో హార్టు పేషంట్‌గా అడ్మిట్ అయి, సుమారు మూడు నెలలు చికిత్సపొంది వెళ్ళింది. ఐతే, ఈమె నా పేషంట్ మాత్రం కాదు!

ఆ వార్డులో ఈమె మంచం పక్కనే నా పేషంట్ ఒకావిడ వుండేది. నేను రౌండ్స్‌మీద ఆ వార్డుకెళ్ళి

నప్పుడు మర్యాదకోసం ఆమె బాగోగులు అడిగేదాన్ని.
అలా మా మధ్య పరిచయం కాస్త వృద్ధి చెందింది. ఆవిడ
యొందులో నా పట్ల ప్రత్యేకాభిమానమూ, ఆప్యాయతా
కనబర్చేది.

ఒకరాత్రి నేను నైట్ డ్యూటీలో వున్నప్పుడు
ఆమెకు విపరీతమైన గుండెనొప్పి వచ్చింది. నర్సుద్వారా
ఆ విషయం వినగానే పరిగెత్తుకెళ్ళి చూశాను. దురదృష్ట
వశాత్తూ, ఆ రోజు హార్ట్ స్పెషలిస్ట్ సెలవు మీదున్నాడు.
ఆ విషయములో నాకూ అంతో ఇంతో పరిజ్ఞానము వుంది
కనుక కావలసిన మందులూ, ఇంజక్షన్లూ ఇచ్చి ఆమెను
మృత్యువు కబంధహస్తాలకు అందకుండా చేశాను. ఆ
రోజు మొదలు నాలోనూ ఆమెపట్ల సానుభూతితో కూడిన
అభిమానం. మొలకెత్తింది.

ఆమె విషయంలో ప్రత్యేక శ్రద్ధచూపుతూ, డ్యూటీ
అయిపోయినా చాలాసేపు ఆమెదగ్గిర కూర్చుని కాలక్షేపం
చేసేదాన్ని. కొద్దిరోజుల్లో ఆమె డిశ్చార్జి కాబోతుం
దనగా ఓ రోజు ఫోటోగ్రాఫర్ని పిలిపించి, జ్ఞాపకార్థం
నాతో కలిసి ఈ ఫోటో తీయించుకుని తీసికెళ్ళింది.
కాలక్రమేణా నేను ఆమెని దాదాపు మర్చిపోయాను.

ఇప్పుడు మీరిలా హఠాత్తుగా వచ్చి అడిగితే వెంటనే
గుర్తు రాలేదు. క్షమించండి. ఇంతకీ ఇప్పుడామె యెలా
వున్నారు? నన్నడిగిరమ్మని మిమ్మల్ని పంపారా?" అడి
గింది నిర్మల.

అతను పెదవి విరిచి, "ఇప్పుడామె యెవరి యోగ
క్షేమాలూ తెలుసుకోలేని లోకానికి వెళ్ళిపోయింది నిక్షే
పంగా! ఈ రోజుతో ఆమె మరణించి సరిగ్గా పాతిక
రోజులవుతోంది" అన్నాడు.

నిట్టూర్చింది నిర్మల. అరవై ఏళ్ళుదాటిన వృద్ధ స్త్రీ. పైగా హృద్రోగి, చనిపోవడంలో పెద్ద వింతేమీ లేదు. ఐతే, ఆమె లాయర్ ఇంత ఇదిగా వచ్చి తనని కలుసుకోవడమే వింతగా తోస్తోందామెకు.

"చాలా ఉత్తమురాలు. చనిపోయిందంటే బాధగా వుంది. ఈ విషయం చెప్పడానికే మీరిక్కడికి వచ్చారనుకుంటాను" అంది.

అతను తలూపాడు. "అంతేకాదు, ఆమె యావదాస్తినీ చట్టపరంగా మీ కప్పగించడానికి వచ్చాను."

"ఏమిటీ?" సోఫాలో దాదాపు అదిరిపడింది నిర్మల. "వృత్తిరీత్యా సానుభూతికొద్దీ యెప్పుడో ఏదో శాస్త్ర ఉపచర్యలు చేసినంత మాత్రానికే ఆస్తినంతా నా పేర రాసిపోయిందా? ఇదెక్కడి చోద్యం?"

"మీకేకాదు. ఈ విషయం విన్నవారెవరికైనా ఇది చోద్యంగానే తోస్తుంది. యెవరి పిచ్చి వాళ్ళకానందం కదా! దానికాక్కారణం కూడా లేకపోలేదులెండి...."

"ఆమెకు వారసులూ, దగ్గరి బంధువులూ యెవ్వరూ లేరా?"

"ఎందుకు లేరు? వున్నారు. అదే ఊళ్ళో! అదే చెప్పబోతున్నాను.... ఈ నాటి బంధుత్వాలూ, అనుబంధాలూ కేవలం ఒకే సూత్రంమీద ఆధారపడున్నాయి. డబ్బు! డబ్బు లేకుంటే ఎంతటి దగ్గరి బంధువైనా ఆమడ దూరం దౌడుతీస్తాడు. డబ్బున్నవాడి దగ్గరికి యెంతటి దూరపు బంధువైనా కందరీగలా ముసిరి, అలుపూ, సొలుపూ లేకుండా నిరంతరం భక్తిభజన చేస్తాడు.

ఆవిడ విషయంలోనూ సరిగ్గా అదే జరిగింది. బ్రిటిష్ వారి హయాంలో ఆమె భర్త చుట్టుపక్కల పేరున్న

జమీందారు. ఆమె ఏభై ఏళ్ళ వయసులో ఆయన చనిపోయాడు. ఆ దంపతులకు సంతానంలేదు. భర్త మరణించగానే దాయాదులు ఒంటరిగా వున్న ఆమె బాగోగులు చూసే నెపంతో ఆమె చుట్టూ చేరారు.

నిజానికి వాళ్ళకు ఆమె క్షేమంకన్నా, ఆస్తిపాస్తుల మీదే ఆసక్తి యెక్కువగా కనబడేది. ముసల్ది యెప్పుడు చస్తుందా, ఎప్పుడు ఆస్తిని పంచుకుందామా అని ఎదురు చూడసాగారు. వారి మాటల్లోనూ, చేతల్లోనూ ఆ విషయం స్పష్టంగా వ్యక్తమయ్యేది.

వారి కృత్రిమాభిమానాలను ఆమె అనతికాలంలోనే పసిగట్టి నిర్మొహమాటంగా అందర్నీ వదిలించుకుంది. దాంతో అందరూ ఆమెని ఆడిపోసుకోసాగారు. ఐనా, ఆమె మరణించాక ఆస్తి యెలాగూ తమకు చెందక పోతుందా అన్న ఆశ వారిలో చావలేదు.

బహుశా, ఈ కారణాలవల్లే ఆమె తన యావదాస్తినీ మీకు చెందేలా విల్లు రాయించిందనుకుంటాను. దాంతో పాటు ఆ ఆస్తిని మీరు యే విధంగా సద్వినియోగం చెయ్యాలో కొన్ని సూచనలు కూడా చేసింది.

ఆ సూచనల ప్రకారం ఆస్తిలో సగభాగాన్ని మీ జీవన భృతికింద ఉంచుకుని, మిగతా ఆస్తి రాబడితో ఊళ్ళో చిన్న ఆస్పత్రి కట్టించి, నిరుపేదలకూ, అనాథలకూ త్రికరణశుద్ధిగా వైద్యసహాయం అందించాలి.

ఈనాడు ప్రభుత్వాస్పత్రుల్లో రోగులకు లంచాలు ఇవ్వందే మంచాలు దొరకవు గనుక, రెక్కాడితేగాని డొక్కాడని అభాగ్యులెందరో దుర్భర ఇక్కట్లు అనుభవిస్తున్నారు. మీరు నిర్వహించే ఆస్పత్రి కేవలం అటువంటివారికే పరిమితం కావాలని ఆవిడ ఆశ!

ఇక ఆస్తి వివరాలు, ఊరి వెలపల బంగారంలాంటి ఏభై ఎకరాల మాగాణీ, రెండు మామిడి తోటలూ, పదహారు పోక చెట్లతో సహా, మూడువందలపై చిలుక కొబ్బరిచెట్లతో నిండిన పాతికెకరాల తోటా, ఊళ్ళో చిన్న రైసుమిల్లూ, ఊరికొస్తా ఎడంగా ఇరవై ఎకరాల విస్తీర్ణంలో కట్టిన లంకంత ఇల్లూ, బాంకులోనూ, వివిధ సంస్థల్లోనూ డిపాజిట్లకింద వున్న పదిలక్షల నగదూ, సుమారు ఐదు లక్షలు ఖరీదుచేసే ఆవిడ నగలూ విల్లు ప్రకారం మీకు చెందుతాయి."

ఆ వివరాలు విని, తల తిరిగి కిందపడతానేమో అని పించింది నిర్మలకు. అదృష్ట దేవత కరుణా కటాక్ష వీక్షణాలు ఎప్పుడు ఎవరిమీద ఏ క్షణంలో ప్రసరిస్తాయో తెలీదంటారు. అదే జరిగితే అష్టదరిద్రులు కూడా అర క్షణంలో అందలమెక్కి కూర్చుంటారట. సరిగ్గా అదే జరిగింది తనవిషయంలో ఇప్పుడు.

లాయర్ జయరాం బ్రీఫ్ కేస్ లోంచి వీలునామా, రిజిస్ట్రేషన్ కాగితాలూ అవీ తీసి ఆమె ముందుంచి, ఎక్కడెక్కడ సంతకాలు పెట్టాలో చూపాడు. ఆమె వాటిని జాగ్రత్తగా పరిశీలించి, తృప్తిపడ్డాక ఎలాటి సంకోచమూ లేకుండా సంతకాలు పెట్టేసింది.

"రేపు చట్టపరమైన మిగతా తతంగాలు పూర్తి చేసుకుని, ఎల్లుండి మీరు నా వెంట కణ్ణనూర్ వచ్చి, ఆ ఆస్తులు చూసుకుని, మీకు తోచిన నిర్ణయాలు తీసుకోండి" అన్నాడు జయరాం.

ఆ సంభ్రమాశ్చర్యాలనించి నిర్మల ఇంకా కోలుకో లేదు. తలూపింది మౌనంగా నోరు పెగలక!

# 2

కణ్ణనూర్ నించి లాయర్ జయరాం వచ్చి తనని కలుసుకోడం, శ్రీమతి సరస్వతీదేవి మరణిస్తూ తన పేర రాసిన విల్లు చూపడం మొదలైన వివరాలన్నీ పూసగుచ్చినట్లు డిటెక్టివ్ దుర్యోధన్‌కు వివరించింది డాక్టరు నిర్మల.

అంతా విన్న దుర్యోధన్ నవ్వి — "అనుకోకుండా అంత విలువైన ఆస్తి వచ్చి ఒళ్ళోపడితే సంతోషించక, ఏదో అవాంతరం ముంచుకొచ్చినట్టు నా దగ్గరికి వచ్చావేమిటి?" అన్నాడు.

"అదే చెప్పబోతున్నాను. లాయర్ జయరాం సలహా ప్రకారం ఆయన వెంట కణ్ణనూర్ వెళ్ళాను. అటు పల్లెటూరూ కాక, ఇటు నగరమూ కాక, పూర్తిగా సముద్ర తీరంలో వున్న మధ్యరకం సిటీ అది."

"కణ్ణనూర్ అంటే, స్మగ్లర్ స్వర్గద్వారం అని పేరు పొందిన ఊరు కాదు కదా?" మధ్యలో అడిగాడు డిటెక్టివ్ అసిస్టెంట్ అరుణ్.

ఆమె తలాపి, "ఔను, అదే. ముందు అది స్మగ్లర్ మూలకేంద్రమని నాకు తెలీదు. మద్రాసుకు మూడు వందల మైళ్ళదూరంలో సముద్రతీరాన వుండటంవల్ల అక్కడ స్మగ్లింగ్ కార్యక్రమాలు సమృద్ధిగా, నిరాటంకంగా సాగుతుంటాయట.

అందుకే కాబోలు, అక్కడి ప్రజలు కూడా చాలా మొరటుగా, అమర్యాదస్తులుగా కనిపించారు నాకు. ఊళ్లో ఎవరైనా కొత్తవాళ్లు కనిపిస్తే చాలు అయిష్టంగా, అనుమానంగా చూస్తారు. ఎవరిని పలకరించినా చాలా నిర్లక్ష్యంగా, జుగుప్సగా మాట్లాడతారు.

స్మగ్లర్ల ద్వారా ఆ ఊరికి ఆర్థికంగా అనధికార

రాబడి విపరీతంగా వుండటంవల్ల అక్కడి ప్రజల జీవన ప్రమాణం మిగతా ఊళ్ళకన్నా చాలా మెరుగ్గా వుందిట. అందుకే వారు స్మగ్లర్లను తమ పాలిట కామధేనువులుగా భావించి, వారి గురించి ఎటువంటి సమాచారమూ, ఎవ్వరికీ చెప్పడానికి ససేమిరా సమ్మతించరట.

ఆ కారణాల వల్లెవారు ఊళ్ళో కొత్తవారు కనిపిస్తే తమ కూపీ తియ్యడానికి వచ్చిన ప్రభుత్వ గూఢచారులుగా భావించి, అనుమానంగా చూస్తూ మాట్లాడటానికిష్ట పడరట. ఊళ్ళో ఓ పోలీస్ స్టేషన్ వున్నా, ఏ క్షణంలో ఏ వైపునించి తమ ప్రాణాలకు ముప్పు మూడుతుందోనని బిక్కు బిక్కుమంటూ కాలక్షేపం చేస్తారట అక్కడి పోలీసులు.

సరస్వతీదేవిగారి ఇల్లు చూశాను. చాలా పెద్దది. పురాతన పద్ధతిలో కట్టినా ఇంకా చాలాకాలం చెక్కుచెదరని స్థితిలో వుంది. ఇల్లు పాతదే అయినా, ఇంటి వెనుక అతిథులకోసం చిన్న గెస్ట్‌హౌస్‌లాటిది కొత్తగా, అధునాతన రీతిలో కట్టారు.

ఆ ఇంట్లో అడుగు పెట్టాక నాకు చాలా చేదు అనుభవాలు ఎదురయ్యాయి. నేను వచ్చానని తెలియగానే ఆ ఊళ్ళో వున్న సరస్వతీదేవిగారి బంధువులు కట్టగట్టుకు వచ్చి, ఆమెకు నేనేదో మాయజేసి, వారికి చెందాల్సిన ఆస్తిని కాజేశాననీ, నా అంతుచూసి తీరతామనీ బెదిరిస్తూ నానా దుర్భాషలాడారు.

సమయానికి లాయర్ జయరామ్ కలగజేసుకుని పోలీసుల్ని పిలుస్తానని హెచ్చరించాకగానీ నా ప్రాణం వదల్లేదు వాళ్ళు. ఇక అక్కడ ఎక్కువకాలం వుండటం క్షేమంకాదని వెంటనే మద్రాసు తిరిగివచ్చేశాను.

వచ్చి వారంరోజులు కూడా కాలేదు. ఇదుగో ఆకాశ రామన్న ఉత్తరాలు అందాయి నాకు" అంటూ వేనిటీ బాగ్ తెరిచి, మూడు ఉత్తరాలు తీసి డిటెక్టివ్ దుర్యోధన్‌కందించింది నిర్మల.

మొదటి ఉత్తరాన్ని అటూ, ఇటూ తిప్పిచూశాడు దుర్యోధన్. అది అరండాల్ పేట పోస్టాఫీసులో పోస్టు చెయ్యబడ్డట్టు ముద్రవేసి వుంది. విప్పి చదివాడు.

"నంగనాచీ!

నాకు చెందాల్సిన ఆస్తిని నువ్వు కాజేస్తావా? ఎన్నో ఏళ్ళుగా దానిమీద కొండంత ఆశ పెట్టుకున్నాను. నా కలలూ, ఆశలూ వమ్ముచేస్తావా? నీ అంతు చూస్తాను. జాగ్రత్త!"

కింద సంతకం లేదు. మరో ఉత్తరం విప్పాడు.

"మాయలాడీ!

మా సరస్వతమ్మకేదో మందుపెట్టి, బుట్టలో వేసుకుని, ఆస్తి నీ పేర రాయించుకుంటావా? ఎంతకాలం దాన్ని అనుభవిస్తావో చూస్తాను. వెంటనే దాన్ని వదిలించుకుంటే సరి, లేదా అదే నీ పాలిటి ఉరితాడుగా మారుతుంది జాగ్రత్త!"

విడంబూర్‌లో పోస్టుచెయ్యబడ్డ ఉత్తరమది. మరో ఉత్తరం విప్పి చూశాడు.

"పాపిష్టిదానా!

సరస్వతమ్మతో ఏ బంధుత్వమూ లేని నువ్వు అంత ఆస్తి కాజేసి, నా నోట్లో మట్టి కొడతావా? నాకు దక్కని ఆస్తి నీకెలా దక్కుతుందో చూస్తాను."

మూడు ఉత్తరాల్లోని చేతివ్రాత విడివిడిగా వుంది.

సాలోచనగా తలూపి, వాటిని అర్జున్ కందించాడు దుర్యోధన్ చదవమని.

ఉత్తరాలు చదివి, "మీరిక్కడే వుండి, ఆస్తి పాస్తులు అమ్మిపెట్టే ఏజెన్సీలతో సంప్రదించి, ఆ ఆస్తి నంతా అమ్మేస్తే పీడ విరగడైపోతుంది కదా?" అన్నాడు.

నిర్మల నవ్వి— "అక్కడే వుంది చిక్కు! ఆవిడ వీలు నామాలో నేను అక్కడే వుండి, పేదల కోసం ప్రత్యే కంగా ఓ ఆస్పత్రి నడపాలని కోరింది. ఈ రోజు ఉదయం లాయర్ జయరాం మళ్ళీ వచ్చి నన్ను కలుసు కున్నాడు.

నేనిలా భయపడుతూ కూర్చుంటే, వాళ్ళలాగే బెది రిస్తూ వుంటారనీ, వాళ్ళకా ధైర్యం రాకుండా, వాళ్ళ బెదిరింపుల్ని నేను లెక్క చెయ్యడంలేదని వాళ్ళు భావిం చేలా నేనా ఊరికి వచ్చి, ఆస్తి పూర్తిగా స్వాధీనమయ్యే వరకూ అక్కడే వుండమని సలహా ఇచ్చాడు" అంది.

"ఇప్పుడాయన యెక్కడున్నాడు?" అడిగాడు దుర్యోధన్.

"వెళ్ళిపోయాడు. నా నివాసానికక్కడ యేర్పాట్లు చెయ్యడానికి."

"మీరు మమ్మల్ని కలుసుకోబోతున్నట్టు ఆయనకి చెప్పారా?"

"లేదు. ఆయన వెళ్ళిపోయాక తీవ్రంగా ఆలో చించాను. ఒంటరిగా ఆ నరకంలోకి వెళ్ళి, ప్రాణా పాయం కొని తెచ్చుకోడం వివేకం కాదనీ, రక్షణ వ్యవ హారాల్లో మంచి అనుభవం వున్నవారినెవరినైనా నా తోడుగా తీసికెళ్ళడం మంచిదనీ, స్ఫురించింది. అటువంటి పనుల్లో ప్రైవేట్ డిటెక్టివ్‌లు ఉద్దండులు గనక, తగిన

సూచనలిస్తారని మీ వద్దకు వచ్చాను."

"మంచి పనిచేశారు" అంటూ అర్జున్ వైపు తిరిగి, "ఇటువంటి పనుల్లో అర్జున్ ఆరితేరిన ఘటం! అతన్ని మీతో పంపుతాను" అన్నాడు డిటెక్టివ్ దుర్యోధన్.

"థాంక్స్! మెనీ మెనీ థాంక్స్! రేపే బైలుదేరాలనుకుంటున్నాను. మీరేమంటారు?"

"సరేనంటాను" అన్నాడు అర్జున్.

నిర్మల వానిటీ బాగ్ తెరిచి, ఓ నోట్లకట్ట తీసింది బైటికి.

"అడ్వాన్సు అవసరంలేదు. ఇది వ్యక్తిగత రక్షణకు సంబంధించిన విషయం గనక, కేసు పూర్తయ్యేవరకూ అర్జున్ మీ వెంటే వుంటాడు గనక పూర్తి ఫీజు తరవాత ఒకేసారి ఇవ్వొచ్చు" అన్నాడు దుర్యోధన్.

డబ్బు తిరిగి బాగ్ లో వేసి లేచింది నిర్మల. "అలాగే, వస్తాను. రేపు ఎన్ని గంటలకు బైలుదేరదామంటారు?"

"ఉదయం పది గంటలకు ఇక్కడికి వచ్చెయ్యండి. కార్లో బైలుదేరదాం!" అన్నాడు అర్జున్.

నిర్మల సెలవు తీసుకుని బైటికి నడిచింది.

## 3

"హలో దుర్యోధన్! హవార్ యూ?" అంటూ లోనికి వచ్చాడు క్రయింబ్రాంచి ఇన్ స్పెక్టర్ యుగంధర రెడ్డి.

"హలో ఇన్ స్పెక్టర్! చాలా రోజుల తర్వాత దర్శనమిచ్చారు. రండి. దయచెయ్యండి" అంటూ తన చిరకాల మిత్రుణ్ని ఆహ్వానించాడు దుర్యోధన్ సాదరంగా.

"ఏం చెయ్యాలి? మన వృత్తులే అలాంటివి. ఒక్కో

సారి ఇల్లాలి మొహం చూట్టానికే తపించి పోతుంటాం! ఇన్నాళ్ళూ ఓ హత్యకేసు ఇన్వెస్టిగేషన్‌లో తల మునకలై, ఈ మధ్యే కాస్త తెరిపిన పడితే, ఈ రోజు మరో కొత్త కేసు నెత్తిన రుద్దాడు మా ఎస్.పి! ఇంటికి పోతూ మిమ్మల్నోసారి చూసిపోదామని ఇలా వచ్చాను."

అన్నట్టు మీకూ ఏదో కొత్త కేసు తగిలినట్టుందే. ఇందాక జీపు దిగుతూ ఓ అందమైన అమ్మాయి మీ ఇంట్లోంచి ఇవతలికి రావడం చూశాను. ఇదివరకు ఎక్కడో చూసినట్టే వుంది ఆమెని!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ కనుబొమలు ముడుస్తూ.

"బహుశా, అన్నాదురై హాస్పిటల్లో చూసివుంటారు. డాక్టర్ నిర్మల! మా కొత్త క్లైంటు. రేపామె వెంట అర్జున్ కణ్ణనూర్ వెళుతున్నాడు."

"ఒక్కడేనా?"

"ఔను."

"ఇంకేం....ఏమన్నారూ? కణ్ణనూరా?" అడిగాడు ఇన్‌స్పెక్టర్ ఉలిక్కిపడి.

"ఔను. సరస్వతీదేవి అనే అక్కడి శ్రీమంతురాలు ఈమధ్య మరణిస్తూ, ఏ బంధుత్వమూ లేని ఈమె పేర తన యావదాస్తినీ రాసిపోయిందట...."

"ఆగండి....కణ్ణనూర్ .... సరస్వతీదేవి .... చిత్రంగా వుంది! ఈ రోజు ఈ రెండు పేర్లూ వినడం నాకిది రెండోసారి."

దుర్యోధన్ కనుబొమలు ముడివడ్డాయి. "అంటే?"

"నేను ఎస్.పి. ఆఫీసునించి తిన్నగా ఇటే వస్తున్నాను. ఆయన ప్రత్యేకంగా నన్ను పిలిపించి, ఓ వృత్తాంతం వినిపించాడు. అందులో కణ్ణనూర్ శ్రీమతి

సరస్వతీదేవి ప్రస్తావనకూడా వుంది."

"వెరీ ఇంట్రెస్టింగ్ మేటర్, చెప్పండి. మేము వింటాం!" అన్నాడు దుర్యోధన్ కుతూహలంగా.

ఇన్‌స్పెక్టర్ చెప్పసాగాడు. "కణ్ణనూర్ గురించి మీకు తెలిసే వుంటుంది. అక్కడ నివసించే జనంలో దాదాపు డెబ్భైఐదు శాతంమందికి ఏదో ఒక నేరంతో సంబంధం వుండనే వుంటుంది. ముఖ్యంగా స్మగ్లింగ్ వంటి నేరంతో.

బైటికి మాత్రం వారు చిన్న చిన్న వ్యాపారాలూ, ఉద్యోగాలు చేస్తూ కనిపిస్తారు. చాటుమాటుగా స్మగ్లర్లకు సహాకరిస్తూ రెండుచేతులా ఆర్జిస్తూంటారు. ఇరవై యేళ్ళక్రితం, అంటే మనదేశం చైనాతో యుద్ధం చేస్తూ అత్యవసర పరిస్థితిలో అట్టుడికిపోతున్న రోజులు. ఆ రోజుల్లో ఇందాక మీరు చెప్పిన శ్రీమతి సరస్వతీదేవి దగ్గర గజేంద్రన్, వీరప్పన్ అనే ఇద్దరు నౌఖర్లుండేవారు. గజేంద్రన్ ఆమెకు సంబంధించిన రైసు మిల్లు వ్యవహారాలు చూస్తుండేవాడు. వీరప్పన్ ఆమె పొలం పనులమీద అజమాయిషీ చేసేవాడు.

బైటికి ఇలా ఆమెవద్ద నౌఖర్లుగా పనిచేస్తూ, రాత్రిళ్ళు చాటుమాటుగా వాళ్ళిద్దరికీ చెందిన చిన్న నౌకలో స్మగ్లర్ల సరుకు సముద్రంపై అటూ ఇటూ చేరవేసేవారు. ఇలా వుండగా ఒకరోజు 'గరుడాక్షి' అనే పేరుగల ఓ రవాణా నౌక ప్రభుత్వానికి చెందిన ఏభైకిలోల బంగారాన్ని బొంబాయి చేరవెయ్యడానికి బైలుదేరింది.

అది మామూలు బంగారం కాదు. రక్షణ నిధికి, తమిళనాడు, కేరళ, అండమాన్, నికోబార్ దీవుల ప్రజలు దేశభక్తి పరితప్తులై ఎంతో భావోద్వేగంతో సమర్పించు

కున్న నగా, నట్రూ! అంతేకాదు, వాటితోబాటు బొంబాయి వ్యాపారకులు శ్రీలంకనించి దిగుమతి చేసు కున్న విలువైన కొన్ని వజ్రాలు కూడా ఉన్నాయా నౌకలో!

ఆ రోజుల్లో మనకున్న కొద్దిపాటి రవాణా విమా నాలూ, నౌకాదళం చివరికి రైలుబళ్ళు సైతం చైనా యుద్ధంలో మిలిటరీ దళాల అవసరాలు తీర్చడానికి వినియోగిసుండటంవల్ల ఆ బంగారాన్ని కొద్దిపాటి రక్షణ బలగంతో ఆ విధంగా బొంబాయికి తరలించవలసి వచ్చింది.

ఈ విషయాన్ని గజేంద్రన్, వీరప్పన్ యెలా తెలుసు కున్నారోగానీ, బ్రహ్మాండమైన పథకం అల్లి, తమతో బాటు ప్రాణాలకు తెగించిన మరో నలుగురు సహా చరుల్ని కూడగట్టుకుని తుపాకులతో, చేతి బాంబులతో బొంబాయీ, మద్రాసూ నౌకా మార్గాన తమ పడవలో బైలుదేరి, అర్ధరాత్రి ఏమరుపాటుగా వున్న ఓడ సిబ్బంది మీద దాడిజేశారు.

తుపాకులతో ఇరుపక్షాలకూ భీకర పోరాటం జరిగింది. అందులో అనేకమంది ఓడ రక్షకభటులు చావడమే గాక, గజేంద్రన్, వీరప్పన్‌లకు చెందిన ముగ్గురు సహాచరులూ మరణించారు. నాలుగోవాడు మాత్రం తీవ్రంగా గాయ పడటంవల్ల స్పృహలేని స్థితిలో నౌకా సిబ్బందికి దొరికి పోయాడు.

ఈ గందరగోళంలో గజేంద్రన్, వీరప్పన్‌లు ఆ ఆ బంగారం వున్న ఉక్కుపెట్టెలో పడవలో చల్లగా జారుకున్నారు. ఓడ విశాఖపట్టణానికి చేరువలో వుండ టంవల్ల సిబ్బంది వెంటనే ఓడను అక్కడికి చేర్చి,

స్పృహ లేని స్థితిలో పట్టుబడ్డ గజేంద్రన్ అనుచరుణ్ని పోలీసులకప్పగించారు.

ఆస్పత్రిలో వాడి శరీరంలో దిగిన గుళ్ళను తీసి, ప్రాణాలు కాపాడగలిగారుగానీ, స్పృహ తెప్పించలేక పోయారు డాక్టర్లు. ఆ కోమా స్థితిలోనే వాడు రెండు నెలలు ఆస్పత్రి పక్క మీద పడుండి, చివరికి ఓ రోజు కళ్ళు తెరిచాడు.

అప్పుడు తెలిసింది పోలీసులకు వాడిద్వారా, ఆ దోపిడీకి మూలకారకులెవ్వరో, గజేంద్రన్, వీరప్పన్ల కోసం వారు హుటాహుటిన కణ్ణనూర్ చేరుకున్నారు. రెండు నెలల తరవాత వెళితే అక్కడుంటారా వాళ్ళు?

ఐతే, ఇక్కడ గమనించవలసిన ముఖ్య విషయం ఒకటుంది. దోపిడీ తరవాత వాళ్ళిద్దరూ తిన్నగా కణ్ణనూర్ వెళ్ళారు. బహుశా వాళ్ళకి తమ అనుచరుల్లో ఒకడు స్పృహలేని స్థితిలో ఓడ సిబ్బందికి పట్టుబడ్డ సంగతి తెలియదేమో!

అందుకే వారు దోపిడీ జరిగాక నెలరోజులపాటు చాలా నింపాదిగా కణ్ణనూర్లోనే వున్నారట. ఆ తరవాత తెలిసిందేమో వాళ్ళకు, విశాఖపట్నం ఆస్పత్రిలో గాయ పడున్న అనుచరుడి గురించి. వెంటనే కణ్ణనూర్ వదిలి పారిపోయారు.

ఈ వివరాలు తెలిసిన మరుక్షణం పోలీసులు దేశ మంతా వారికోసం గాలించడం ప్రారంభించారు. ఆ ఇద్దర్లో వీరప్పన్ని గుర్తుపట్టడం పెద్ద కష్టం కాదు. కారణం, వాడి రెండు కళ్ళలో ఒకటి మామూలు కన్ను కాదు. గాజు కన్ను!

విచిత్రం ఏమిటంటే, వాడు పోలీసులకు పట్టుబడ

లేదు. గజేంద్రన్ని మాత్రం బొంబాయిలో పట్టుకో గలిగారు పోలీసులు. వాణ్ని ఎన్ని చిత్రహింసలు పెట్టి అడిగినా, దొంగిలించిన బంగారాన్ని ఎక్కడ దాచాడో, వీరప్పన్ ఎక్కడున్నాడో ససేమిరా చెప్పలేదు.

చివరికి పోలీసులు విసిగి వేసారి వాణ్ని కోర్టులో ప్రవేశపెట్టారు. ఆ దోపిడీకి నాయకత్వం వహించింది వాడేనని ఆ ఓడ సిబ్బంది ఐడెంటిఫై సాక్ష్యంమీద వాడికి ఇరవై ఏళ్ళ యావజ్జీవ శిక్షపడింది.

నిజానికి అంతమందిని చంపినందుకూ, ప్రభుత్వ బంగారాన్ని దోచినందుకూ వాడికి మరణశిక్ష పడాల్సింది. ఐతే, పోలీసుల తరఫున ప్రభుత్వ ప్రత్యేక అభ్యర్థన మీద కోర్టు ఆ శిక్ష వేసింది వాడికి. కారణం, వాడు విడుదలయ్యాకనైనా ఆ బంగారం ఆచూకీ, వీరప్పన్ ఆచూకీ తెలుసుకోవచ్చునన్న ఆశతో.

శిక్షపడ్డాక వాణ్ని విశాఖపట్నం సెంట్రల్ జైల్లో వుంచారు. అక్కడ ఇరవై ఏళ్ళ శిక్ష పూర్తిచేసుకుని వాడు ఈమధ్యే విడుదలయ్యాడు. ఆ క్షణంనించీ పోలీసులు వాణ్ని నీడలా వెంటాడసాగారు.

విశాఖపట్నంలో ఓ సంఘసేవకుల సొసైటీ వుంది. ఎన్. రాజ్‌కుమార్ అనే ఆయన దానికి అధ్యక్షుడు. ఆయన భార్య శ్రీమతి ఇందిర. జనరల్ సెక్రటరీ. వాళ్ళిద్దరూ కలిసి, దీర్ఘకాలం జైలు శిక్షలు అనుభవించి విడుదలై భావి జీవితాన్ని ఎలా గడపాలో తెలియక దిక్కుతోచని స్థితిలో వున్న ఖైదీలనూ, తెలిసో, తెలియకో తప్పులు చేసి, వెలివెయ్యబడ్డ స్త్రీలనూ ఈ సమాజంలో గౌరవప్రదంగా జీవించ గలిగే మార్గాలు అన్వేషించి, పునరావాసం కల్పించ

దానికి పాటుబడతారు.

జైలునించి విడుదలైన ఖైదీలను వారు తమవెంట తీసికెళ్ళి, పదీ పదిహేను రోజులు తమవద్ద అతిథులుగా వుంచుకుని, వారి మనస్తత్వాలను క్షుణ్ణంగా ఆకళింపు చేసుకుని, వారికనువైన జీవనోపాధి కల్పించడానికి ప్రయత్నిస్తారు.

అలాగే గజేంద్రన్ని కూడా వారు తమ వెంట తీసుకెళ్ళి పదిరోజులు ఇంట్లో వుంచుకున్నారు. జైల్లో వున్నంతకాలం వాడికి మౌనం, ఏకాంతం అలవాటై పోయింది. ఇరవై ఏళ్ళు క్షవరం చేసుకోకుండా గడ్డం, మీసాలు యేపుగా పెంచాడు.

ఆ దంపతుల ఇంట్లో వున్నంతకాలం వాడు ఆఁ, ఊఁ అనే రెండు పదాలు తప్ప మరేమీ మాట్లాడేవాడు కాదట. పగలు ఆ ఇంటికి కొద్ది దూరంలో వున్న ఓ. హోటల్ కమ్ లాడ్జింగ్ లో సినిమా పాటలు వింటూ కాలక్షేపం చేసేవాడట. ఎటువెళ్ళినా మఫ్టీ పోలీసులు వాణ్ని వెన్నంటే వున్నారట.

అలా పదిరోజులు గడిచాక, ఓ రోజు వాడు పోలీసుల్ని బోల్తా కొట్టించి పారిపోయాడట. అంటే ఆ హోటల్లో కెళ్ళినవాడు మళ్ళీ బైటికి రాలేదు. ఆరాతీస్తే హోటల్ ఉద్యోగుల ద్వారా ఆసక్తికరమైన ఓ విషయం బైటపడింది.

వాడు పారిపోయేనాటికి మూడు రోజులముందునించీ ప్రతిదినం ఓ అందమైన అమ్మాయి వచ్చి, హోటల్లో వాడు కూర్చున్నచోట కూర్చునేదనీ, ఇద్దరూ గంటల తరబడి కబుర్లు చెప్పుకునేవారనీ తెలిసింది."

పాలోచనగా తలూపాడు దుర్యోధన్. "బహుశా,

ఆ అమ్మాయి ద్వారానే వేరే బట్టలూ, షేవింగ్ సామాను తెప్పించుకుని బాత్ రూంలో గెడ్డం, మీసాలూ గొరిగి నింపాదిగా అవతలపడుంటాడు."

"నిజమే! అలాగే జరిగుండాలి."

"ఆ అమ్మాయి గురించి తరవాత యేమైనా తెలిసిందా?"

"లేదు. వాడితోబాటే ఆ అమ్మాయి కూడా అదృశ్యమైపోయింది."

"గజేంద్రన్ కు భార్యాపిల్లలేరా?"

"వాడి ముప్ఫైరెండేళ్ళ వయసులో అగ్నిసాక్షిగా పెళ్ళాడిన భార్య జబ్బుపడి చనిపోయిందిట. ఆమె ద్వారా వాడికి పిల్లలు పుట్టలేదు. ఆ తరవాత వాడు మళ్ళీ పెళ్ళిచేసుకోలేదు. ఐతే, ప్రభుత్వ బంగారం దోచుకోడానికి ముందు కేవలం యేడాది క్రితం వాడు ఎక్కడి నుంచో ఓ స్త్రీని తెచ్చుకుని, ఇంట్లో వుంచుకున్నాడట.

వుంచుకున్న కొద్ది నెలలకే ఆమెకో ఆడపిల్ల పుట్టిందట. వీడు జైలుకెళ్ళగానే ఊళ్ళో ఆమె బ్రతుకు దుర్భరమై ఆ నెలల పిల్లతో ఎటో వెళ్ళిపోయిందట. ఇప్పుడా పిల్ల క్షేమంగా ఉండివుంటే ఇరవై యేళ్ళ యువతి అవుతుంది."

"అంటే, ఆ తల్లీకూతుళ్ళిద్దరూ యెక్కడో అజ్ఞాతంగా వుండి, గజేంద్రన్ విడుదలయ్యే రోజుకోసం కాచుకున్నారనీ, వాడు విడుదలయ్యాక దొంగలించిన బంగారం ద్వారా లక్షాధికార్లం కావచ్చని కలలుగని వుంటారనీ, హోటల్లో గజేంద్రన్ని కలుసుకున్న యువతి వాడి కూతురే అయుంటుందనీ మీ అనుమానమా?"

ఇన్స్పెక్టర్ తలూపి, "ఔను. నా అనుమానం నిజం

కావచ్చు. కాకనూ పోవచ్చు. అంతేకాదు, వాడిక కొద్ది నెలల్లో జైలునించి విడుదల కాబోతున్నాడనగా, వాడి పేర ఎక్కడినించో కొన్ని ఉత్తరాలు కూడా వచ్చాయిట. ఇరవై యేళ్ళక్రితం బంగారం ధర తులం వందా, రెండువందల్లో పే వుండేది. ఇప్పుడు వేలల్లో వుంది. ఈ విషయంలో ప్రభుత్వానికి ఇది కూడా ఓ ముఖ్య కారణం!" అన్నాడు.

"మీ పోలీసువారి నిర్లక్ష్యంవల్లే వాడు ఎత్తుకు పై ఎత్తువేసి తప్పించుకోగలిగాడు. ఇంత పెద్ద దేశంలో ఇప్పుడు వాడి ఆచూకీ ఎక్కడని పసిగడతారు?"

"పసిగట్టాం!"

"నిజమా! ఎక్కడ?" ఆసక్తి ధ్వనించింది అర్జున్ కంఠంలో.

"రెండురోజుల క్రితం కణ్ణనూర్‌లోని ఓ టీ కొట్లో యజమాని భార్య వూడుస్తుండగా ఓ మూల కుర్చీ వెనక జాగా పాతబడ్డ ఓ పర్సు దొరికిందట. అందులో కేవలం నాలుగు రూపాయలూ, కొంత చిల్లరా, ఇరవై యేళ్ళనాటి కొన్ని కాగితం ముక్కలూ, ఓ ఉత్తరం వున్నాయట.

డబ్బు లెక్కువలేవు గనక, కొట్టు యజమాని తన నిజాయితీని చాటుకోడానికి, ఆ పర్సును తీసికెళ్ళి ఊరి పోలీస్ స్టేషన్‌లో ఇచ్చాడట. స్థానిక ఇన్‌స్పెక్టర్ అందులోని కాగితాలు చూసి, వెంటనే దాన్ని మాకు పంపాడు.

అది గజేంద్రన్ పర్సు అవునో, కాదో తెలుసుకుందామని, విశాఖపట్నం జైలువాళ్ళని వాకబ్ చేశాం! ఇరవై ఏళ్ళక్రితం వాడు శిక్షపడి జైలుకు వచ్చినప్పుడు వాడి

స్వంత బట్టలూ, సామానుతో బాటు ఆ పర్సు కూడా వుందిట.

విడుదలైన రోజు అవి తిరిగి వాడికి ఇచ్చివెయ్య బడ్డాయట. ఇంకేం కావాలి? ఆ పర్సు కణ్ణనూర్లో దొరికింది గనక, వాడు అక్కడే ఎక్కడో రహస్యంగా దాక్కున్నాడని రూఢి కావటంలేదూ?"

"లేదు. ఏ జేబు దొంగో, ఎక్కడో వాడి పర్సు కొట్టేసి, ఏదో పనిమీద కణ్ణనూర్ వెళ్ళి, ఆ టీ కొట్లో పర్సు పోగొట్టుకున్నాడేమో!" అన్నాడు అర్జున్ ఇన్ స్పెక్టర్ని ఉడికించాలని.

"శకునాలు పలకడంలో నువ్వు అఖండుడివి. నీలా ఆలోచిస్తూ కూర్చుంటే, మా డిపార్టుమెంట్ పని తెల్లారినట్టే. నా అసిస్టెంట్ సార్జంట్ విశ్వాన్ని నిన్ననే కణ్ణనూర్ పంపాను. అక్కడి పోలీస్ ఇన్ స్పెక్టర్తో మాట్లాడి, వివరాలు సేకరించమనీ, అతని వెనకే నేను వస్తున్నాననీ" అన్నాడు యుగంధరరెడ్డి మొహం చిట్లిస్తూ.

"మీరెప్పుడొస్తే నాకేం? నేను మాత్రం రేపు ఆ అందమైన లేడీ డాక్టర్తో కణ్ణనూర్ బైలుదేరబోతున్నాను" అన్నాడు అర్జున్ నవ్వుతూ.

## 4

"అదుగో, అదే కణ్ణనూర్!" అంది డాక్టర్ నిర్మల దూరాన బొమ్మరిళ్ళలా కనిపిస్తున్న పట్టణంవైపు చూపుతూ.

"అంటే, మన ప్రయాణం మరో మూడు మైళ్ళు మిగిలిందన్నమాట" అన్నాడు అర్జున్ రిస్టువాచీ చూసుకుంటూ.

అంతలో ఎదురుగా రోడ్డు పక్కన ఓ ఫియట్ కారూ, దానిముందు బాయ్‌నెట్ ఎత్తి వంగి ఇంజన్‌లో ఏదో లోపాన్ని చూస్తున్న యువకుడూ కనిపించాడు వాళ్ళకి. వారి కారు శబ్దం విని అతను చటుక్కున తలెత్తి రోడ్డు వైపు చూసి, సహాయంకోసం చేతులూపసాగాడు.

అర్జున్ అతని పక్కన కారాపి, "ఏం జరిగింది?" అంటూ అప్పుడు చూశాడు పరీక్షగా.

నీలిరంగు జీన్స్ కార్డురాయ్ పాంటులో, చాక్లెట్ రంగు డిస్కో షర్టు టక్ చేసిన అతను యువకుడు కాడు. పరువంలో వున్న పాతికేళ్ళ యువతి! అవసరానికిమించి వంపులు తిరిగి, షర్టులోంచి తన్నుకు వచ్చిన ఆమె ఎత్తు పల్లాలు చూశాకనే యువతి అని పోల్చుకోగలిగాడు గానీ, లేకుంటే మగాడనే మోసపోయేవాడు.

భుజాలవరకూ కత్తిరించుకున్న బాబ్డ్ హేర్, కోటేరు ముక్కు, విశాలమైన కళ్ళు, మొత్తానికి ఒక్క చూపులో సూదంటు రాయిలా సులువుగా ఆకట్టుకునే మొహం!

"ఇంజన్ ట్రబుల్ యిస్తోందండీ! కాస్త హెల్ప్ చేస్తారా? అంది బ్రతిమాలుతున్నట్టు.

అర్జున్ కారు దిగి, ఆమె కారు ఇంజన్‌లోకి తొంగి చూశాడు. రెండు నిమిషాల్లో అతనికి డిఫెక్టు తెలిసిపోయింది. టూల్ బాక్స్‌లోంచి స్పేనర్లూ, కటింగ్ ప్లేయరూ తీసి, సరిచేసి, ఇప్పుడు స్టార్ట్ చెయ్యండి" అన్నాడు.

ఆమె స్టీరింగ్ ముందు కూర్చుని, ఇగ్నిషియన్ కీ తిప్పగానే కారు స్టార్టయింది. ఆమె కృతజ్ఞతల్ని తలలో స్వీకరించి, కార్లో కూర్చుని ముందుకు పోనిచ్చాడు అర్జున్. రెండు మైళ్ళు వెళ్ళాక రోడ్డు మలుపు తిప్పుతూ సైడ్

మిర్రర్‌లో వెనక్కి చూశాడు. ఆ యువతి మళ్ళీ తన కారు రోడ్డుపక్క ఆపి, బోయ్‌నెట్ ఎత్తి ఇంజన్‌లోకి తొంగి చూస్తోంది!

మళ్ళీ ఏమైందబ్బా? అనుకుంటూ ఆగకుండా ముందుకు పోనిచ్చాడు అర్జున్. కాసేపట్లోనే ఊరి పొలిమేరలు వచ్చేశాయి. "ఎటు వెళ్ళాలి?" అడిగాడు నిర్మలని.

"అటు తిప్పండి!"

కారు ఎడంవైపు తిప్పాడు అర్జున్. రోడ్డుమీద వచ్చే పోయే జనం తమని గుడ్లప్పగించి, సందేహంగా, కుతూహలంగా చూడటం వింతగా తోచిందతనికి. ఊరికి మైలు దూరాన సముద్రం, సముద్రాన్ని ఆనుకుని దూరం దూరం వరకూ వ్యాపించి వున్న రాతికొండలూ కంటికింపుగా కనిపిస్తున్నాయి.

ఊరుచుట్టి సరస్వతీదేవి ఇల్లు చేరడానికి అరగంట పట్టింది. చుట్టూ విశాలమైన ప్రహారీ గోడమధ్య కట్టి వున్న ఆ ఇల్లు పాతకాలపు చిన్నసైజు రాజ ప్రాసాదంలా కనిపిస్తోంది.

"ఇటువంటి పాత భవనాల్లో రహస్య భూగృహాలు కూడా వుంటాయి" అన్నాడు అర్జున్ గేటుగుండా కారు లోపలికి పోనిస్తూ.

"నిజమే. కానీ, ఈ భవనంలో అటువంటివి వున్నాయో లేవో నేను గమనించలేదు" అంది నిర్మల.

తన ఊహ నిజమే అయితే, గజేంద్రన్‌కు ఆ భూగృహాల సంగతి తప్పక తెలిసి వుంటుంది. ఆ బంగారాన్ని వాడు వాటిల్లోనే ఎక్కడో దాచేసి వుంటాడు. అందుకే జైల్లోంచి విడుదలయ్యాక, తన వెన్నంటి వున్న పోలీ

సులకు చక్కాకొట్టి, తిన్నగా ఇక్కడికి చేరాడు. అను కుంటూ పోర్టికోలో కారాపి దిగాడు అర్జున్. ఇంటి సింహద్వారానికి పెద్దసైజు తాళం వేళాడుతోంది.

"తాళంచెవి మీ దగ్గరుందా?" అడిగాడు నిర్మలని.

"లేదు. లాయర్ జయరాంకిచ్చాను. నేవచ్చేవరకూ ఇక్కడే వుండి ఎదురుచూస్తానన్నాడు. బహుశా, ఇంకా రాలేదేమో!" అంది ఆమె కారు దిగుతూ.

"రండి. ఆలోగా ఒకసారి ఇంటిచుట్టూ తిరిగివద్దాం!" అన్నాడు అర్జున్.

వెనకవైపు తోట చాలా బాగుంది. పదండి" అంటూ అటు దారితీసింది నిర్మల.

ఇద్దరూ ఇంటి వెనక్కి వెళ్ళారు. రంగు రంగుల పూల చెట్లతో, రకరకాల ఫలవృక్షాలతో పచ్చగా, నిండుగా వుంది తోట.

ఓ పక్క ఆధునాతన రీతిలో కట్టిన చిన్న డాబా ఇంటిని చూపుతూ, "అది 'గెస్టు హౌస్, ముఖ్యమైన అతిథులెవరైనా వస్తే అందులో వారికి విడిది యేర్పాటు చేసేవారుట" అంది నిర్మల.

"తలుపు బార్లా తెరిచివుందేమిటి?" అంటూ చెవులు రిక్కించి, "విన్నారా? లోపలినించి సన్నగా ట్రాన్సిస్టర్ శబ్దం కూడా వస్తోంది" అన్నాడు అర్జున్.

"ఎవరొచ్చారబ్బా? కొంపదీసి సరస్వతీదేవిగారి బంధులెవరైనా ఊడిపడలేదు కదా?" అంది నిర్మల అనుమానంగా.

"రండి. చూద్దాం!" అంటూ అటు దారితీశాడు.

ఇద్దరూ గెస్టు హౌస్‌ని సమీపించి, తెరిచి వున్న గ్రిల్ తలుపుగుండా లోన అడుగుపెట్టారు.

"ఎవరండీ లోపల?" అడిగాడు అర్జున్.

జవాబు లేదు. ట్రాన్సిస్టర్ లోంచి సంగీతం మాత్రం సన్నగా వినిపిస్తూనే వుంది.

ఇద్దరూ ఒకరి మొహాలొకరు చూసుకుని, ముందు గదిలోకి ప్రవేశించి, కాళ్ళకు బ్రేకులు పడ్డట్టు ఆగి పోయారు. కారణం, గోడ వారగా ఆనించి వున్న టేబుల్ ముందు కుర్చీలో అటు తిరిగి కూర్చునున్నాడెవ్వరో!

ఇక్కడే కూర్చుని పిల్చినా పలకడేం? చెవుడా? అనుకుంటూ, "ఏమండీ!" అంది నిర్మల.

ఐనా అతను బదులివ్వకపోడంతో, టేబిల్ని సమీపించి, ఇల్లు దిరిపోయేలా గావుకేక పెట్టింది నిర్మల!

ఒక్కవుదుటున ఆమెని సమీపించి నిర్ఘాంతపోయాడు అర్జున్!

నల్లని సూటులో వున్న అతని ఛాతీమీద ఎర్రని రంధ్రం కనిపిస్తోంది. అది పిస్తోలు గుండు చేసిన రంధ్రం! కళ్ళు రెండూ మూతలు పడున్నాయి. గుండు గుండెలో దిగగానే కూర్చున్నవాడు కూర్చునట్టే కొయ్యబారి పోయాడు కుర్చీలో!

"ఇతను తెలుసా మీకు?" అడిగాడు నిర్మలని.

"తెలుసు!" ఆమె కంఠం వణుకుతోంది.

"ఎవరు?"

"లాయర్ జయరాం!"

"మై....గా....డ్! ఎవరు చంపి వుంటారు? ఎందుకు చంపివుంటారితన్ని?" అంటూ శవం చెయ్యిపట్టుకుని చూసి, "ఇంకా పూర్తిగా చల్లబడలేదు. హత్య జరిగి అట్టేసేపు కానట్టుంది. మనం వచ్చేలోపలే హంతకుడు

ఇక్కణ్నించి జారుకున్నాడు" అంటూ చుట్టూ కలయ జూశాడు అర్జున్.

హాంతకుడి ఆచూకీ తెలిపే ఎటువంటి ఆధారమూ లేదక్కడ. టేబిల్ మీద తెరిచి వున్న ఓ ఫైలూ, దాని మీద దొర్లివున్న బాల్ పెన్, ట్రాన్సిస్టర్ తప్ప! అది సరస్వతీదేవి ఆ సిపాయిలకు సంబంధించిన ఫైలు!

"స్థానిక పోలీసులకు వెంటనే హాత్య విషయం తెలప్పాలి. పదండి" అంటూ నిర్మలని బైటికి తీసికెళ్ళి, గట్టు హౌస్ గ్రిల్ తలుపు మూశాడు అర్జున్.

ఇద్దరూ తిరిగి కార్లో కూర్చుని ఊరివైపు బైలుదేరారు. దార్లో కాలినడకన ఓ వ్యక్తి ఎదురైతే ఆపి, పోలీస్ స్టేషన్ కెటువెళ్లాలని అడిగాడు అర్జున్.

అతను ఎగాదిగా చూసి, "యేం నేను దొంగనను కున్నావా? పోలీస్ స్టేషన్ గురించి అడగడానికి?" అన్నాడు తీక్షణంగా.

నిర్విరబోయాడు అర్జున్. "అది కాదండీ, నేనీ ఊరికి కొత్తవాణ్ని. పోలీస్ స్టేషన్ ఎక్కడుందో తెలీదు. అందుకే అడిగాను."

"పోలీసులతో యేం పని?"

"ఒక వ్యక్తి హాత్య చెయ్యబడ్డాడు. ఆ విషయం చెప్పడానికి."

"ఆ హాత్య నువ్వే చెయ్యలేదు కదా?" ఆ వ్యక్తి తల బిరుసుతనానికి చాలా చిరాకు వేసింది అర్జున్ కు.

ఐనా, తమాయించుకుని హాత్య నేనే చేసివుంటే పోలీసులకు చెప్పడానికెందుకు బైలుదేరతాను?" అన్నాడు.

దాంతో అతను పోలీస్ స్టేషన్ ఎటు వెళ్ళాలో

చెప్పి, ముందుకు సాగాడు. పదినిమిషాల్లో అక్కడికి చేరుకున్నాడు అర్జున్. ఇన్‌స్పెక్టర్‌కు తన గురించి చెప్పకుండా హత్య వివరాలు తెల్పి, వారి జీపు వెనకే తిరిగి సరస్వతీదేవి ఇల్లు చేరుకున్నాడు.

ప్రాథమిక దర్యాప్తు పూర్తయ్యాక సబ్ ఇన్‌స్పెక్టర్ అనవసరంగా చుట్టుపక్కల జనాన్ని పోగుచేసి, ప్రశ్నల వర్షం కురిపించసాగాడు. ఆ జగమొండి జనం అతనితో ఏ విధంగానూ సహకరించడానికిష్టపడటంలేదని వెంటనే గ్రహించాడు అర్జున్. అందరి నోటా ఒకటే జవాబు.

"తమకేమీ తెలీదు. ఊళ్ళో తాము కొత్తవాళ్ళెవ్వరినీ చూళ్ళేదు!"

## 5

సాయంత్రం ఐదుగంటలు పట్టింది పోలీసులక్కడ్నించి కదలటానికి. తమతోబాటు శవాన్ని కూడా తీసికెళ్లారు పోస్టుమార్టం నిమిత్తం! వారలా వెళ్ళగానే గెస్టుహౌస్‌కు తాళంవేసేశాడు అర్జున్. ఇంటి తాళంచెవులు జయరాం కోటుజేబులో దొరికాయి. ఊహించని ఆ సంఘటనతో బాగా నీరసించినట్టు కనిపించసాగింది డాక్టర్ నిర్మల.

"మీకు భయంవేస్తే ఈ రాత్రి హోటల్లో రెండు గదులు తీసుకుని గడుపుదాం! ఏమంటారు?" అడిగాడు అర్జున్.

"నో! నో! నేనిక్కడే వుంటాను. ఎట్టి పరిస్థితిలోనూ నేను బెదిరిపోయినట్టు ఊరివాళ్ళకు తెలియడం నాకిష్టం లేదు."

"మిమ్మల్ని భయపెట్టడానికే లాయర్ జయరాంను హత్య చేశారంటారా?"

"అంతకిమించి వేరే కారణం యేముంటుంది?"

"నిజంగా నే మీరు భయపడటంలేదా?"

"భయపడుతున్నాను. ఐతే, ఆ భయాన్ని వ్యక్తం చెయ్యదలచుకోలేదు. అందుకే మీరూ ఇక్కడే వుండండి, వేరే గదిలో!"

"ఆల్ రైట్. చీకటి పడబోతోంది. ఊళ్ళోకెళ్ళి యేమైనా తినొద్దామంటారా?"

"నాకు ఆకలిలేదు. మీ కంపెనీకోసం వస్తాను పదండి" అంది నిర్మల శేనూ.

ఇద్దరూ కారెక్కి ఊళ్ళోకెళ్ళారు. ఊళ్ళో సీ-ఫేస్ అనే ఒకే ఒక్క పెద్ద హోటల్ వుంది. పగలంతా తిండితిప్పల్లేక అలిసి వుండటంవల్ల సుష్టుగా భోంచేశాడు అర్జున్. అతని బలవంతంమీద మొక్కుబడిగా మజ్జిగతో నాలుగు మెతుకులు గతికింది నిర్మల.

భోజనాలయ్యాక ఇద్దరూ ఇల్లు చేరేసరికి రాత్రి ఎనిమిది దాటింది.

"నిద్రముంచుకొస్తోంది. వెళ్ళి పడుకుంటాను" అంది నిర్మల.

"ఆల్ రైట్! రాత్రి ఎలాంటి చప్పుళ్ళు వినిపించినా సరే, తలుపు తెరవకండి" అన్నాడు అర్జున్.

"ఓకే. గుడ్ నైట్" అంటూ తన గదిలోకెళ్ళి తలుపు మూసుకుంది నిర్మల. తనూ ఆ గది కెదురుగా వున్న గదిలోకెళ్ళి తలుపు మూసుకున్నాడు అర్జున్. ఐతే, ఆ మిలా తాను నిద్రపోదల్చుకోలేదు. సూట్ కేస్ లోంచి ఓ నవల తీసి చదువుతూ కూర్చున్నాడు.

బైట హాలు గోడకు వేళ్ళాడుతున్న గడియారం సరిగ్గా పదిగంటలు కొట్టగానే పుస్తకం మూసి లేచి నిలుచె

న్నాడు. సూట్ కేస్ లోంచి పిస్తోలు తీసి జేబులో వేసుకుని, టార్చి అందుకుని తలుపువైపు నడిచాడు. నెమ్మదిగా గడియతీసి తలుపు తెరిచాడు. కిర్రుమంటూ తెరుచుకుంది.

ఇంట్లో సూదిపడితే వినిపించే శబ్దం! అర నిమిషం అక్కడే నిల్చుని, నెమ్మదిగా హాల్లో అడుగుపెట్టాడు. రాత్రికి రాత్రి ఇల్లంతా వెతికి, గోడలో రహస్య అరలూ, భూగృహాలూ ఏవైనా వున్నాయేమో తెలుసుకోవాలి. ఇంట్లో ఒక్కోచోట గోడలు చాలామందంగా వున్నాయి. వాటిలో రహస్య అరలుండే అవకాశం లేకపోలేదు.

నాలుగ్గంటల ప్రయాసానంతరం అతని ప్రయత్నం ఫలించింది. గోడల్లో నాలుగుచోట్ల వెడల్పాటి అరలూ, మూడు భూగృహాలూ కనుక్కోగలిగాడు. ఐతే, అతనాశించినట్టు వాటిలో బంగారం గానీ, పూచిక పుల్లగానీ ఏమీలేవు, అన్నీ దుమ్మూధూళీతో ఖాళీగా వున్నాయి.

నిరుత్సాహ పడకుండా, నెమ్మదిగా తోటలోకి వెళ్ళి, అడుగులో అడుగు వేసుకుంటూ గెస్టుహౌస్ వైపు నడిచాడు. చుట్టూ చిమ్మచీకటి. ఆకాశాన మబ్బులు కమ్మివుండటం వల్ల తారల వెలుతురు కూడా కరువయింది పరిసరాల్లో. నిశ్శబ్దాన్ని చీలుస్తూ కీచురాళ్ళు ఏకబిగిన రొద పెడుతున్నాయి.

గెస్టు హౌస్ పదిగజాల దూరం వుందనగా చటుక్కున ఆగి, చెవులు రిక్కించాడు అర్జున్. తాను పొరబడలేదు. యెదురుగా పొదలమాటున ఏదో సరసర చప్పుడైంది. ఏమిటా చప్పుడు? ఊపిరి బిగబట్టి అక్కడే నిల్చున్నాడు.

రెండు నిమిషాల తరవాత మళ్ళీ అదే చప్పుడు విని పించిందక్కడ. చటుక్కున టార్చి అటు తిప్పి వెలిగించాడు. అంతే! లావుపాటి ఓ రాయి రాకెట్‌లా దూసుకువచ్చి టార్చికి తగిలింది. ఆ దెబ్బకు టార్చికిందపడి పగిలిపోయింది. మరుక్షణం చీకట్లో ఎవ్వరో పరిగెత్తుతున్న చప్పుడు!

చటుక్కున వంగి చేత్తో తడుముతూ టార్చి అందుకున్నాడు అర్జున్. అప్పటికే అడుగుల శబ్దం పరిసరాల నించి మాయమైపోయింది. టార్చి వెలిగించి చుట్టూ వేసి చూశాడు. మనిషి ఛాయలేదు. పెదవి విరుస్తూ వెనుదిరిగాడు.

ఈ సంఘటనతో ఒక విషయం స్పష్టమౌతోంది. తనలాగే ఎవ్వరో ఆ ఇంటినీ, గెస్టు హౌస్‌నూ గాలించడానికి వచ్చాడు. ఎవరు? గజేంద్రా?

తీవ్రంగా ఆలోచిస్తూ తన గదిలోకెళ్ళి, పక్కమీద వాలాడు అర్జున్. అప్పటికే బాగా అలసి వుండటంవల్ల వెంటనే నిద్రపట్టేసింది.

# 6

ఉదయం ఇద్దరూ లేచి కాలకృత్యాలు తీర్చుకుని, తయారౌతుండగా, తలుపు తట్టిన చప్పుడు వినిపించింది. అర్జున్ వెళ్ళి తలుపు తెరిచాడు.

పోలీస్ కాన్‌స్టేబుల్!

"ఏమిటి?" అడిగాడు.

"ఇన్‌స్పెక్టర్ గారు మిమ్మల్నోసారి పోలీస్ స్టేషన్‌కి రమ్మంటున్నారు."

"ఎందుకు?"

"వచ్చి ఆయన్నే అడగండి."

నిర్మలను అక్కడే వుండమని చెప్పి, కానిస్టేబుల్ని కారెక్కించుకుని, బైలుదేరాడు అర్జున్. పోలీస్ స్టేషన్ ముందు చిన్నసైజు జాతరలా పోగైవున్నారు జనం! కారు దిగుతున్న అర్జున్ని చూడగానే వారి కళ్ళల్లో తీవ్రమైన ద్వేషభావన కనిపించింది. అవేమీ పట్టించుకోకుండా బూట్లు టకటకలాడిస్తూ లోనికి నడిచాడు అర్జున్.

లోపల ఓ వ్యక్తిని ప్రశ్నిస్తున్న ఇన్స్పెక్టర్ అతన్ని చూడగానే ఆగి, ఆ వ్యక్తివైపు చూసి, "నువ్వు కాసేపు బైట వుండు. చెప్పకుండా ఎక్కడికీ వెళ్ళొద్దు" అన్నాడు.

అతను తలూపి వెళ్ళిపోయాడు.

ఎస్.ఐ. అర్జున్ వైపు తిరిగి, "రాత్రి ఎక్కడున్నారు మీరు?" అడిగాడు.

"సరస్వతీదేవిగారి ఇంట్లోనే!"

"అర్ధరాత్రి ఇల్లు వదిలి ఎక్కడికైనా వెళ్ళారా?"

ఎస్.ఐ. ప్రశ్నతో అర్జున్ కనుబొమలు ముడివడ్డాయి. తాను రాత్రి ఇంట్లోంచి బైటికెళ్ళినట్టు ఇతనికెలా తెలిసింది? కొంపదీసి రాత్రి తనకు తారసపడింది ఇతనేనా? అతనే అయితే టార్చిమీద రాయి విసిరి ఎందుకు పారిపోయాడు?

అనుకుంటూ "వెళ్ళాను. క్రొత్త ప్రదేశంకదా? నిద్ర పట్టక ఇంటి వెనక తోటలోకి వెళ్ళాను" అన్నాడు.

"ఊళ్ళోకి రాలేదా?"

"వచ్చాను. ఐతే, అర్ధరాత్రికాదు. ఎనిమిదిగంటలప్పుడు హోటల్లో భోజనం చెయ్యడానికి వచ్చాం! ఇంతకీ, ఇవన్నీ ఎందుకడుగుతున్నారు? ఏం జరిగింది?"

అడిగాడు అర్జున్ వుండబట్టలేక.

ఎస్.ఐ. కుర్చీలోంచి లేచి, "ఇలా రండి" అంటూ పక్కనే వున్న మరో గదివైపు దారితీశాడు.

అతన్ని అనుసరిస్తూ ఆ గదిలో అడుగుపెట్టి, ఆశ్చర్యపోయాడు అర్జున్. గది మధ్య మంచంమీద ఓ వ్యక్తి పడున్నాడు. తల చుట్టూ బాండేజ్ కట్టివుంది. ముక్కుమీదా గడ్డంకిందా ప్లాస్టరు అతికించి వున్నాయి.

అరనిమిషంలో అతన్ని పోల్చుకుని నివ్వెరబోయాడు అర్జున్. అత నెవ్వరో కాదు. మద్రాసు క్రయింబ్రాంచి ఇన్‌స్పెక్టర్ యుగంధరరెడ్డి అసిస్టెంట్ సార్జంట్ విశ్వం!

"విశ్వం! నువ్వా? ఏం జరిగింది? యేమిటీ దెబ్బలు?"

"మీరిక్కడికెలా వచ్చారు సార్?" అడిగాడు విశ్వం నీరసంగా.

ఈసారి ఆశ్చర్యపోవడం ఎస్. ఐ. వంతయింది. "ఈయనతో ముందే పరిచయం వుందా నీకు?" అడిగాడు సార్జంటుని.

"మన డిపార్టుమెంట్ వారికి ఆయనతో పరిచయం లేకపోవడమేమిటి సార్? డిటెక్టివ్ దుర్యోధన్‌గారి అసిస్టెంట్ అర్జున్‌గారు ఆయనే!"

"ఐ.సీ! గ్లాడ్ టు మీట్ యూ అర్జున్, మీ గురించి విన్నానేగానీ, వ్యక్తిగతంగా కలుసుకునే అవకాశం కలగలేదు" అంటూ చెయ్యి చాపాడు ఎస్.ఐ.

అర్జున్ అతనితో కరచాలనంచేసి, "సార్జంట్‌కేమైంది? యాక్సిడెంటా?" అడిగాడు.

"అతను మద్రాసునుంచి గజేంద్రన్ అనే మాజీ నేరస్థుడు గురించి వాకబ్ చెయ్యడానికి వచ్చాడిక్కడికి....

నిన్న సరస్వతీదేవిగారి ఇంటి వెనక గెస్టు హౌస్‌లో లాయర్ జయరాం హత్య చెయ్యబడ్డాడుకదా, గజేంద్రన్ ఆ చుట్టుపక్కలెక్కడైనా కనిపిస్తాడేమో చూద్దామని రాత్రి రెండు గంటల ప్రాంతంలో ఆ ఇంటివైపు బైలుదేరాడట.

ఇల్లింకా ఫర్లాంగు దూరం వుందనగా, చీకట్లో ఇంటివైపునించి ఎవ్వరో పరిగెత్తుకువస్తూ కనిపించారట. టార్చి వెలిగించి అతన్ని చూడబోయేంతలో ఆ వ్యక్తి మెరుపులా వంగి, నేలమీంచి రాయందుకుని ఇతనివైపు విసిరాడట. రాయి తగిలి టార్చి కిందపడగానే అతను చిఱుతలా ఇతనిమీదికి లంఘించి, మొహంమీద పిడిగుద్దుల వర్షం కురిపించి పారిపోయాడట...."

"గజేంద్రన్ ఇక్కడికి వచ్చినట్టు నేనూ విన్నాను. ఇంతవరకూ అతని జాడ తెలియలేదా మీకు?" అడిగాడు అర్జున్.

"తెలియలేదు. అతనిక్కడే వున్నాడని మాత్రం రూఢిగా చెప్పగలను. కారణం, కొద్దిరోజులక్రితం ఓ టీ కొట్లో అతని పర్సు దొరికింది మాకు. ఐతే, ఇంతవరకూ అతను మా కంటికి కనిపించక పోడానికి చాలా కారణాలున్నాయి.

ఊరి వెలపల సముద్రాన్ని ఆనుకుని దూర దూరం వరకూ వ్యాపించివున్న రాతి కొండల్ని మీరు చూసేవుంటారు. ఆ కొండల్లో ప్రాచీనకాలం నాటి చిత్రవిచిత్రమైన గుహలు చాలా వున్నాయి. అందులో మనిషి దాక్కుంటే కనుక్కోడం చాలా కష్టం!

పోతే, ఇరవై యేళ్ళ క్రితం దొంగిలించబడ్డ ఆ ప్రభుత్వ బంగారంమీద ఈ ఊరి ప్రజల్లో చాలామంది

కన్నుంది. గజేంద్రన్ యే ఇంట్లోనైనా రహస్యంగా దాక్కుని, వారికి బంగారంలో కొంత భాగం ఇస్తానని ఆశ పెట్టివుంటే, వాడి గురించి వాళ్ళు చచ్చినా బైటికి పొక్కనివ్వరు....

అన్నట్టు అసలు విషయం చెప్పడం మర్చాను. గత రాత్రి పదిగంటలకు ఊళ్ళో ఓ విచిత్ర సంఘటన జరిగింది. ఊరిమధ్య టౌన్ హాలుపైన దిక్కులు చూపే ఓ గాలికోడి వుంది. అది పూర్తిగా ఇత్తడి రేకుతో చెయ్యబడటంవల్ల ఎవ్వరైనా గురిచూసి, దానిమీద రాయి విసిరితే ఠంగుమంటూ గంటలా మోగి, దూరం దూరం వరకూ వినిపిస్తుంది.

ఇరవైయేళ్ళక్రితం గజేంద్రన్ అనుచరుడు వీరప్పన్ ఇక్కడ వున్నంతకాలం రాత్రిపూట కల్లుకొట్లో తప్ప తాగి, ఇంటికిపోతూ టౌన్ హాలు ముందాగి, నేలమీంచి రాయందుకుని గురిచూసి ఆ కోడిని కొట్టేవాడట. ఆ విధంగా ప్రతిరోజూ క్రమం తప్పకుండా రాత్రిపూట ఆ కోడి గంటలా మోగేదట.

ఊళ్ళో గురి తప్పకుండా రాయి విసరడంలో వాణ్ని మించినవారు లేరట. ముప్ఫై గజాల దూరంలో కూర్చున్న ఎటువంటి పక్షినైనా వాడు రాయి విసిరి చంపేవాడట. ఆ బంగారం దోపిడీ తరవాత ఎప్పుడైతే వాడీవూరొదిలి పారిపోయాడో, అప్పటినించీ అంటే, ఇరవై యేళ్ళనించీ ఆ ఇత్తడి కోడి నిశ్శబ్దంగా వుండిదట.

రాత్రి హఠాత్తుగా అది మళ్ళీ మోగడంతో వీరప్పన్ తిరిగి వచ్చాడని ఊరంతా గుసగుసలాడుకుంటున్నారు."

ఆలోచనలతో అర్జున్ బుర్ర గిరగిర తిరగసాగింది. రాత్రి టౌన్ హాలుమీది గాలికోడి మోగింది. గతరాత్రే

గురి తప్పకుండా రాయివిసిరి తన టార్చి పడగొట్టబడింది. ఊరి ప్రజల ఊహ నిజమేనా? వీరప్పన్ తిరిగివచ్చాడా? తననించి తప్పించుకుని పారిపోతున్న అతనికి దార్లో సార్జంట్ విశ్వం ఎదురై వుంటాడు. అతని టార్చికూడా రాయి విసిరి పడగొట్టి, చీకట్లో చితకబాది పారిపోయుంటాడు.

అనుకుంటూ విశ్వంవైపు తిరిగి, "ఆ సంఘటన గురించి హెడ్‌క్వార్టర్స్‌కు తెలియచేశావా?" అడిగాడు.

"ఔను. రాత్రే వైర్లెస్ మెసేజ్ ఇచ్చాం!" అన్నాడు ఎస్.ఐ.

"సరే, గాయాలు మానేవరకూ రెస్టు తీసుకో, ఎక్కడికీ వెళ్ళక! మళ్ళీ కలుసుకుంటాను" అంటూ ఇన్‌స్పెక్టర్ వద్ద సెలవుతీసుకుని బైటికి నడిచాడు అర్జున్.

## 7

ఉదయం పదిగంటల ప్రాంతంలో ప్రశాంతంగావున్న 'సీ-ఫేస్' హోటల్ ప్రాంగణం తళతళ మెరిసే విదేశీ బ్రాండ్ కారు వచ్చి ఆగడంతో కళకళలాడసాగింది. అంతవరకూ తమతమ గొడవల్లో మునిగి తేలుతున్న జనం ఒక్కసారి కారువైపు తిరిగి, అందులోంచి దిగుతున్న ఇద్దరు ఫుల్ సూట్ వ్యక్తుల్ని గుడ్లప్పగించి చూడసాగారు.

అందులో ఒకడు తలమీద ఫెల్ట్ హాట్, కళ్ళకి కూలింగ్ గ్లాసెస్ పెట్టుకున్నాడు. నోట్లో పొడవాటి కింగ్ సైజు సిగరెట్ వెలుగుతోంది. రెండో వ్యక్తి ఫ్రెంచి కట్ మీసాలు, పిల్లి గడ్డంతో విదేశీయుడిలా కనిపిస్తున్నాడు.

ఇద్దరూ ఒకసారి చుట్టూ పరికించి, బూట్లు టకటక

లాడిస్తూ హోటల్లో ప్రవేశించారు. మరుక్షణం అంత వరకూ లోపల మారుమోగుతున్న రణగొణ ధ్వని స్విచ్ ఆఫ్ చేసినట్టు ఆగిపోయింది. అందరి కళ్ళూ ఆ ఇద్దరు ఆగంతకులమీదే అతుకు వేసినట్టు నిలిచిపోయాయి.

బహుశా అందరి మస్తిష్కాల్లోనూ ఒకే ఒక్క ఆలోచన తళుక్కుమనుంటుంది. యెవరో కొత్త స్మగ్లర్లు వచ్చారు! అంటే, రెండు బంగారు పిచుకలు ఎగిరివచ్చి ఉళ్ళో వాలాయన్నమాట!! దాని అర్థం ఊళ్ళోని కొందరి వేళ్ళు కలిలేని నేతిలో పడ్డాయన్నమాట!

వాళ్ళిద్దరూ ఇవేమీ పట్టించుకోకుండా తిన్నగా బార్ కౌంటర్ వైపు నడిచారు. కౌంటర్లో శంభులింగం కూర్చున్నాడు. నలభై యేళ్ళ వయసులో నల్లగా బొద్దుగా వుండే శంభులింగమే ఆ హోటల్ యజమాని! స్మగ్లర్ చంచా!

"టూ పెగ్స్ విస్కీ" అన్నాడు కళ్ళద్దాలు పెట్టుకున్న వ్యక్తి నోట్లోంచి సిగరేట్ తీసి దులుపుతూ.

శంభులింగం వెంటనే పీటర్ స్కాచ్ బాటిల్ అందుకుని, రెండు పెగ్గులు తయారుచేసి, మరోసారి వాళ్ళకందిస్తూ "నేనే శంభులింగాన్ని!" చెప్పండి?" అన్నాడు.

"బొంబేనించి వస్తున్నాం మేము. ఎగ్బోటే చెప్పాడు ఇక్కడ నిన్ను కలుసుకుంటే, మేము కోరుకున్న పనులు చకచకా జరిగిపోతాయని" అన్నాడతను కన్నుగీటి.

ఎగ్బోటే పేరు వినగానే శంభులింగం కళ్ళు తళతళ మెరిశాయి. కారణం, బొంబేలో పేరుమోసిన స్మగ్లర్ అతను. ప్రతియేటా సుమారు కోటిరూపాయలు ఖరీదుచేసే అతని స్మగ్లింగ్ సరుకులు అక్కడికి చేరుతుంటాయి.

"ఎగ్బోటే సాబ్‌కు నామీద అంత విశ్వాసం వున్నందుకు చాలా సంతోషం! చెప్పండి. నా శాయశక్తులా సహాయపడతాను మీకు" అన్నాడు పరవశంతో.

"ఓ పెద్దపెజా నావా, నమ్మకమైన నలుగురు మనుషులూ కావాలి నాకు.

"సరుకు రాబోతోందా?"

"ఊఁ!"

"ఎంత?"

"ఇప్పుడే చెప్పలేను. ఐదారు ట్రిప్పులైనా పట్టవచ్చు."

"మొదటిసారి ఈ పాయింటుమీద సరుకు తెప్పిస్తున్నారా?"

"ఔను. ఎగ్బోటే సలహా మీదే!"

"ఎక్కడ బసచేశారు?"

"ఇంకా లేదు. గదికూడా కావాలి."

"సిద్ధంగా వుంది. మీ పేర్లు తెలుసుకోవచ్చా?"

"నన్ను శ్రీరాజ్ అంటారు. ఇతని పేరు బ్రిస్టల్. ఆంగ్లో ఇండియన్. ఇతని వ్యాపారం ఎక్కువ గోవాలో జరుగుతుంది. ఎగ్బోటే సలహామీద నాతో కలసి మొదటి సారి ఇక్కడికి సరుకు తెప్పిస్తున్నాడు."

శంభులింగం కుర్రాణ్ని కేకేసి, "కార్లోంచి వీరి సామాను తెచ్చి, పైన ఏడో నెంబర్ గదిలో పెట్టు" అన్నాడు హాల్లో కూర్చున్నవాళ్ళకు వినిపించేలా గట్టిగా.

ఏడో నెంబర్ అనగనే అక్కడ కూర్చున్న వాళ్ళందరి మొహాలు వికసించాయి. ఆ గది కేవలం వి.ఐ.పి.లకే, అంటే అతి ముఖ్యమైన స్మగ్లర్లకే కేటాయించబడుతుందని ఊళ్ళో ప్రతి ఒక్కరికీ తెలుసు.

శ్రీరాజ్ జేబులోంచి పర్సులాగి, ఓ వందరూపా

యలు కౌంటర్ మీద గిరాటేసి, హోటల్ బాయ్ వెంట మెట్లవైపు నడిచాడు. బ్రిస్టల్ అతన్ని అనుసరించాడు.

గదిలో ప్రవేశించాక, శ్రీరాజ్ పర్సులోంచి పది రూపాయలనోటు తీసి, బాయ్ చేతిలో పెడుతూ, "వుంచుకో! కింది కెళ్ళి, శంభులింగంతో నేను పిలుస్తానని చెప్పు" అన్నాడు.

కుర్రాడి కళ్ళు జిగేల్మన్నాయి. వినయంగా వంగి నమస్కారం పెట్టి వెళ్ళిపోయాడు.

ఐదునిమిషాల తరవాత శంభులింగం ఆదరాబాదరా వచ్చి, పిల్చారా?" అడిగాడు.

శ్రీరాజ్ తలూపి, "కూర్చో. నీతో చాలా ముఖ్య విషయాలు మాట్లాడాలి" అన్నాడు.

బ్రిస్టల్ తలుపుమూసి, సోఫాలో వారి పక్కన చతికిలబడ్డాడు.

శ్రీరాజ్ సిగరెట్ అంటించి, "నిజానికి ఇలాంటి చిన్న పనులకోసం స్వయంగా నేనెప్పుడూ రాను. ఈ పనులు చూసుకోడానికి నా మనుషులు చాలామంది వున్నారు. ఐతే, నేనిక్కడికి రావడానికీ వేరే కారణం వుంది" అన్నాడు లైటర్ జేబులో పడేస్తూ.

"ఏమిటా కారణం?" కుతూహలంగా అడిగాడు శంభులింగం.

"బొంబాయిలో వుండగా వీరప్పన్, గజేంద్రన్ల కథ తెలిసింది నాకు. గజేంద్రన్ ఇరవై ఏళ్ళ శిక్ష అనుభవించి, విడుదలై, పోలీసుల కన్ను గప్పి, ఇక్కడికి వచ్చి దాక్కున్నాడట. ఒకరిద్దరి ముందు తాను రహస్యంగా దాచిపెట్టిన ఆ ప్రభుత్వ బంగారాన్ని అమ్మదలచినట్టు చెప్పాడట. నేనా బంగారాన్ని కొనాలనుకుంటున్నాను.

ఎవ్వరైనా సరే మధ్యవర్తిగా ఆ బంగారం కొనడంలో సహకరిస్తే మంచి కమిషన్ ఇస్తాను వారికి."

"ఎంతిస్తారు?"

"అది గజేంద్రన్ ఒప్పుకునే రేటుమీద ఆధార పడుంటుంది. ప్రస్తుతం ప్రభుత్వ రేటు పది గ్రాములకు పదిహేడువందల చిల్లర వుంది. అది దొంగ బంగారం కదా, నేను పధ్నాలుగువందల చొప్పున కొనగలను."

శంభులింగం కాసేపు ఆలోచించి, "మీరు చెప్పినట్టు కొద్దిరోజులుగా, ఊళ్లో గజేంద్రన్ వచ్చినట్టు చెప్పు కుంటున్నమాట నిజమే! ఇరవై ఏళ్ళ తరవాత నిన్న రాత్రి టౌన్ హాలుమీద ఇత్తడికోడి శబ్దం వినిపించ డంతో వీరప్పన్ కూడా వచ్చేశాడని పుకారు బైలు దేరింది" అన్నాడు.

"వారికి నా అభిప్రాయం చేర్చగలవా? డబ్బు ఏ రూపంలో, యెక్కడ, ఏ దేశంలో, ఏ కరెన్సీలోనైనా సరే వెంటనే చెల్లిస్తాను."

శంభులింగం సాలోచనగా తలూపి, "ప్రయత్నిం చాలి. గట్టిగా ప్రయత్నించాలి. వాళ్ళెక్కడ దాక్కు న్నారో నాకూ తెలీదు....ఇక్కడ సరస్వతీదేవి అనే ఒకావిడుండేది. ఇరవై ఏళ్ళక్రితం వాళ్ళామెవద్ద పని చేసేవారు. ఆ బంగారాన్ని వాళ్ళు ఆ ఇంట్లోనే ఎక్కడో దాచివుంటారని ఊరిప్రజల అభిప్రాయం! ఐతే, ఈమధ్య ఆ ముసలామె చస్తూ ముక్కూ, మొహం తెలీని ఓ లేడీ డాక్టర్‌కు తన యావదాస్తి రాసిపోయింది. నిర్మల అనే ఆ లేడీ డాక్టర్ ప్రస్తుతం ఆ ఇంట్లోనే ఉంటోంది" అన్నాడు.

"దీన్నిబట్టి మీరంతా ఒకి పిరికిచవటలని స్పష్టమవుతోంది."

"ఎందుకూ?"

"ఒ. అనామకురాలిని ఊరినించి తరిమెయ్యడం మీకు చేతకాలేదా?"

"సరస్వతీదేవి వారసులు చాలా ప్రయత్నించారు. అందులో ముఖ్యుడు హనుమంతరావు. అతనామెకు ఆకాశ రామన్న ఉత్తరాలు కూడా రాసి బెదిరించడానికి ప్రయత్నించాడని విన్నాను. ఐనా ఆమె భయపడకుండా వచ్చి ఇక్కడ తిష్ట వేసింది....అందుకు ప్రతిగా ఆ ఇంట్లో ఓ హత్య కూడా జరిగింది."

"ఎవరి హత్య?"

"లాయర్ జయరాం! అతనే సరస్వతీదేవి ఆస్తిపాసులు చూసేవాడు."

"సరే, నువ్వు మాత్రం నా విషయంలో ప్రయత్నాలు కొనసాగించు. ప్రయత్నం ఫలిస్తే నీకు పెద్ద మొత్తంలో కమిషన్ ముట్టజెబుతాను."

"అలాగే ప్రయత్నిస్తాను" అంటూ లేచాడు శంభులింగం.

శ్రీరాజ్ కూడా లేచి, "నువ్విక్కడే విశ్రాంతి తీసుకో. నేనలా ఊళ్ళోకెళ్ళొస్తాను" అన్నాడు బ్రిస్టల్‌తో.

తలూపాడతను.

శంభులింగం వెంట బైటికి నడిచాడు శ్రీరాజ్. ఇద్దరూ మెట్లు దిగి కింద హాల్లో అడుగుపెట్టారు. సరిగ్గా అదే సమయంలో అర్జున్, డాక్టర్ నిర్మల భోజనంకోసం హోటల్లో ప్రవేశించారు.

శ్రీరాజ్ కళ్ళతో సైగచేసి, "ఎవరు వాళ్ళు?" అడిగాడు.

"ఇందాక చెప్పానే, డాక్టర్ నిర్మల అని. ఆమే!"

"ఆమె వెంట వున్న వ్యక్తి ఎవరు?"

"తెలీదు."

"వారితో నీకు పరిచయం వుందా?"

"లేదు. ఇక్కడ ఎవ్వరూ వాళ్ళతో మాట్లాడ్డానికిష్ట పడటం లేదు.

"నేను ఇష్టపడుతున్నాను. ఎందుకో తెలుసా? ఈ విధంగా ఆమెతో పరిచయం సంపాదించుకుని ఆ ఇల్లు అమ్ముతుందేమో అడిగిచూస్తాను. ఒప్పుకుంటే కొనేస్తాను. ఆ విధంగా ఆ బంగారం నిజంగా అక్కడే దాచబడుంటే గజేంద్రన్, వీరప్పన్ విధిలేక నన్ను సంప్రదించక తప్పదు. నీ కమీషన్ మాత్రం నీకు తప్పక ముడుతుంది. ఎలా ఉంది ఆలోచన?"

"బ్రహ్మాండంగా వుందిసార్. అలాగే చెయ్యండి" అన్నాడు శంభులింగం మెరిసే కళ్ళతో.

ఆలోగా నిర్మలా, అర్జున్ ఓ మూల ఖాళీగా వున్న ఓ టేబుల్ ముందు కూర్చున్నారు. శ్రీరాజ్ వడివడిగా వాళ్ళను సమీపించి, "అభ్యంతరంలేకుంటే ఇక్కడ కూర్చోవచ్చా?" అడిగాడు.

"తప్పకుండా! కూర్చోండి" అన్నాడు అర్జున్ సభ్యత కోసం.

"నా పేరు శ్రీరాజ్. పనిమీద కొత్తగా ఇక్కడికి వచ్చాను."

"నా పేరు అర్జున్. ఈవిడ డాక్టర్ నిర్మల. మేమూ ఊరికి కొత్తవాళ్ళమే అనుకోండి."

"డాక్టర్ నిర్మల అంటే, ఈమధ్య అనుకోకుండా అపార ఆస్తికి వారసురాలయ్యారని ఊళ్ళో చెప్పుకుం టున్న ...."

"ఆc, ఆవిడే!"

శ్రీరాజ్ ఆమెవైపు తిరిగి, "ఆ ఇల్లు చాలా పురాతన మైనదీ, విశాలమైనదీ అని విన్నాను ఇక్కడ నేనూ ఓ ఇల్లు సంపాదించడానికి కొందరితో సంప్రదింపులు జరుపు తున్నాను. మీరా ఇల్లు అమ్మాలనుకుంటే నాతో చెప్పడం మర్చిపోకండి" అన్నాడు.

"నేను ఒంటరిదాన్ని. అంత పెద్ద ఇల్లు, పైగా ఊరికి దూరంగా వున్న ఇల్లు నాకవసరంలేదు. మంచి ధరవస్తే దాన్ని అమ్మేసి, ఊళ్లో ఓ ధర్మాసుపత్రితోబాటు నే నుండటానికి మంచి ఇల్లు నిర్మించుకోవాలనుకుంటున్నాను. వీలుంటే రేపే వచ్చి ఇల్లు చూసుకోండి" అంది నిర్మల.

"తప్పకుండా వస్తాను" అన్నాడు శ్రీరాజ్.

"అర్జున్ నవ్వి, "కూర్చున్నచోటే వచ్చేసింది బేరం! ఈ సందర్భంలో మీరు మాతోపాటు భోంచెయ్యాక తప్పదు" అన్నాడు.

"ష్యూర్! ఐతే బిల్లుమాత్రం నన్నే ఇవ్వనివ్వండి. స్నేహితులకు విందులివ్వడంలో నాకు చాలా ఆనందం కలుగుతుంది" అంటూ మెనూకార్డు చూసి, ఖరీదైన పదార్థాలు ఆర్డరిచ్చాడు శ్రీరాజ్.

సరిగ్గా అదే క్షణంలో ఓ అందమైన యువతి ప్రవే శించింది హోటల్లోకి. అందరి కళ్ళూ అప్రయత్నంగా అటు తిరిగాయి. ఆమె క్షణంపాటు గుమ్మం దగ్గరే నిల్చుని, చుట్టూ కలయచూసింది. అర్జున్ మీద దృష్టి పడగానే ఆమె పెదాలపై పరిచయపూర్వకమైన చిరు

నవ్వు విచ్చుకుంది.

ఆమె ఎవ్వరో కాదు. క్రితంరోజు అతను కణ్ణనూర్ వస్తూ దార్లో కారు బాగు చేసిన యువతి!

అర్జున్ని చూడగానే ఆమె వడివడిగా వాళ్ళను సమీపించి, "హలో, గుడాఫ్టర్నూన్! నిన్న మీరు నా కారు బాగుచేసి వెళ్ళగానే దార్లో మళ్ళీ ట్రబులిచ్చింది. అష్టకష్టాలుపడి బాగుచేసుకుని వచ్చాను" అంది ఓ ఖాళీ కుర్చీలో చతికిలబడుతూ.

"ఎవరీవిడ?" అడిగాడు శ్రీరాజ్.

ఆమె పేరు తెలీక అర్జున్ తటపటాయిస్తుంటే, నవ్వి- "నా పేరు సంధ్య! చిత్తూరు వాస్తవ్యురాలిని. ఆర్కియాలజీ చదువుతున్నాను. ఇక్కడి సముద్రం ఒడ్డున వ్యాపించి వున్న రాతికొండల్లో ప్రాచీనకాలంనాటి గుహలెన్నో వున్నాయి. వాటిని అధ్యయనం చెయ్యడానికి వచ్చాను" అంది.

అర్జున్ డాక్టర్ నిర్మలనూ, శ్రీరాజ్నూ ఆమెకు పరిచయం చేశాడు. ఆమె వారిస్తున్నా వినకుండా తమతోపాటు ఆమెకూ భోజనం తెప్పించాడు శ్రీరాజ్.

"మీరెక్కడ బస చేశారు?" అడిగాడు అర్జున్ భోంచేస్తూ.

"ఈ హోటల్లోనే! పదో నెంబర్ గదిలో. మీరూ ఇక్కడే వుంటున్నారా?" అడిగింది సంధ్య.

"లేదు. డాక్టర్ నిర్మలగారింట్లో!"

"డాక్టర్ నిర్మల అంటే, ఈ ఊరి, జమిందారిణి సరస్వతీదేవి ఆస్తికి వారసురాలైన నిర్మలగారేనా?"

తలూపాడు అర్జున్.

"దేనికైనా పెట్టి పుట్టాలంటారు. మీ అదృష్టానికి

సాటి స్త్రీగా నేను చాలా అసూయపడుతున్నానండోయ్" అంది సంధ్య నిర్మలతో కలుపుగోలుగా.

అందరూ ఘొల్లుమన్నారు ఒక్కసారి.

"ఆర్కియాలజీపట్ల నాకు చాలా ఆసక్తి వుంది. ఒకసారి నేనూ ఆ ప్రాచీన గుహాల్ని చూడాలనుకుంటున్నాను" అన్నాడు అర్జున్.

"తప్పకుండా! రేపు నా వెంట రండి. ఇప్పుడే అక్కణ్నించి వస్తున్నాను. బాగా అలిసిపోయాను. రేపుదయం పది గంటలకు వెళదాం! మీరూ వస్తారా?" అడిగింది సంధ్య, నిర్మలని."

"సారీ, నేను ఆర్థోపెడిక్ డాక్టర్ని. ఆర్కియాలజీ పట్ల అంతగా ఆసక్తిలేదు."

"ఆవిడ రాకున్నా, నేను మాత్రం తప్పక వస్తాను" అన్నాడు అర్జున్ నవ్ కిన్‌తో చేతులు తుడుచుకుంటూ.

శ్రీరాజ్ వీరి సంభాషణపట్ల ఆట్టే కుతూహలం చూపడంలేదు. భోజనాలు పూర్తయ్యాక బేరర్ ద్వారా బిల్ తెప్పించుకుని, చెల్లించి లేచాడు. "విష్ యూ ఆల్ ది బెస్టు! నిర్మలగారూ! రేపు వస్తున్నాను మీ ఇల్లు చూడానికి."

"యూ ఆర్ వెల్‌కమ్ ఎట్ ఎనీ టైమ్!" అంది నిర్మల నవ్వుతూ.

శ్రీరాజ్ వారివద్ద సెలవు తీసుకుని, కౌంటర్ని సమీపించాడు. అక్కడ కూర్చున్న శంభులింగం ప్రశ్నార్థకంగా చూశాడతనివైపు.

"నిర్మల ఇల్లు అమ్మడానికి ఒప్పుకుంది" అన్నాడు శ్రీరాజ్ రహస్యంగా.

"వెరీ గుడ్! ఇంత సులభంగా మన రొట్టె విరిగి

నేతిలో పడుతుందనుకోలేదు" అన్నాడు శంభులింగం గారపళ్ళికిలిస్తూ.

"అక్కడ కూర్చున్న యువతి గురించి నీకేమైనా తెలుసా?"

"అంతగా తెలీదు. పదీ పన్నెండు రోజుల క్రితంమే ఆమె ఇక్కడికి వచ్చింది."

"అలాగా! స్థానిక ప్రజలు ఆమె గురించి ఏమనుకుంటున్నారు?"

"ఇక్కడ కొత్తవాళ్ళతో ఎవ్వరూ సంపర్కం పెట్టుకోరు. ఐనా, ఆమె గురించి పొద్దంతా కొండ గుహల్లో తిరిగే మతిలేని సైంటిస్టు అనుకుంటున్నారు అందరూ!"

సాలోచనగా తలూపి, "సరే, వస్తాను" అంటూ మెట్లువెపు నడిచాడు శ్రీరాజ్.

# 8

రాత్రి సరిగ్గా పదిగంటలకు తన గదిలోంచి బైటికి వచ్చింది సంధ్య. తలుపు మూసి, లాక్ చేసి, ఓసారి అటూ, ఇటూ చూసి మెట్లవైపు నడిచింది. నడవాలో యెవ్వరూ లేరు. నడవా కిరు పక్కలా వున్న గది తలుపులన్నీ మూసి వున్నాయి.

మెట్లు దగ్గర ఆగి, మరోసారి చుట్టూ కలయజూసి, వడివడిగా కిందికి దిగసాగింది. ఆమె అలా హాల్లో అడుగు పెట్టిందో లేదో, పైన ఏదో నెంబర్ గది తలుపు తెరుచుకుని ఇవతలికి వచ్చాడు శ్రీరాజ్.

తలుపు దగ్గరగా చేరవేసి గబగబా మెట్లవైపు నడిచాడు. మెట్లు దిగి హాల్లో అడుగుపెట్టి ఆమెకోసం చూశాడు. బైటికి వెళుతోంది. హాల్లో అట్టే జనం లేరిప్పుడు. కౌంటర్లో నైట్ డ్యూటీ క్లర్కు కాబోలు

కూర్చుని రిజిష్టర్‌లో ఏవో రాసుకుంటున్నాడు.

ఆమెను కాస్త ముందుకు పోనిచ్చి, వెంబడించడం ప్రారంభించాడు శ్రీరాజ్. ఆమె చేతిలో పసుపురంగు ప్లాస్టిక్ టార్చి కనిపిస్తోంది! వీధులగుండా చాలా నింపాదిగా నడుస్తూ తిన్నగా ఊరవతలకి దారితీసిందామె.

ఒకరి వెనక ఒకరు నడుస్తూ కొద్ది సేపటికే ఇద్దరూ ఊరుదాటి సముద్రంవైపు వెళ్ళే కాలిబాటమీద నడవసాగారు. వయసులో వున్న అందమైన యువతి. అందునా ఒంటరి. అంత నిర్భయంగా చీకట్లోపడి నిర్మానుష్యమైన ప్రదేశంలో సంచరించడం శ్రీరాజ్‌కు విచిత్రంగా తోస్తోంది.

సముద్రం ఒడ్డునున్న రాతికొండలమధ్య నడుస్తూ ఆమె గుహాకు కొద్దిదూరంలో ఆగి, ఆవైపు మూడుసార్లు టార్చి వెలిగించి ఆర్పింది. మరుక్షణం గుహాల దగ్గర అదే విధంగా మూడుసార్లు టార్చి వెలిగింది.

చుట్టూ కీచురాళ్ళ రొద. దూరాన సముద్ర ఘోష. ఓ రాతిబండ మాటున నక్కి చూడసాగాడు శ్రీరాజ్. రెండు నిమిషాల తరవాత గుహాలవైపునించి ఓ ఆకారం మసక చీకట్లో నడుస్తూ ఆమెని సమీపించింది.

స్వరం తగ్గించి ఇద్దరూ ఏదో మాట్లాడుకోసాగారు. చెవులు ఎంత రిక్కించినా, సముద్రం ఘోషలో వారి మాటలు వినలేకపోయాడు శ్రీరాజ్. ఆ బండరాతి మాటునించి ఇవతలికి వచ్చి, వాళ్ళని సమీపించడానికి ప్రయత్నిస్తే పట్టుబడే ప్రమాదముంది.

అందుకే కిక్కురుమనకుండా అక్కడే నిల్చున్నాడు. కాసేపయాక ఆమె వెనుదిరిగి ఊరివైపు నడకసాగించింది. ఆ ఆకారం కూడా వెనుదిరిగి గుహాలవైపు వెళ్ళిపోయింది.

శ్రీరాజ్ ఆమెను బాగా ముందుకు పోనిచ్చి, సన్దేహం కాకుండా వెంబడించసాగాడు. ఆమె తిన్నగా హోటల్ చేరి, ఏమీ ఎరగనట్టు తన గదిలోకి వెళ్ళిపోయింది.

అతనుకూడా తన గదిలో ప్రవేశించి, తలుపు మూసుకున్నాడు.

# 9

కాలింగ్ బెల్ శబ్దం విని, చదువుతున్న పుస్తకం మూసి, "ఎవరూ?" అంది నిర్మల.

"నేను, శ్రీరాజ్ ని" వినిపించింది అవతలనించి.

లేచి తలుపు తీసింది.

"గుడ్ మార్నింగ్!" అన్నాడు శ్రీరాజ్ నవ్వుతూ.

"గుడ్ మార్నింగ్, రండి" అంది నిర్మల తలుపుకడ్డం తొలుగుతూ.

అతను లోనికి వచ్చి, చుట్టూ పరికించి, "వెల్ డన్! రాజప్రాసాదంలా వుంది" అన్నాడు.

"మీ పేరుకూడా శ్రీరాజ్ కదా, అందుకే ఈ ఇల్లు అంతగా నచ్చివుండాలి మీకు" అంది ఆమె నవ్వుతూ.

అతను మూతిమీది మీసాలూ, కనుబొమలూ, తల మీది విగ్గూ తీసి, "ఇప్పుడు కూడా శ్రీరాజేనా నంటారా?" అడిగాడు.

"డిటెక్టివ్ దుర్యోధన్ గారూ! మీరా!?" అంది నిర్మల సంభ్రమాశ్చర్యాలతో.

"ఔను. ఇక్కడ లాయర్ జయరాం హత్య జరిగిందని అర్జున్ నాథ ఫోన్ చెయ్యగానే ఇన్ స్పెక్టర్ యుగంధర రెడ్డితో మారువేషంలో బైలుదేరి వచ్చాను. ఇన్ స్పెక్టర్ బ్రిస్టల్ పేరుతో నా వెంట వున్నాడు. లాయర్ ఎక్కడ హత్య చెయ్యబడ్డాడు?" అడిగాడు

దుర్యోధన్ తిరిగి మీసాలూ, విగ్గూ పెట్టుకుంటూ.

నిర్మల తాళంచెవులందుకుని, "రండి, చూపిస్తాను" అంటూ అతన్ని గెస్టు హౌస్‌లోకి తీసుకెళ్ళి, లాయర్ చంపబడ్డ గది చూపించింది.

టేబిల్, కుర్చీ ఇంకా అక్కడే వున్నాయి. నిర్మల ఆ రోజు జరిగినదంతా వివరించింది తనకి. అలవాటు ప్రకారం చుట్టూ పరిశీలిస్తున్న దుర్యోధన్ ఎక్స్‌రే కళ్ళు అప్రయత్నంగా టేబిల్ కింద మాత్రం దాని సైజుకన్నా పెద్ద సైజులో నాలుగు మూలల పెద్ద గీత కనిపిస్తోంది. ఓ చివర చిన్న ఉక్కు హాండిల్ కూడా వుంది.

"ఇదేమిటి?" అంటూ టేబిల్ జరిపి, హాండిల్ పట్టి ఎత్తాడు పైకి.

అది వెడల్పాటి ఉక్కు షీటు. షీట్ ఎత్తగానే కింద పెద్ద హౌస్‌లాటిది కనిపించింది. రెండడుగుల లోతులో హౌస్ మీద బాగా తుప్పుపట్టిన ఓ వాటర్ పంప్, రెండు మూడు జింక్ పైపులూ అమర్చి వున్నాయి.

"ఒకప్పుడిక్కడ నీళ్ళ హౌస్ వుండేదట. ఈ పంపు ద్వారా తోటలోని చెట్లకు నీళ్ళు పెట్టేవారట. పోలీసులు కూడా చూశారు దాన్ని" అంది నిర్మల.

దుర్యోధన్ సాలోచనగా తలూపి, ఉక్కుషీటును యథాతథంగా తిరిగి హౌస్ మీద పెట్టేసి లేచాడు. ఆ గదికాక మరో మూడు గదులూ టాయిలెట్, బాత్‌రూం ఉన్నాయి పదండి. ఆ భవనంలో ఏవైనా అండర్ గ్రౌండ్ గదులూ అవీ వున్నాయేమో చూడాలి" అన్నాడు దుర్యోధన్ బైటికి నడుస్తూ.

గెస్టు హౌస్‌కు తాళంవేసి, ఇద్దరూ భవనంలోకి ప్రవేశించారు.

# 10

గంట తరవాత ఇంట్లోంచి బైటపడి, తిన్నగా హోటల్ చేరుకున్నాడు. కౌంటర్లో కూర్చున్న శంభులింగం అతన్ని చూడగానే గారపళ్ళికిలించి, "ఇంటి విషయం ఏమైంది?" అడిగాడు రహస్యంగా.

"అక్కణ్ణించీ వస్తున్నాను. చాలా పురాతన ఇల్లు. లోపల అనేక భూగృహాలూ, గోడల్లో అరలూ తప్పక ఉండివుంటాయి. వాటిల్లోనో యెక్కడో ఆ బంగారం దాచివుంటుంది. రేపు ఆ లేడీ డాక్టర్తో దాని కొనుగోలు గురించి మాట్లాడతాను..అలా పైకిరా నీతో మాట్లాడాలి" అన్నాడు దుర్యోధన్.

శంభులింగం వెంటనే అతని వెంట పైకివచ్చి గదిలో ప్రవేశించాడు.

"ఇరవై ఏళ్ళక్రితం సరస్వతీదేవి వద్ద నౌఖర్లుగా ఎవరు పనిచేసేవారు?" అడిగాడు దుర్యోధన్ అతను సోఫాలో కూర్చున్నాక.

శంభులింగం కాసేపు ఆలోచించి, చాలాకాలంనాటి మాట. నాకు సరిగ్గా గుర్తులేదు. అప్పుడు నేను పదిహేడూ, పద్దెనిమిదేళ్ళ కుర్రాణ్ణి, ఐతే, ఆ ఇంట్లో ఓ వంటమనిషీ. ఇంటిపనుల కోసం ఇద్దరు నౌఖర్లూ, ఓ తోటమాలీ వుండేవారనుకుంటాను" అన్నాడు.

"ఇప్పుడు వాళ్ళెక్కడున్నారు?"

"వంటమనిషీ, ఇద్దరు నౌఖర్లూ ఈమధ్యే చనిపోయారు. తోటమాలి ఇంకా బ్రతికున్నట్టున్నాడు. బాగా ముసలివాడై పోయాడు."

"ఎక్కడుంటాడతను."

చెప్పాడు శంభులింగం."

"ఆల్ రైట్. అతనితో మాట్లాడి కొన్ని వివరాలు తెలుసుకోవాలి" అంటూ లేచాడు దుర్యోధన్.

ఇద్దరూ బైటికి నడిచారు. దుర్యోధన్ తలుపు లాక్ చేసి కారెక్కాడు. ఊరి వెలపల హారిజనులు నివసించే చోట వుంది శంభులింగం చెప్పిన గుడిసె. గుడిసెముందు గోనె పట్టామీద కూర్చుని చుట్ట కాలుస్తున్నాడో పండు ముసలి. తమ వాడలోకి తళతళ మెరిసే కారు వచ్చి ఆగడం చూసి, చుట్ట కాల్చడం ఆపి, కన్నార్పకుండా ఇటే చూడసాగాడు.

దుర్యోధన్ అతన్ని సమీపించి, "నీ పేరు?" అడిగాడు.

"సుబ్బయ్య!"

"ఇరవై ఏళ్ళక్రితం సరస్వతీదేవి దగ్గర తోటమాలిగా పనిచేసేవాడివి కదూ?"

తలూపాడు ముసలాడు.

"ఎన్నాళ్ళు పనిచేశావక్కడ?"

"పదిహేను ఏళ్ళు."

"మధ్యలో ఎందుకు మానేశావు? ఆమె తీసేసిందా?"

"అపచారం! ఆమె దేవతలాంటి మనిషి. ఆ వెధవ గజేంద్రనే ఆమెతో చెప్పి నన్ను తీయించాడు."

"ఎందుకు?"

"చాలా కాలంగా తోటలోని చెట్లకు నీళ్ళు పట్టడానికి అక్కడో పెద్ద హౌవుస్ వుండేది. నేను క్యాన్‌లో ఆ నీళ్ళు నింపి చెట్లకు పోసేవాణ్ని. అలా పదిహేనేళ్ళు పోశాను. తరవాత వాడక్కడ చిన్న వాటర్ పంప్ పెట్టించి, ఇక మనిషి అవసరంలేదని చెప్పి, నన్ను మాన్పించాడు. ఆ పంపునడిపే పనేదో వాడే చూసుకునే

వాడట."

"బాగా ఆలోచించి చెప్పు. ఆ పంపు ఎప్పుడు పెట్ట బడింది?"

"వాడు ప్రభుత్వ బంగారాన్ని దోచుకున్న సంవత్సరమే! అదే సంవత్సరం వాడు అమ్మగార్ని ఒప్పించి, అక్కడే చిన్న గెస్టు హావుస్ కట్టించాడు....తరవాత వాడు పట్టుబడి, జైలుకెళ్ళాక, ఇటు అమ్మగారి ఆరోగ్యం కూడా పాడై తరచూ ఆస్పత్రిపాలు కాసాగారు. దాంతో ఆమెకు తోటపట్ల ఆసక్తిపోయి, దాని బాగోగులు చూసేవారే కరువయ్యారు."

"పంపు పెట్టేముందు ఆ నీళ్ళ హావుస్ యెక్కడుండేది?"

"పంపుకిందే!"

దుర్యోధన్ సాలోచనగా తలూపి, పర్సులోంచి ఇరవై రూపాయలనోటు తీసి, ముసలాడి చేతిలో పెట్టి, కారువైపు నడిచాడు.

## 11

చుట్టూ చీకటి. సముద్ర ఘోష! టార్చిలైటు వెలిగించకుండా, చుక్కల మసక వెలుగులో చూసుకుంటూ గుహలు ప్రారంభమయ్యేచోటికి చేరుకున్నారు డిటెక్టివ్ దుర్యోధన్, ఇన్‌స్పెక్టర్ యుగంధరరెడ్డి.

గుహలో ప్రవేశించాకనే టార్చి వెలిగించి లోపల పరిశీలిస్తూ, బైటికి వచ్చాక ఆర్పివేస్తూ దాదాపు మూడు గంటలపాటు వెదికారు. మానవమాత్రుడు కానరాలేదు ఎక్కడా. ఒక్కో గుహ లోపలివరకూ చొచ్చుకుపోయి లోపల మరిన్ని గుహ ద్వారాలు బయల్పడ్డాయి.

రెండు మూడు గుహల్లో ప్రవేశించగానే వాళ్ళని

చూసి గట్టిగా ఊలలపెడుతూ పరుగుతీశాయి కొన్ని గుంటనక్కలు.

చీకట్లో రేడియం డయల్ రిస్టువాచీ చూసుకుని, "నాలుగవుతోంది. అనవసరంగా మనం ప్రయాసపడుతున్నామేమో అనిపిస్తోంది" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఇంకా ఏడెనిమిదే మిగిలాయి. చూద్దాం పదండి" అంటూ ఓ గుహాలో అడుగుపెట్టాడు దుర్యోధన్.

అయిష్టంగానే అతన్ని అనుసరించాడు ఇన్‌స్పెక్టర్. ముందుకు సాగుతున్నకొద్దీ ఇంకా పొడవవుతోంది గుహ. అలా అరఫర్లాంగు నడిచాక, అది అంతమై దానికిరు పక్కలా మరో రెండు సొరంగ ద్వారాలు కనిపించాయి.

కుడివైపున్న సొరంగంలో అడుగుపెట్టాడు దుర్యోధన్. అప్పటికే అతని చేతిలోని టార్చి సెల్స్ వీక్ అయి, అడపాదడపా ఆరిపోసాగింది. టార్చిని గట్టిగా విదిలించి బటన్ వత్తాడు.

వెలిగింది. ఆ వెలుగులో ఎదురుగా కనిపించిన దృశ్యం చూసి, "ఇన్‌స్పెక్టర్!" అంటూ ఆగిపోయాడు దుర్యోధన్.

"ఏమిటి?" అంటూ అటు చూసి, స్తబ్దైపోయాడు ఇన్‌స్పెక్టర్.

ఎదురుగా రాతిగోడకు వీపానించి, కాళ్ళు బార్లా చాపుకుని నేలమీద కూర్చున్నాడో వ్యక్తి. తలముందుకు వాలిపోయి వుంది. రెండు అరచేతులూ నేలమీద ఆనించి వున్నాయి. చిరిగి పేలికలైన బట్టలు. నెరసిన చింపిరి జుత్తు. అడ్డదిడ్డంగా పెరిగిన గడ్డం!

నిద్రపోతున్నాడా? అనుకుంటూ "ఏయ్, ఎవరు నువ్వు?" అడిగాడు ఇన్‌స్పెక్టర్ గట్టిగా.

జవాబు లేదు.

"నిన్నే!" రెట్టించాడు.

ఐనా అతను తలెత్తలేదు.

అడుగులో అడుగు వేసుకుంటూ అతన్ని సమీపించి స్థాణువులై పోయారిద్దరూ! అతని కాలి వేళ్ళూ, చేతి వేళ్ళూ గోళ్ళు వూడి, ఎర్రని మాంసపుముద్దలా కనిపిస్తున్నాయి. ముఖమంతా సిగరెట్లతో కాల్చినట్టు బొబ్బలుకట్టివుంది. పేలికలైన బట్టల్లోంచి నల్లగా కమిలిన వాతలు కనిపిస్తున్నాయి.

"శవం కుళ్ళిపోలేదు. అంటే చనిపోయి ఎక్కువసేపు కానట్టుంది" అంటూ అతని గెడ్డంకింద వేలుపెట్టి తల పైకెత్తాడు దుర్యోధన్.

షాక్ తగిలినట్టు అదిరిపడ్డాడు ఇన్‌స్పెక్టర్.

"గజేంద్రన్!"

సరిగ్గా అదే సమయంలో వెనక గుహలో ఎవరో పరిగెత్తుతున్నట్టు అడుగుల శబ్దం వినిపించింది. ఇద్దరూ మెరుపులా అక్కణ్నుంచి బైటపడి టార్చిలైట్లు వేశారు.

ఓ ఆకారం గుహ ముఖద్వారంవైపు పరిగెత్తుతోంది!

"ఆగు!" అరిచాడు ఇన్‌స్పెక్టర్ జేబులోంచి పిస్తోలు తీస్తూ.

ఆ ఆకారం ఆగలేదు. వెనుదిరిగి చూడలేదు.

పరిగెత్తుతూ కాళ్ళకి గురిపెట్టి ట్రిగ్గర్ వత్తాడు దుర్యోధన్. అదే క్షణంలో ఆ ఆకారం గుహ మలుపు తిరిగింది. గుండు రాయికి తగిలి వ్యర్థమయింది.

ఇద్దరూ ఆ మలుపు తిరిగి చూసేలోగా ఆ ఆకారం గుహలోంచి బైటపడింది. ఇద్దరూ బాణాల్లా దూసుకెళ్ళి చుట్టూ కలయజూశారు. నిర్మానుష్యం! గంటసేపు గాలిం

చారు ఆ ప్రదేశమంతా. నిరాశే మిగిలింది.

పెదవి విరిచాడు ఇన్‌స్పెక్టర్. "వాణ్ని పట్టుకుని వుంటే కేసు చాలా సులువుగా విడిపోయేది. ఇంతకీ ఎవరై వుంటాడు వాడు? వీరప్పనా? బంగారం దోపిడీలో ఇద్దరూ పాల్గొన్నా, ఇరవై ఏళ్ళ శిక్ష అనుభవించింది తానే గనక' వీరప్పన్‌కు వాడి వాటా ఇవ్వడానికి నిరాకరించాడా గజేంద్రన్?

అందుకే వాడతన్ని చిత్రహింసలు పెట్టి, బంగారం ఎక్కడ దాచాడో చెప్పమని యాతనాలు పెట్టాడా? గజేంద్రన్ ఆ బాధలు తాళలేక రహస్యం చెప్పేశాడా?"

"వాడి మరణంతో ఇప్పుడు నా అంచనాలు కొన్ని తారుమారయ్యాయి .... ఇక మనం చెయ్యవలసిందల్లా స్థానిక పోలీసులకు శవాన్ని అప్పగించి, తరవాతి కార్యక్రమం గురించి ఆలోచించడమే!" అన్నాడు దుర్యోధన్.

రిస్టువాచీ చూసుకున్నాడు ఇన్‌స్పెక్టర్. ఐదున్నరవుతోంది. దూరాన ఊళ్ళో ఆగి ఆగి కోడి కూతలు వినిపిస్తున్నాయి.

## 12

అదేరోజు మధ్యాహ్నం రెండు గంటల ప్రాంతంలో సంధ్య తన గదిలో వుందని ధృవపర్చుకుని, ఆమె గది ముందాగి తలుపు తట్టాడు దుర్యోధన్.

"ఎస్?" లోపలినించి వినిపించింది.

"నేను, శ్రీరాజ్‌ని."

తలుపు తెరుచుకుంది. "రండి, లోపలికి రండి" అంది సంధ్య సాదరంగా.

లోన అడుగుపెట్టాడు దుర్యోధన్.

"కొద్ది రోజులుగా ఊళ్ళో ఓ వార్త ప్రచారంలో

వుంది....” అంటూ ఇరవై ఏళ్ళ క్రితం గజేంద్రన్, వీరప్పన్‌లు ప్రభుత్వ బంగారాన్ని దోచుకున్న కథ చెప్పి- “వాళ్ళిద్దరూ ఆ బంగారంకోసం ఇక్కడికి చేరుకున్నారనీ ఎవరికీ కనిపించకుండా ఎక్కడో దాక్కుని సమయం కోసం కాచుకున్నారనీ అనుకుంటున్నారు జనం! గజేంద్రన్, వీరప్పన్‌లు ఆ గుహల్లో ఎక్కడో దాగివుంటారని ఊహించి, రాత్రి తన సిబ్బందితో అక్కడ గాలించాడట స్థానిక పోలీస్ ఇన్‌స్పెక్టర్.

ఓ గుహాలో చిత్రవధ చెయ్యబడ్డ గజేంద్రన్ శవం కనిపించిందట వాళ్ళకు” అని ముగించి ఆమెను పరీక్షగా చూశాడు దుర్యోధన్.

ఆ విషయం వినగానే ఆమె మొహం హఠాత్తుగా తెల్లబడిపోయింది. ఐనా, వెంటనే తమాయించుకుని, “ఇంతకీ నాతో ఏం చర్చించాలనుకున్నారు?” అంది. సాధ్యమైనంత నార్మల్‌గా.

దుర్యోధన్ కోటు జేబులోంచి మడత పెట్టిన వెడల్పాటి కాగితం తీసి, “ఉదయం పదిగంటలకు, గజేంద్రన్ విషయం నిర్ధారణ చేసుకుందామని పోలీస్ స్టేషన్‌కెళ్ళాను.

ఆ సమయంలో ఇన్‌స్పెక్టర్ ముందు మద్రాసు క్రయింబ్రాంచినుంచి వచ్చిన మరో ఇన్‌స్పెక్టర్ కూర్చున్నాడు. వారిమధ్య బల్లమీద బాగా ముడతలుపడి, మాసిపోయిన ఓ కాగితం పర్చి వుంది.

గజేంద్రన్ విశాఖపట్నం జైల్లో ఏ గదిలో అయితే బంధింపబడ్డాడో, ఆ గది గోడల్లోని ఓ రాయి మధ్య సందులో ఆ కాగితం దొరికిందట జైలు సిబ్బందికి. అది తప్పకుండా వాడు ఆ బంగారం దాచిన చోటుకు సంబం

ధించినదే అయ్యుంటుందనీ, జైలుకొచ్చిన కొత్తలో తన జ్ఞాపకార్థం కాగితంమీద ఆ గుర్తులు గీసి, గోడలో దాచి వుంటాడనీ, విడుదలయ్యే హడావుడిలో దాని సంగతి మర్చిపోయుంటాడనీ భావించి, విశాఖ పోలీసులు వెంటనే దాన్ని పరిశీలనకోసం మద్రాసు పోలీసులకు పంపారట.

ఆ మ్యాపు కణ్ణనూర్‌కు సంబంధించినదేమో కనుక్కుందామని మద్రాసు క్రయింబ్రాంచి ఇన్‌స్పెక్టర్ దాన్ని ఇక్కడికి తీసుకువచ్చాడట. అదృష్టవశాత్తూ అదే సమయంలో నేనక్కడికి వెళ్ళడంవల్ల దాన్ని చూడగలిగాను.

ఊరికే చూళ్లేదు. అందులో పొందుపరిచిన అతి చిన్న గీతను కూడా జాగ్రత్తగా మదిలో పొందుపరుచుకుని, తిరిగి రాగానే ఈ కాగితంమీద అచ్చుగుద్దినట్టు నకలు చేశాను.

మీరు ఆర్కియాలజిస్టు కదా, ఇదివరకు ఎన్నో ప్రాచీన పత్రాలూ, లిపులూ, పురాతన చిత్రపటాలూ స్టడీచేసి వుంటారు. వాటిని డీకోడ్ చెయ్యడంలోనూ మంచి అనుభవం గడించి వుంటారు.

అందుకే నాకర్థంకాని ఈ మ్యాపును మీరైనా అర్థం చేసుకుని, నాకు సూచనలిస్తారని ఆశతో వచ్చాను" అన్నాడు దుర్యోధన్ కాగితాన్ని ఆమె చేతికిస్తూ.

సంధ్య నవ్వి—"ఐతే, అందరిలా ఆ బంగారంమీద మీ కన్ను పడిందన్నమాట" అంది కాగితం మడత విప్పుతూ.

"బంగారమన్నాక యెవరికి మోజుండదు చెప్పండి? మీ ప్రయత్నం వృథా కాదులెండి. ఐ మీన్, ఫిఫ్టీ-ఫిఫ్టీ! ఏమంటారు?"

"మగవాడు మీకే బంగారంపట్ల అంత మోజుంటే, ఆడదాన్ని నా కెంతుండాలి. ఆల్ రైట్ తప్పక ప్రయత్నిస్తాను" అంది సంధ్య మ్యాపును పరీక్షగా చూస్తూ.

"దాన్ని సంపూర్ణంగా అర్థం చేసుకున్నాక, పిలవండి నన్ను, వస్తా మరి!" అంటూ లేచాడు దుర్యోధన్.

"అలాగే!" అంది సంధ్య.

గదిలోంచి బైటికి వచ్చి, తలుపు మూశాడు దుర్యోధన్.

## 13

అది సరస్వతీదేవి ఇల్లు!

డిటెక్టివ్ దుర్యోధన్, ఇన్ స్పెక్టర్ యుగంధర రెడ్డి, డాక్టర్ నిర్మల, అర్జున్ నిశ్శబ్దంగా కూర్చుని తమ తమ ఆలోచనల్లో నిమగ్నమై వున్నారు. గదిలో లైటు వెలుగుతోంది.

దుర్యోధన్ రిస్టువాచీ చూసుకుని, "పదవుతోంది. నా అంచనా తప్పకుంటే ఇరవై ఏళ్ళ క్రితం ప్రారంభమైన ఈ కేసు ఈ రాత్రితో అంతమౌతుంది. ఇక బైలుదేరదామా?" అన్నాడు.

సిగరెట్ చివరిదమ్ములాగి, కిందపడేసి నలుపుతూ తలూపాడు ఇన్ స్పెక్టర్.

"నిర్మలగారూ! లైటార్పెయ్యండి. ఎవరేం చెయ్యాలో అందరికీ జ్ఞాపకం వుంది కదూ?" అడిగాడు దుర్యోధన్.

అందరూ తలలూపారు. నిర్మల లేచి లైటార్పేసింది.

దుర్యోధన్ జేబులోంచి పిస్తోలూ, పెన్సిల్ టార్చి తీసి, చీకట్లో మిగతావాళ్ళకి దారిచూపుతూ బైటికి నడిచాడు. అందరూ ఇంటి వెనక తలుపు తెరిచి, తోటలోకి నడిచారు. బైట మసక చీకటి. పెన్సిల్ టార్చి ఆర్పి

తోట చివర వున్న గెస్ట్ హవుస్ వైపు నడిచాడు దుర్యోధన్. అందరూ అతన్ని అనుసరించారు.

గెస్టు హవుస్ కిరుపక్కలా ఏపుగా ఎదిగిన క్రోటన్స్ మొక్కల గుబురుంది. "అర్జున్! నువ్వు ఇన్ స్పెక్టర్ వెంట ఆ పక్క పొదల్లో వుండు. నిర్మలగారూ, నేనూ ఈ పక్క నిల్చుంటాం! మీ చేతుల్లో పిస్తోళ్ళూ, టార్చి లైట్లూ రెడీగా వుండాలి. అవసరం వచ్చినప్పుడు నేను ముందు వెలిగిస్తాను టార్చి" అన్నాడు దుర్యోధన్.

అర్జున్ ఇన్ స్పెక్టర్ వెంట అవతలిపక్కకు నడిచాడు. వారి ఓపికను పరీక్షిస్తూ పన్నెండుగంటలవరకూ ఎక్కడా, ఏ అలికిడీ అనిపించలేదు. పన్నెండున్నర దాటుతుండగా దూరాన ఎవ్వరో నడిచివస్తున్నట్టు ఎండుటాకులకరకరశబ్దం వినిపించసాగింది.

నలుగురూ ఊపిరి బిగబట్టి యెదురుచూడసాగారు. మసకచీకట్లో రెండు ఆకారాలు మూసివున్న గెస్టుహవుస్ తలుపుని సమీపించాయి. ఓ ఆకారం వంగి, తలుపు తాళాన్ని పట్టుకుని పరీక్షించసాగింది. మరో ఆకారం చేతిలోని పెన్సిల్ టార్చి వెలిగింది.

మొదటి ఆకారం జేబులోంచి ఏదో తీసి, తాళం తెరిచే ప్రయత్నంలో నిమగ్నమైంది. అరగంట తరవాత క్లిక్ మంది తాళం! జాగ్రత్తకోసం అటూ, ఇటూ చూసి, తలుపు తోసి లోనికి ప్రవేశించాయి రెండు ఆకారాలు.

"ఇన్ స్పెక్టర్, హరియప్!" అంటూ టార్చి వెలిగించి అటు పరుగెత్తాడు దుర్యోధన్.

రెండు ఆకారాలూ అదిరిపడి వెనుదిరిగాయి.

టార్చి వెలుగులో వాళ్ళని చూసి, "సంధ్యా, హను మంతరావ్ మీరా!" అంది నిర్మల నోరు తెరుస్తూ.

హనుమంతరావు చటుక్కున జేబులోకి చెయ్యి పోనివ్వబోయాడు.

"పిచ్చివేషాలు వేశావంటే కుక్క చావు చస్తావ్! చేతులెత్తి నిల్చో. సంధ్యా! నీ లేడీస్ రివాల్వర్ మర్యాదగా కిందపడెయ్! ఎంత ప్రయత్నించినా మీరిక తప్పించుకోవడం కల్ల. పోలీసులు ఈ ఇంటిని చుట్టుముట్టేశారు" అన్నాడు దుర్యోధన్.

అంతలో అర్జున్, ఇన్‌స్పెక్టర్ యుగంధరరెడ్డి, స్థానిక ఎస్.ఐ. అతని సిబ్బందీ పరుగెత్తుకొచ్చారక్కడికి.

"ఎవరితను?" అడిగాడు అర్జున్, సంధ్య సహచరుణ్ని చూస్తూ.

"సరస్వతీదేవి దగ్గర బంధువు. డాక్టర్ నిర్మలను బెదిరిస్తూ ఉత్తరాలు రాసిన హనుమంతరావు ఇతనే! అంతేకాదు, లాయర్ జయరాంను చంపింది కూడా ఇతనే! ఏ బంగారం కోసమైతే ప్రభుత్వమూ, వీళ్లూ ఇన్నాళ్ళు తంటాలు పడ్డారో, ఆ బంగారం ఎక్కడ దాచబడిందో ఇప్పుడు చూపిస్తాను రండి మీకు" అంటూ అందర్నీ లోపలి గదిలోకి తీసికెళ్ళాడు ఇన్‌స్పెక్టర్.

లాయర్ జయరాం చంపబడింది ఆ గదిలోనే!

దుర్యోధన్ నలుగురు కానిస్టేబుళ్ళను టేబిల్ కింద నేలమీద పర్చివున్న ఉక్కు షీట్ ఎత్తమని పురమాయించాడు. వాళ్ళు ఆ షీట్ ఎత్తగానే లోపల కనిపించిన వాటర్ పంప్ చూసి అందరూ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు.

దుర్యోధన్ అదివరకే టేబిల్ మీద రెడీగా వుంచిన స్పేనర్లందుకుని, వాటిలో వాటర్ పంప్ అతుక్క

బిగించి వున్న బోల్టులు విప్పసాగాడు. తుప్పుపట్టిన ఆ బోల్టులు వూడదీసేసరికి గంటపట్టింది. "ఇప్పుడు పంపు ఎత్తి పైన పెట్టండి" అన్నాడు కానిస్టేబుళ్ళతో.

నలుగురూ కలసి, అతి కష్టంమీద పంపు ఎత్తి నేల మీద పెట్టగానే, అందరూ ఆతృతగా లోనికి తొంగి చూశారు. పంపు కింద భాగంలో నీళ్ళులేని పెద్ద హౌస్ వుంది. అందులోనే ఇంచుమించు అదే సైజు తుప్పుపట్టిన ఉక్కు పెట్టె వుంది.

దుర్యోధన్ లోనికి దిగి, దాని కొక్కెం అందుకుని, పెట్టెమూత పైకిలేపాడు. అంతే! పెట్టెలో కనిపించిన దృశ్యం చూసి అందరి గుండెలు ఝల్లుమన్నాయి.

పెట్టె పైభాగాన, కాలి ఎముకలూ, చేతి ఎముకలూ మడిచి వున్న అస్థిపంజరం పళ్ళికిలిస్తూ ఒళ్ళు జలదరింప చేస్తోంది. పుర్రె వెనక భాగం బాగా చితికివుంది. కళ్ళ గుంటల్లో వున్న ఒకేఒక కనుగుడ్డు అందర్నీ చూస్తోంది తీక్షణంగా!

"దుర్యోధన్ గారూ! ఏమిటీ విచిత్రం! అస్థిపంజరానికి కనుగుడ్డు వుండటం ఏమిటి?" అంది నిర్మల ఆశ్చర్యంగా.

"అది నిజమైన కన్నుకాదు. గాజు కన్ను! ఇంకా అర్థంకాలా? వీరప్పన్ అస్థిపంజరం అది! దోపిడీ జరిగాక, గజేంద్రన్ తన సహచరుణ్ని అంటే వీరప్పన్ని తల పగలగొట్టి చంపేసి, శవాన్ని బంగారం వున్న పెట్టెలో పడేసి ఇక్కడ దాచేశాడు.

ఆ విధంగా బంగారంలో భాగస్వామి అడ్డు తొల గడమేగాక, ఖర్మగాలి ఎవరైనా ఈ ప్రదేశాన్ని పసి గట్టో, లేదా పైన అమర్చి వున్న వాటర్ పంప్ తొల

గించో ఈ పెట్టెను చూసి తెరిస్తే దళ్ళిపోయిన వీరప్పన్ శవం, లేదా అస్థిపంజరం కనిపించి హడలి చావాలని వాడి ఎత్తు!

ఐతే, వాడి ఎత్తులన్నీ చివరికి సంధ్య చేతిలో చిత్తుగాక తప్పలేదు. ఆమె వాడి కూతురు కాదు! హనుమంతరావు ప్రియురాలు! గజేంద్రన్‌కు జైల్లోంచి విడుదల అవగానే హనుమంతరావు ఆమె వాడి కూతురిగా తీర్చి దిద్ది విశాఖపట్నం తీసికెళ్ళాడు.

అక్కడ ఈమెగారు గజేంద్రన్ని హోటల్లో కలుసు కుంటూ తానతని కూతుర్నని ఎలాగో నమ్మించింది. ఇరవై ఏళ్ళు కన్నకూతురికోసం తపించిన గజేంద్రన్ తాత్కా లికంగా ఆమె మాయలో పడిపోయాడు.

వీళ్ళతన్ని పోలీసుల నిఘానించి తప్పించి, ఇక్కడికి తెచ్చి గుహలో దాచి బంగారం ఎక్కడుందో చెప్పమని ఒత్తిడి చేసుంటారు. దాంతో, గజేంద్రన్‌కు ఈమె తన కూతురు కాదేమో అన్న అనుమానం కలిగింది. ఆ రహ స్యం చెప్పకుండా దాటవెయ్యడం ప్రారంభించాడు.

ఇంతలో డాక్టర్ నిర్మల పేర సరస్వతీదేవి ఆ స్తంతా రాసి మరణించడంతో హనుమంతరావు లాయర్ జయ రాంను ఆస్తి ఆమెకు చెందకుండా ఎత్తులువేసి, తనతో సహకరించమని అడిగి వుంటాడు. న్యాయానికి కట్టుబడ్డ జయరాం అందుకు నిరాకరించడంతో నిర్మల రాకకోసం ఎదురుచూస్తూ గెస్టుహౌస్‌లో కూర్చున్న అతన్ని కత్తితో హత్యచేసి, ఆస్తి దక్కకున్నా కనీసం ఆ బంగారా న్నైనా దక్కించుకుందామని ఆశించాడు హనుమంత రావ్.

అనుమానంవల్ల ఇటు గజేంద్రన్ బంగారం గురించి చెప్పకపోవడంతో ఇక లాభం లేదని అతన్ని గుహలో బంధించి, హింసించడం ప్రారంభించారు. సంధ్య ఆర్కియాలజిస్టు అవతారం ఎత్తి హోటల్లో బసచేసి, ఊరి పరిస్థితులు గమనిస్తూ రాత్రిపూట గుహలదగ్గరికెళ్ళి, ప్రియుణ్ణి కలుసుకుంటూ గజేంద్రన్ దానికి వచ్చాడో లేదో తెలుసుకోసాగింది.

హనుమంతరావు అదివరకే టౌన్ హాలుమీద గాలి కోడిని రాయితో కొట్టి ఊరివాళ్ళను తప్పుదారి పట్టించాడు. అంతేకాదు, తొలిరోజు చీకట్లో అర్జున్ని రాయితో కొట్టిందీ, సార్జంట్ విశ్వాన్ని గాయపర్చిందీ కూడా అతనే!

గుహలో హనుమంతరావ్ చిత్రహింసలు తాళలేక గజేంద్రన్ మరణించాడు.

అదే రాత్రి నేనూ, ఇన్స్పెక్టర్ గుహలు గాలించడానికెళ్ళాం! గజేంద్రన్ శవాన్ని కనుగొన్న తరవాత అక్కడే వున్న హనుమంతరావు మానించి తప్పించుకుని పారిపోయాడు. దాంతో నాకో పథకం స్ఫురించింది.

సరిగ్గా ఈ ప్రదేశానికి చేరేటట్టు చిహ్నాలు సూచిస్తూ ఓ దొంగ మ్యాపు తయారుచేశాను. దాన్ని తీసికెళ్ళి సంధ్యకు చూపి, అది విశాఖ జైల్లో గజేంద్రన్ బంధింపబడ్డ గదిలో పోలీసులకు దొరికిందని ఓ కట్టుకథ చెప్పి, స్టడీ చెయ్యమని ఇచ్చివచ్చాను.

ఆమె దాన్ని సులభంగా అర్థంచేసుకుని, హనుమంతరావుతో ఇక్కడికి వస్తుందని అంచనా వేసి, స్థానిక పోలీసులతో ఇక్కడ మాటువేశాను. నా అంచనా

తప్పలేదు. తోడు దొంగలు దొరికిపోయారు. ప్రభుత్వం బంగారం కూడా సురక్షితంగా తిరిగి చేజిక్కింది.

నిర్మలగారూ! ఇక మీరు నిశ్చింతగా ఇక్కడ స్థిరపడి, సరస్వతీదేవిగారి అభీష్టం ప్రకారం పేదలకూ, దీనులకూ సేవచేస్తూ మీ జన్మను సార్థకం చేసుకోండి!" అంటూ ముగించాడు డిటెక్టివ్ దుర్యోధన్.

—: అయిపోయింది: —

# బందిపోటు నాయకుడు

## బొమ్మిడి అచ్చారావు

"గజేందర్ చివరిసారిగా చెపుతున్నాను. నీ ముఠాతో వెంటనే లొంగిపో! మొండితనం చూపిస్తే నిన్ను, నీ ముఠాని నిర్దాక్షిణ్యంగా కాల్చెయ్యాల్సి వస్తుంది" ఇన్స్పెక్టర్ శ్రీనివాస్ మెగామైక్‌లో అరిచి చెప్తున్నాడు.

సిటీ లిమిట్సుకి రెండు కిలోమీటర్ల దూరంలో విసిరేసినట్టుందా కొండ. దానిచుట్టూ పోలీసులు చుట్టుముట్టేశారు.

కొండపైన దాదాపు ఏభైమంది సాయుధులైన అనుచరులతో నిలబడి వున్నాడు గజదొంగ గజేందర్. ఆరడుగులపైనే పొడవనిపించే విగ్రహం. పెద్ద పెద్ద బుర్ర మీసాలు, రక్తం చిందుతున్న కళ్ళు, విగ్గు పెట్టుకున్నట్టున్న దుబ్బులాంటి జుట్టు చూపరులకు అతని కర్కశమైన ముఖంలో కనిపించే అంశాలు. నడుముచుట్టూ బుల్లెట్సున్న బెల్ట్సును అమర్చుకున్నాడు, అలంకరణాలు చేసుకున్నట్టు.

"నువ్వు, నీ పోలీసులు నన్నేం చేయలేరు. నీ బల గంతో మర్యాదగా వెనక్కి వెళ్ళిపో! లేకుంటే నా అనుచరులు తుపాకుల్లోంచి తూటాలు వర్షంలా కురిసి నీ పోలీసుల నెత్తురాన్ని రుచి చూస్తాయి" పెద్ద స్వరంతో హిందీలో అరిచి చెప్పాడు గజేందర్.

శ్రీనివాస్ తన ప్రయత్నం మానలేదు. ఇంకా అతనికి నచ్చ చెప్పాలనే ప్రయత్నిస్తున్నాడు. "నీకు శిక్ష తక్కువపడేలా చూస్తాను. సరెండరయితే! నీ అనుచరులకు కూడా తక్కువ శిక్ష పడేలానే రికమెండ్ చేస్తాను."

"నీ బోడి రికమెండేషన్ ఎవడిక్కావాలి? అసలు యిక్కడినుంచి ప్రాణాలతో బయటపడటానికి ప్రయత్నించు ముందు. అనవసరంగా నా ఏరియాలో అడుగు పెట్టి నీ ప్రాణంమీదికి తెచ్చుకున్నావు. క్విట్ అవే!" అరిచాడు గజేందర్.

శ్రీనివాస్ కోపంగా అరిచి చెప్పాడు. "ప్రభుత్వాన్ని అల్లకల్లోలం చెయ్యాలని నువ్వు చేస్తూన్న ప్రయత్నాలన్నీ ప్రభుత్వం దృష్టికి వచ్చాయి. నిన్ను పట్టుకోలేనంత అసమర్థులం కాము మేము...."

శ్రీనివాస్ యింకా ఏదో చెప్తూండగానే శ్రీనివాస్ పక్కనున్న కానిస్టేబిలు "అబ్బా!" అంటూ నేల కూలాడు

గజేందర్ వికటాట్టహాసం చేశాడు.

"ఇది శాంపిల్ మాత్రమే! అసలు అది నీకు గురిచేసిన గుండు. దయతలచి వదిలేశాను. నీ అసమర్థులైన బల గంతో వెంటనే యిక్కడ్నించి వెళ్ళిపో! ఇంకా మొండి కేశావంటే నీ ప్రాణం నిలువునా తీసేస్తాను. బీ కేర్ ఫుల్!" అన్నాడు గజేందర్.

శ్రీనివాస్ రక్తం సలసల మరిగింది.

సాయుధులైన తన సిబ్బందివైపు చూసి "ఫైర్!" అన్నాడు.

అంతే—పోలీసుల చేతుల్లోని గన్స్ గుళ్ళ వర్షాన్ని కురిపించాయి. కాని గజేందర్ అనుచరులు అంతకన్న వేగంగా గుళ్ళు పిడుగుల్లా కురిపించారు.

టకటకమంటూ పదిమంది పోలీస్ కాన్‌స్టేబుల్స్ నేల కరిచారు. గజేందర్ మనిషి ఒక్కడూ చావలేదు. ఇద్దరు ముగ్గురు గాయాలతో తప్పించుకున్నారు.

పోలీసుల సంఖ్య గజేందర్ మనుషులకు నాలుగు రెట్లుంది. కాని గజేందర్ మనుషులు చాలా చాకచక్యంతో గుళ్ళబారినుంచి తప్పించుకుని పోలీసులపై ఎదురు కాల్పులు జరుపుతూనే కొండ అవతలపక్కకు చకచక దూకేశారు.

గజేందర్ ఒక్కడూ కొండ శిఖరాన మధ్యాహ్నపు సూర్యుడిలా మండిపడుతున్నట్టు కనిపించాడు.

"మెడియర్ పోలీస్‌వాలా! నేను ముందే చెప్పాను కదా, నీ మనుషుల ప్రయోజకత్వం గురించి. ఇంకెప్పుడూ నన్ను పట్టుకోవాలనే వ్యర్థప్రయత్నం చెయ్యకు" అంటూ కొండ అవతలపక్కకు ఉరికేశాడు.

దూరంగా గుర్రాల సకిలింపు స్వరాలు వినిపించాయి.

## 2

"ప్రస్తుతం నగరంలో జరుగుతున్న సంఘటనలు నీకు తెలుసుకదా! వీటన్నిటికీ వెనక ఓ కబంధ హస్తముంది. ఆ కబంధ హస్తం తాలూకు కాలీ పేరు గజేందర్...." ఓ క్షణం ఆగాడు ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్.

డిటెక్టివ్ కిరణ్ ఆసక్తికరంగా వింటున్నాడు.

శ్రీనివాస్ కొనసాగించాడు. "ఈ ఎక్సేండర్ అసలు పేరు యింకా ఏదో వుండచ్చు. కాని ప్రస్తుతం యీ నగరంలోని పేరు ఎక్సేండర్. గతంలో బొంబాయిలో చిమన్‌లాల్ పేరుతో ఓ వెలుగు వెలిగాడు. బొంబాయి పోలీసులు అరెస్టుచేసి లాకప్‌లో పెట్టిన గంటలో జైలునుండి తప్పించుకున్నాడు.

కలకత్తాలో ఛటర్జీ పేరుతో కొన్నాళ్ళు పెద్ద మనిషిగా చలామణీ అయ్యాడు. తర్వాత అతని గురించిన నిజం వెలుగులోకి రాగానే అక్కడినుంచి మకాం మార్చేశాడు. కొన్నాళ్ళు అజ్ఞాతంగా గడిపాడు. కాని మధ్యప్రదేశ్‌లోను, మహారాష్ట్రలోను కొన్ని అంతర్యుద్ధాలను పరీక్షంగా యీ ఎక్సేండర్ కారకుడని నిరూపించే సంఘటనలు కొన్ని జరిగాయి. ఇప్పుడు యీ నగరంలో ఎక్సేండర్‌గా మళ్ళీ అవతారమెత్తాడు" అన్నాడు.

"మరి యితన్ని పట్టుకునే ప్రయత్నం ఏ ప్రభుత్వమూ చెయ్యలేదా?" కిరణ్ అడిగాడు.

"చేస్తూనే వున్నారు. కాని అతని స్థావరం ఎక్కడో, ఎప్పుడు ఎక్కడ ఎలా ప్రత్యక్షమవుతాడో ఏ పట్టణాన్ని కొల్లగొడతాడో, ఏ బ్యాంక్ లూటీచేస్తాడో ఎవరూ ఊహించలేరు. ఎక్సేండర్‌కి అతనితో సమాన ఫాయిల్ వున్న మరికొందరు కుడి భుజాల్లాంటి అనుచరులున్నారు. అంచేత తను ఆ స్పాట్‌లో లేకపోయినా ఒకేసారి నాలుగుచోట్ల ఒకే సమయంలో దోపిడీలు విజయవంతంగా నిర్వహిస్తాడు. ఇప్పటికి దోపిడీలవల్ల అతను ఆర్జించినది కొన్ని కోట్లుండవచ్చునని అంచనా."

"ఇక్కడ దోపిడీలు ఎప్పుడు మొదలెట్టాడు?"

"దాదాపు నాలుగు నెలలుగా నగరంలో ప్రతిరోజు ఒక దోపిడీ జరుగుతూనే వుంది. ముఖ్యంగా నగరం శివార్లలోను, జనావాస ప్రాంతాలు చెదురుమదురుగా వున్నచోట, యిళ్ళు నిసిరేసినట్టున్న ప్రాంతాల్లోను దోపిడీలు ఎక్కువగా జరుగుతున్నాయి."

"ఇప్పటివరకూ యెవరూ దొరకలేదనుకుంటాను, అవునా?"

"అవును. నగరంలోని ప్రజాజీవితం ఆందోళనకరంగా తయారయింది. ప్రజలు భయభ్రాంతులవుతున్నారు. ప్రభుత్వాన్ని దుయ్యబడుతున్నారు. మా పోలీసు డిపార్టుమెంటు అసమర్థతని ఎత్తిచూపుతున్నారు. ప్రతి కాలనీలోను ప్రజలే బాధ్యతతీసుకుని రాత్రిళ్ళు పెట్రోలింగ్ డ్యూటీ చేస్తున్నారు."

"మరి నిన్నటి పేపర్లో పోలీసులు ఆ ముఠాని పట్టుకోవటానికి కాల్పులు జరిపారని, కాని వాళ్ళు తెలివిగా తప్పించుకు పారిపోయారని త్వరలోనే ప్రభుత్వం వారిని బంధించటానికి ప్రయత్నిస్తుందనీ వార్తలు వచ్చాయి. వాళ్ళ స్థావరం తెలిశాక బంధించటానికి సమస్యేముంది?"

"వాళ్ళు ఆ స్థావరం ఖాళీచేసేశారు. మొన్న నేనే కొంతమంది సిబ్బందిలో పెన్ పహాడ్ అనబడే నగర శివార్లలో వున్న కొండమీద అనుమానంతో దాడిచేశాను. నా అనుమానం నిజమే అయింది. ఈ కల్లోలాలకు కారకుడయిన X జేందర్ తో ముఖాముఖి తలపడ్డాను కూడా. కానీ నా అనుమానం అసలు నాయకుడు X జేందర్ ● మనిషి కాకపోవచ్చునని! అయినా X జేందర్ గా వ్యవహరింపబడుతున్న వ్యక్తి మా సిబ్బందిలో నలుగుర్ని

చంపి, పదకొండుమందిని గాయపరిచి, గుత్తాలమీద పరారీ అయ్యాడు తన అనుచరులతో. చేతికి అందినట్టే అంది తప్పించుకున్నాడు. అయామ్ రియల్లీ సారీ ఫరిట్! ఈసారి యెదురుపడితే తాడో పేడో తేల్చకుండా వదలను."

"ఓ.కే. డన్! ఇందులో నేను ఏ విధంగా సహాయ పడగలను నీకు?"

"నీ మేధాసంపత్తితో ఆ గజేందర్ స్థావరం ఎక్కడో ఆరాతీసి తెలుసుకోవాలి. నేనుగాని, పోలీసు డిపార్టు మెంటులో మరెవరైనాగాని యిందుకు పూనుకుంటే ఎఫీషియల్గా వున్నా, మారువేషాల్లో వెళ్ళినా వాళ్ళు చాలా తేలిగ్గా గుర్తుపట్టేస్తారు. అదే ప్రయివేటు వ్యక్తులైన నువ్వయితే ఎవరికీ తెలిసే అవకాశం లేదు. ఆ దుండగులు చూపులన్నీ ఎప్పుడూ మా పోలీసువాళ్ళమీదే వుంటాయి. అందుకు తగ్గట్టే మేము వాళ్ళని మా వైపు దృష్టి మరల్చేసు కుంటాం. ఈ లోపల నువ్వు వాళ్ళ ఉనికి కనుక్కొని మాకు యిన్ఫర్మ్ చేశావంటే మెరుపు దాడిచేసి వాళ్ళని పట్టేద్దాం!"

కిరణ్ రెండు నిమిషాలు ఏదో ఆలోచిస్తూ వుండి పోయాడు.

శ్రీనివాస్ మళ్ళీ అన్నాడు. "నువ్వొక్కడివే ఇందుకు సమర్థుడవని నాకు పూర్తి నమ్మకముంది. నువ్వు ఎస్ అన్నాక పోలీసు హైకమాండ్ సమావేశంలో నిన్ను ప్రపోజ్ చేస్తాను. సమావేశం కూడా చాలా రహస్యంగా జరుగుతుంది. నువ్వు రంగంలోకి దిగుతున్న విషయం పోలీసు అత్యున్నతాధికారులకి, డి.జి.పి. కి తప్ప క్రింది లెవెల్ అధికారులకి తెలియకూడదు. అంతా చాలా

పకడ్బందీగా జరగాలి!"

కిరణ్ సాలోచనగా చూశాడతనివంక.

"ఈ దోపిడీదార్లు యింటిలో నివసిస్తున్నవాళ్ళనుండి ఆస్తులు దోచుకోవటమేకాక గాయపరచటం, కొన్ని సార్లు నిర్దాక్షిణ్యంగా హత్య చెయ్యటం కూడా చేస్తున్నారు. నగరంలోని యీ హింసాత్మక కాండలకు అదనంగా మరికొన్ని అవాంఛనీయ సంఘటనలు కూడా జరగావటంతో ప్రజా జీవితం అల్లకల్లోలం కావటం, ఒక్కోసారి స్తంభించి పోవటం కూడా జరుగుతోంది. ఇన్ని కొంతమంది స్వార్థపరులు రంగుపూసి గోరంతలు కొండంతలుగా చేసి, రాజకీయాలతో ముడి పెడుతున్నారు. ప్రశాంతంగా సమర్థవంతంగా ప్రగతి పథంవైపు సాగిపోతున్న మన దేశాభ్యున్నతని వక్రంగా చిత్రిస్తున్నారు. దీన్నింకా యిలాగే కొనసాగనివ్వకూడదు. అందుకే మా డిపార్టుమెంటు ఈ కల్లోలాలకు, దుండగాలకు వీలైనంత తొందరగా పరిష్కారం ప్రారంభించాలని ఆత్రపడుతున్నది. ఈ మహా యజ్ఞంలో నీ పాత్ర చాలా కీలకమైనది."

"X జేండర్ గురించిన వివరాలు చెప్పు" అన్నాడు కిరణ్.

"మొన్నటి దాడిలో X జేండర్ అనబడే ఆ దోపిడీదారుడి ఫోటోలు కొన్ని మా ఫోటోగ్రాఫరు చాకచక్యంగా వేన్‌లోనుంచి తీశాడు. అయితే బాగా దూరంగా వుండటంవల్ల లాంగ్ షాట్‌లో ఫోటోలు క్లియర్‌గా రాలేదు. అయినా వాడి రూపురేఖలు కొంచెం కనిపిస్తున్నాయి. వాడి అనుచరులు కూడా సగానికి పైగానే ఈ ఫోటోల్లో కవరయ్యారు. ఇకపోతే తక్కిన

వివరాలు యివి" అంటూ చెప్పసాగాడు శ్రీనివాస్.

కిరణ్ శ్రద్ధగా వింటూ అవసరమైన పాయింట్సు పాకెట్ డైరీలో నోట్ చేసుకున్నాడు.

"నువ్వీ మహత్తరమైన ప్రమాదకరమైన టాస్కు భుజంమీద వేసుకుంటున్నందుకు చాలా సంతోషం. ఇప్పుడే డి.జి.పి.తోను, పోలీసు ఉన్నతాధికారులతోను స్వయంగా కలిసి నీ విషయం చెపుతాను. థాంక్యూ వెరీమచ్!" అన్నాడు శ్రీనివాస్ కిరణ్ చెయ్యి నొక్కి వదిలి.

"ఇది నా బాధ్యత. ఇది మన రాష్ట్రానికే కాదు, యావద్భారత దేశానికీ సంబంధించిన సమస్య! ఈ మహా యజ్ఞంలో నేనొక సమిధనై కాలిపోవలని వచ్చినా వెనుతియ్యను" అన్నాడు డిటెక్టివ్ ఉద్వేగపూరితంగా

## 3

"హేండ్సప్! ఎవరూ కదలొద్దు" చేతిలోని గన్ మేనేజర్‌కి గురుచేసి అన్నాడు గజదొంగ గజేందర్.

అతని వెంట అనుచరులు గన్స్‌తో కాషియర్‌ని, కాష్ కౌంటర్స్‌లో వున్న గుమాస్తాలను కవర్ చేస్తున్నారు.

"ఎవరూ కదలకుండా అలాగే నిల్చోండి. కౌంటర్సు లోని కేష్ యీ బేగ్‌లో వెయ్యండి" ఓ అనుచరుడు పెద్ద గోతాం తీసుకుని కౌంటర్సు దగ్గర ఆగి ఆ గుమస్తా నోట్లకట్టలు గోతాంలో వేశాక మరో కౌంటర్ దగ్గరకు కదులుతున్నాడు.

పది నిమిషాల్లో పని పూర్తయిపోయింది. మేనేజర్ ఫోన్‌వైపు చెయ్యి చాచాడు. సర్రుమంటూ ఫోన్ పక్క

నుంచి దూసుకుపోయింది గజేందర్ షూట్ చేసిన బుల్లెట్.

మేనేజర్ చటుక్కున చేతిని వెనక్కి తీసుకున్నాడు.

"అతి తెలివికిపోతే ప్రాణాలు పోతాయి జాగ్రత్త!" అన్నాడు గజేందర్ కఠినంగా.

ఎవరూ సాహసించలేకు.

గన్ చూపిస్తూనే గజేందర్, అతని అనుచరులు మెల్లగా ద్వారంవరకు వెళ్ళిపోయారు.

మేనేజర్ మరోసారి కదలబోయి, మళ్ళీ ఎందుకని వూరుకున్నాడు.

గజేందర్ అతని అనుచరులతో బయట సిద్ధంగా వున్న స్టాండర్డు వేన్ ఎక్కేశాడు. వెంటనే వేన్ కదిలింది. అంతా క్షణాల్లో జరిగిపోయింది.

మర్నాడు పెద్ద పెద్ద అక్షరాల్లో అన్ని పేపర్లు బ్యాంకి దోపిడీ గురించి ప్రకటించాయి. గజదొంగ గజేందర్ రూపురేఖల్ని వర్ణిస్తూ అతను బ్యాంకిని దోపిడీ చేసిన విధానం గురించి కథలాగా వర్ణిస్తూ రాశాయి కొన్ని పత్రికలు! ప్రజల్లోను, బ్యాంకి ఉద్యోగుల్లోను చెప్పలేని అలజడి. బ్యాంకుల్లో దాచుకోవటంకూడా సేఫ్టీ కాదేమో నన్న నిర్ణయానికి ప్రజలు రావటానికి యింకా ఎన్నో రోజులు పైంలేదు!

## 4

"డ్రైవర్, బస్ ఆపు!" గజేందర్ రివాల్వర్ మొన, ఆ డ్రైవర్ కణతకి ఆనించాడు.

అది హైదరాబాదునుండి రాజంపేట వయా బద్వేల్ పోయే బస్సు. హైదరాబాదునుంచి సాయంత్రం ఆరు గంటలకు బయలుదేరింది. గిద్దలూరు ఫారెస్టు ఏరియాకి వచ్చేసరికి రాత్రి రెండుగంటలయింది.

నంద్యాలకు గిద్దలూరుకు మధ్యవున్న చిట్టడివి దగ్గరకు బస్ రాగానే అంతదాకా పాసింజర్సులాగా బస్‌లోనే ప్రయాణం చేస్తున్న గజేందర్, అతని అనుచరులు సమయం చూసి చటుక్కున ఆయుధాలు బయటికి తీశారు.

డ్రైవరు మారు మాట్లాడకుండా గజేందర్ చెప్పినట్టే బస్‌ను పక్కకు తీసి నిలబెట్టాడు. గజేందర్, తన అనుచరులకి సైగ చేశాడు. వాళ్ళు ప్రతి సీటు దగ్గరా ఆగి ప్రయాణీకుల్ని నిలువు దోపిడీ చేస్తున్నారు.

మనీపర్సులు, బంగారు గొలుసులు, వాచీలు, ఉంగరాలు—అన్నీ సంచీ నిండిపోతున్నాయి.

"ఎవరివీ మంగళ సూత్రాలు తీసుకోవద్దు!" హెచ్చరించాడు గజేందర్. ఆడవాళ్ళు అతనివంక కృతజ్ఞతగా చూశారు—వస్తువులు పోయిన పవిత్రమయిన పుస్తెలు తీసుకోనందుకు.

అందర్నీ దోచుకోవటం అయ్యాక కండక్టరుని సమీపించారు, అనుచరులు. అతను గజగజ వణుకుతున్నాడు.

కండక్టరు అడక్కుండానే కేష్ బాగ్ అందించబోయాడు.

"అందులో ఎంతుంది?" అడిగాడు గజేందర్.

"దాదాపు పధ్నాలుగువందలు" అన్నాడతను.

"అవి వుంచుకో. లేకుంటే నీ ఉద్యోగం పోతుంది. కాసేపట్లో ఎటూ తెల్లవారుతుంది. వీళ్ళందరికీ గిద్దలూరులో కాఫీలు టిఫిన్లు పెట్టించు. వాళ్ళ వాళ్ళ వూళ్ళు జాగ్రత్తగా చేర్పించు" అన్నాడు గజేందర్.

కండక్టరు, డ్రైవరు కూడా తలలూపారు.

గజేందర్ అనుచరులతోను, దోచుకున్న సొమ్ముతోను చీకట్లో కలిసి మాయమయ్యాడు.

ప్రయాణీకుల్లో అప్పుడు చలనం కలిగింది.

"వీడెవడో వింత దొంగలా వున్నాడే! ఆడవాళ్ళ మంగళ సూత్రాలు వదిలేశాడు—కండక్టరు కేష్ ముట్టుకోలేదు. పైగా మనకి కాఫీలు టిఫెన్లు యిప్పించమన్నాడు. భలే సెంటిమెంటల్ దొంగలా వున్నాడు" అన్నాడో ప్రయాణీకుడు.

"డబ్బు పోయినా ఎవరికీ హాని కలిగించలేదు. కనీసం గాయపరచకుండా వదిలేశాడు. అంతేచాలు! డబ్బూ పోయి కనిపట్టేనన్నట్టు ఒక్కోసారి డబ్బు పోగొట్టుకుంటాం, ప్రాణాలు పోగొట్టుకుంటాం. ఈసారి అందరం అదృష్టవంతులమే!"

"రోజురోజుకీ ఈ దారిదోపిడీలు పెరిగిపోతున్నాయి. వీటినదుపులో పెట్టే నాధుడే కనిపించటంలేదు. పోలీసు డిపార్టుమెంటేం చేస్తోందో?"

డిపార్టుమెంటులో నిజాయితీ, చిత్తశుద్ధి లోపించాయండి. చాలామంది పోలీసులకి యీ దెకాయిట్స్ గురించి, యిళ్ళలో దూరే దెకాయిట్స్ గురించీ వివరాలు తెలుసు. వాళ్ళెక్కడివాళ్ళో ఏ రాష్ట్రంవాళ్ళో, ఎల్గా వుంటారో కూడా తెలుసు! అయినా పట్టుకోవటం లేదంటే...."

"పోలీసు డిపార్టుమెంటులో అందరూ అలాంటివాళ్ళే నంటే నేనొప్పుకోను. ధైర్యసాహసాలు ప్రదర్శించి దొంగల్ని పట్టుకున్నాడు మొన్నో పోలీసు. ఇదిగో యీ రూట్లో నేననుకుంటాను. పేపర్లో వచ్చింది, చూళ్ళేదా?"

"కరెక్టే! ఎవరో నూటికో కోటికో ఒకడు నిజాయితీ పరుడు, నిస్వార్థపరుడు వుంటే సరిపోతుందా? ప్రతి ఒక్కడిలోను ఆ సేవాతత్పరత వుండాలి. అప్పుడే

ప్రజలు కూడా వాళ్ళని తమ ఆత్మీయులుగా గుర్తిస్తారు. అంతేగాని, మేము మీ స్నేహితులం. ఆపదలో ఆప్తులం. అని బోర్డులు కట్టుకోవటంవల్ల లాభంలేదంటాను."

"పోలీసు డిపార్టుమెంటుకి ప్రజలు కూడా స్వచ్ఛందగా తమ సేవలు అందచెయ్యాలి. అవినీతికి పాల్పడిన పోలీసు ఉద్యోగి ఎవరైనా తటస్థపడినప్పుడు పై అధికారుల దృష్టికి తేవాలి! అప్పుడు సమస్యలు వాటంతటవే పరిష్కారమవుతాయి."

ఇలా తలోకరు తలో విధంగా వ్యాఖ్యానించుకుంటుండగా డ్రైవరు కండక్టర్‌తో తన ధర్మసందేహాన్ని వెలిబుచ్చాడు.

"అవును సైదులూ, నంద్యాల్లో ఎస్కార్టు ఎక్కేవాళ్ళు గందా, యియ్యాల ఎక్కలేదేం అళ్ళు?" అన్నాడు.

కండక్టరు కూడా తలూపి, "బస్సాపి పదిహేను నిమిషాలు చూశాం కూడా గందా! ఈ రోజు అళ్ళకి డూటీ ఎయ్యటం మర్చిపోయుంటారు డిపార్టుమెంటోళ్ళు. ఏది సరిగ్గా చేత్తారన్నా, అంతా మాయే గందా! మన సావుకొచ్చింది" అన్నాడు.

"సరే స్టార్టు జెయ్యనా?"

"పద, పోదాం. గిద్దలూరు స్టేషన్‌లో రిపోర్టు చేసుకోవాలి."

## 5

"బస్సు దోపిడీలో ఎవరెవరు ఎంత నష్టపోయిందీ వివరాలొచ్చాయనుకుంటాను?...." అన్నాడు కిరణ్.

"ఆఁ, ఆ! వాళ్ళు కొంచెం అతిశయోక్తులు చెప్పినట్టు కనిపిస్తోంది. వసూలయిన సొమ్ము చూడబోతే తక్కువగా

వుంది. బంగారు వస్తువులుమాత్రం కరెక్టుగానే చెప్పారు. ఒకరిద్దరు కావాలనే తక్కువ చెప్పినట్టు కనిపిస్తోంది. బహుశా ప్రభుత్వానికి భయపడి, లెక్కలు ఆరా తీస్తాయని అలా తక్కువగా చెప్పారేమో...."

"ఎవరు ఎంత చెప్పినా, ఎవరి దగ్గర ఎంత వసూలు చేశామో నాకు, మన పోలీసు సిబ్బందికీ కూడా తెలుసు. అంచేత వాళ్ళు తప్పుడు లెక్కలు చెప్పినా ఆదేం సాగదులే! వస్తువుల వివరాలు వాళ్ళు సంతృప్తికరంగా చెప్పగలిగినప్పుడే వాళ్ళకవి దక్కుతాయి" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ వస్తువులపట్టి తయారుచేస్తున్నాడు.

"ఇలా చెయ్యటంవల్ల ఆ గజేందర్ తన పనులు మానుకుంటాడంటావా?" అన్నాడు శ్రీనివాస్.

"మానతాడని కాదుగదా, నేనీ వేషం వేసింది గజేందర్‌కి తెలుస్తుంది—తన పేరు మీద మరో నకిలీ గజేందర్ దోపిడీలు సాగిస్తున్నట్టు! అప్పుడు వాడు నకిలీ గజేందర్ కోసం వేట మొదలెడతాడు. నేను మన పోలీసు సిబ్బందిలో ఓ రహస్య స్థావరం వున్నట్టు నాటక మాడతాను. వాడు నన్ను బెదిరించటానికో లేదా తన ముఠాలో కలుపుకోవటానికో ప్రయత్నిస్తాడు. అప్పుడు వాడి పుట్టు పూర్వోత్తరాలు నేను సేకరిస్తాను" అన్నాడు కిరణ్ నవ్వుతూ.

"అయితే మొన్న బ్యాంకు దోపిడీ గతరాత్రి బస్సు దోపిడీ జస్టు శాంపిల్స్ అన్నమాట!"

"అవును. ఇంకా మరికొన్ని శాంపిల్స్ కూడా రుచి చూపించాల్సి వుంటుంది ప్రజానీకానికి. న్యాయానికి, ఇది మంచి పద్ధతి కాదనుకో! ప్రజలని మరింత భయ

భ్రాంతుల్ని చేసి ప్రభుత్వాన్ని దుయ్యబట్టడానికి మరింత ప్రోద్బలం చేసినట్టవుతుంది. కాని వజ్రాన్ని వజ్రంతోనే కొయ్యాక తప్పదు. కొన్నాళ్ళపాటు ప్రజలకి యిలాంటి యిబ్బందులు కల్పించటం తప్పనిసరి! ప్రభుత్వం కూడా ఇందుకు అనుమతించిందికదా!"

"అవును. అయినా వీలయినంతవరకు ప్రజల విషయాల్లో చేయిపెట్టకపోవటమే మంచిదని నాకనిపిస్తోంది. ఈ ప్రయత్నంలో మనం విఫలమయితే జనం మనల్ని క్షమించరు."

డిటెక్టివ్ కిరణ్ నవ్వి, "ఇట్సాల్ రైట్.... మొన్న బ్యాంకి దోపిడీ ఎమవుంట్ బ్యాంక్ బాలెన్స్‌తో టాలీ అయిపోయింది కదా!"

"ఆఁ! ముందే బ్యాంకివాళ్ళకు చెప్పి వుంచాంకదా! ఎంత డబ్బు కౌంటర్స్‌లో డిస్ట్రిబ్యూట్ చేసినదీ మనకి వివరాలు ముందుగానే నోట్ చేసి యిచ్చారు. ఎకౌంట్ మేనేజర్‌కి క్యాషియర్‌కి స్వయంగా నేనే రిటర్న్ చేశాను. ఆ సమయంలో డి.జి.పి. ఎస్పీ. కమిషనర్ గారు కూడా పక్కనే వున్నారు. అయితే యిదంతా చాలా రహస్యంగా, పకడ్బందీగా చేశాం. అసలు గజేందర్‌కి ఏమాత్రం అనుమానం తగిలినా మన ప్లానంతా తలకిందు లవుతుందని నాకు తెల్సుకదా!"

"ఓ.కే! అవసరమైతే ఓ ఇంటిని దోపిడీ చెయ్యాల్సి వుంటుందేమో! అదేదో మీ యిల్లయితే సూటబుల్‌గా వుంటుంది. పోలీసు ఆఫీసరు యిల్లు కూడా డెకాయిట్స్ కబంధ హస్తాలనుంచి తప్పించుకోలేక పోయిందని అటు జనంలోను, ఇటు డెకాయిట్స్‌లోనూ మంచి పబ్లిసిటీ వస్తుంది."

"ఆల్ రైట్! మాదైతేనే నయం! మరో అమాయకుడ్ని అతని కుటుంబాన్ని టెన్షన్‌తోను, భయంతోను బాధపెట్టకుండా చెయ్యగలుగుతాం."

"ఈ రాత్రే! సిద్ధంగా వుండు" అన్నాడు కిరణ్ నవ్వి.

## 6

"ఎవరు నువ్వు?" హిందీలో కర్కశంగా వినిపించిన స్వరం దెస చూశాడు గజేందర్ వేషంలో వున్న డిటెక్టివ్ కిరణ్.

"మై డాకూ గజేందర్ హూఁ!" అన్నాడు కిరణ్.

పెన్‌పహాడ్ ప్రాంతం. చుట్టూ గాఢాంధకారం. అక్కడక్కడ చుక్కలు మినుకు మినుకుమంటున్నాయి ఆకాశంలో. ఆ గుడ్డి వెలుగ్లో, అప్పుడప్పుడు రోడ్న పోతున్న వాహనాల వెలుగ్లో చుట్టుపక్కల ఏమున్నదీ తెలుసుకునే వీలుంది, అంతే!

కిరణ్ కళ్ళు చీకటికి అలవాటుపడ్డాయి. ఎదురుగా నిలువెత్తు విగ్రహం గజేందర్‌ని గ్రహించటానికి అతనికెంతో సమయం పట్టలేదు. తనూహించినట్టే జరిగింది గజేందర్ తనతో ముఖాముఖీ వచ్చాడు. ఈ అవకాశాన్ని వినియోగించుకోవాలి!

"నహీం! తూ నకిలీ గజేందర్ హై" అంటూ అరిచాడు గజేందర్.

"నేను నకిలీ అయితే అసలు గజేందర్ నువ్వా?" హిందీలోనే రెట్టించి అడిగాడు కిరణ్. అతని చుట్టు బందిపోట్ల వేషాల్లో పోలీసులున్నారు. ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్ కూడా వస్తానన్నాడుగాని తనే వద్దన్నాడు. శ్రీనివాస్‌ని గజేందర్ గుర్తుపట్టేస్తాడు. ప్లాను తలకిందు

లవుతుంది.

గజేందర్ వెంటనే సమాధానం చెప్పలేదు.

తర్వాత మెల్లగా చెప్పేవాడు "అవును, నేనే గజేందర్. గజదొంగ గజేందర్, బందిపోటు గజేందర్, అందర్నీ గజగజలాడించే గజేందర్ నేనే! నా పేరు పెట్టుకుని నువ్వు బ్యాంకుల్ని, బస్సుల్ని, యిళ్ళను లూటీ చేస్తున్నావు. నేను నీ కోసమే కనిపెట్టుకుని వున్నాను. ఈ రాత్రి ఇన్‌స్పెక్టర్ యింట్లో దోపిడీ చేశావు. దొంగిలించిన సొమ్ముతో యిటు పరుగెత్తుకుని రావటం నా మనుషులు చూసి నాకు తెలియచేశారు. సిటీ నలుమూలలా నీకోసమని నా మనుషుల్ని కాపలా పెట్టాను. వాళ్ళు వేటకుక్కల్లా నీకోసం కాచుకుని వున్నారు.

"అసలు నా పేరుమీద నువ్వీ లూటీ యెందుకు చేస్తున్నావు? అవన్నీ నా పేరుమీద చేస్తే ప్రభుత్వం దృష్టి నామీదనే పోవాలనా? అంటే, నీ పేరు చెప్పుకుని చెయ్యటానికి భయపడుతున్నా వన్నమాట! ఇంత పిరికి వాడివి యింతటి పెద్ద పెద్ద లూటీలు ఎలా చెయ్యగలుగుతున్నావు?... అందుకే నిన్ను చూడాలని నీతో మాట్లాడాలని యెదురు చూస్తున్నాను. నీమీద నాకేం కోపం, అసూయ లేవు. నా శత్రువులు పోలీసులు. అలాంటి పోలీసు యిల్లే లూటీచేసి నువ్వు నాకు ఎంతో దగ్గరివాడయ్యావు. చెప్పు, నీ గురించి అన్ని సంగతులు వినాలనుకుంటున్నాను" అన్నాడు.

కిరణ్ లోలోన నవ్వుకున్నాడు.

"నా పేరు విన్సెంట్. మాది స్టువర్టుపురం. ఇలాంటి డెకాయిజం, లూటీలు నాకు మా స్టువర్టుపురం సెటిల్మెంటు సిబ్బందికి వెన్నతో పెట్టిన విద్య, ఇళ్లు, బస్సులు,

బ్యాంకులే కాదు, ఎన్నో ట్రెయిన్ లూటీలు కూడా నడుస్తున్న ట్రెయిన్‌లోనే విజయవంతంగా చేశాం నేను, మా సిబ్బంది. ప్రస్తుతం యీ సిటీని మా కేంద్ర స్థానంగా చేసుకుని అన్ని రకాల లూటీలను సక్సెస్ ఫుల్‌గా నిర్వహిస్తున్నాను" అన్నాడు కిరణ్.

"అది సరే, నా పేరు ఎందుకు ఉపయోగించుకుంటున్నారని అడుగుతున్నాను...."

"మీరు ఎంత పకడ్బందీగా, ఊహించలేనంత స్పీడుగా, గొప్పగా దోపిడీలు చేస్తున్నారో తెలిశాక మిమ్మల్ని యెలాగైనా కలుసుకుని మాట్లాడాలని తపిస్తున్నాను. నేను మీ అభిమానిని. మీరు వృత్తిలో తీసుకుంటున్న మెలకువలు నన్ను బాగా ఆకర్షించాయి. మీ పేరు ఉపయోగించుకుని యీ దోపిడిలు చేస్తున్నందుకు ముందుగా క్షమించండి గురూజీ! అలా చేస్తే మీరు ఆగ్రహించి నన్ను కలుసుకుంటారని ఆ విధంగా మీ పరిచయ భాగ్యం దొరుకుతుందనీ ఆశించాను. నేనూహించినట్టే జరిగింది" అన్నాడు కిరణ్.

గజేందర్ పొంగిపోయాడు.

"శభాష్! ఇలాంటి ఏక్టివ్ సెన్స్ వున్న వృత్తిపట్ల గౌరవమున్న వ్యక్తులంటే నాకు చాలా యిష్టం! నిన్ను కలుసుకున్నందుకు చాలా సంతోషిస్తున్నాను. ఇప్పుడు మనం మనం ఒకటయిపోయాం. నీకిష్టమైతే నిన్ను మాలో ఒకడిగా చేర్చుకుంటాం. అయితే నువ్వు మాకన్న తక్కువని ఎన్నడూ భావించం. మాతో సమానస్థాయి కల్పిస్తాం. నీ కిష్టమైతే చెప్పు, ఈ క్షణంనించీ నిన్ను మాలో చేర్చుకుని, మా పద్ధతులు, వ్యవహారాలు అన్నీ నీకు చెపుతాను. వృత్తిలో మరెన్నో మెలకువలు నేర్పి

స్తాను. నీ అభిప్రాయం ఏమిటి?" అన్నాడు గజేందర్.

కిరణ్ వెంటనే, "అంతకన్నా కావలసిందేమిటి? మీవంటి పెద్దల సాహచర్యంలో నేను వృత్తిలో బాగా రాణించగలనని నా నమ్మకం, ఆశాను. మీరు నాకు గురుతుల్యులు. మీరు పిలిచి నన్ను మీలో ఒకడిగా చేర్చుకుంటానంటే అంతకన్నా నాకేం కావాలి?" అన్నాడు ఆనందం ప్రకటిస్తూ.

గజేందర్ కిరణ్‌తో కరచాలనం చేశాడు. గజేందర్ అనుచరులు, కిరణ్ అనుచరులతో కరచాలనం చేశారు.

## 7

"ఇదిగో, ఇదే మన రహస్య స్థావరం. దీన్ని కనిపెట్టడానికి పోలీసులు తలకిందులుగా తపస్సు చేస్తున్నారు. కానీ వాళ్ళతరం కాలేదు. పెన్‌పహాడ్, అవలిపక్క నుంచి ఈ రహస్య స్థావరానికి సొరంగం వున్నట్టు నా అనుచరులకూడా తెలీదు. సొరంగం మొదలయిన దగ్గర్నుండి లోపలికి చేరేవరకు అనుచరులందరు నల్లటి గంతలు కట్టుకుంటారు. అది వాళ్ళు క్రమం తప్పకుండా పాటిస్తున్న ఓ గొప్ప అలవాటు. దానికి ఈనాటివరకు వాళ్ళు కట్టుబడి వున్నారు" అన్నాడు గజేందర్ రహస్య స్థలంవద్ద కిరణ్ కళ్ళ గంతులు విప్పి.

"మంచి క్రమశిక్షణ గలవాళ్ళే నీ అనుచరులు. ఇన్నాళ్ళుగా నీతో అన్ని కార్యక్రమాలను పాల్గొని నీకు విజయాన్ని సాధించిన వీళ్ళు రహస్య స్థావరం తెల్సుకోకుండా నిగ్రహం చూపించటం గొప్ప సంగతే! అందుకు వీళ్ళను మెచ్చుకునితీరాలి" అన్నాడు చుట్టూ పరికించి చూస్తూ. గజేందర్ తన అనుచరులతో బాటు

కిరణ్‌కి, అతని అనుచరులకి కూడా చాలా సిన్సియర్‌గా గంతలు కట్టేశాడు. ఎంతో కాలంగా తన అనుచరులుగా వున్న వ్యక్తులకే స్థావరం చూపించటానికి కష్టపడని గజేందర్ ముక్కు మొహం తెలీని తనకి ఎలా చూపిస్తాడు? బందిపోటు కూడా తనకి నచ్చిన పరిధికి, పద్ధతికి కట్టుబడి వుంటాడన్నమాట!

కిరణ్‌కి నవ్వొచ్చింది. గజేందర్ గమనిస్తే బావుండదని ముఖం పక్కకి తిప్పుకుని సీరియస్‌గా ఆ రహస్య స్థావరాన్ని పరిశీలిస్తూ వుండిపోయాడు.

అదొక పొడవైన హాలు. లోపల ఓ పొడవాటి టేబిలు దానిచుట్టూ కుర్చీలు, అధునాతనంగా అమర్చబడిన కాన్ఫరెన్సు హాలులా వుంది. ఓ పక్కగా కొన్ని ట్రాన్స్‌మిటర్లు, యంత్రాలు, వాటిని పనిచేయించటానికి స్విచ్‌లు, మీటలు, మధ్యగా టెలివిజన్ తెరవున్న సాధనమూ వున్నాయి.

కిరణ్‌కి ఆశ్చర్యంగా వుంది. గజేందర్ ముఠా మొండి మనుషులు, అనాగరికులు కాదు. వాళ్ళు కూడా వైజ్ఞానికంగా అనుభవం సాధించినట్టు కనిపిస్తోంది, ఆ మెషినరీ అంతా చూస్తూంటే. ఇక్కడ కూచుని బయట ప్రపంచంలో ఏం జరుగుతున్నదీ చక్కగా చూడవచ్చు. ప్రభుత్వ కార్యకలాపాలు, చర్యలు ఎప్పటికప్పుడు తెలుసుకోవచ్చు. ప్రభుత్వానికి చట్టానికి దొరక్కుండా ఎలా ఆత్మరక్షణ చేసుకోవాలో ఎప్పటికప్పుడు తగిన జాగ్రత్తలు తీసుకోవచ్చు.

గజేందర్ ముందుచూపుకి మనసులోనే అతన్ని అభినందించకుండా వుండలేకపోయాడు కిరణ్.

"అతన్నీ ముందు జాగ్రత్త చర్యలు! వీటిని చూడ

టానికి ఆపరేట్ చేయటానికి ప్రత్యేకమైన సిబ్బంది వున్నారు. వాళ్ళకి బయట ప్రపంచంతో సంబంధంలేదు. వాళ్ళని భయపెట్టి బెదిరించి కిడ్నాప్ చేసి తెచ్చాం. వాళ్లు మనకి ఎదురు తిరక్కుండా ఎప్పటికప్పుడు మన సిబ్బంది వేయి కళ్ళతో వాళ్ళ చర్యలను గమనిస్తూంటారు!" అన్నాడు గజేందర్.

"నీ ముందు చూపును అభినందించాలి" అన్నాడు కిరణ్.

"ఇదంతా నా ప్రయోజకత్వం కాదు. వీటన్నిటినీ సమర్థవంతంగా నడిపించే సూత్రధారుడు వేరే వున్నాడు" అన్నాడు గజేందర్.

కిరణ్ తన వ్యూహం నిజమవుతున్నందుకు సంతోషించాడు. "ఎవరాయన?" అడిగాడు.

"బాస్."

"అదే, ఎవరా బాస్."

"బాస్ అంటే బాసే. అతని పేరుగాని, వివరాలుగాని ఎవరూ అడక్కూడదు. ఎవరికీ తెలియదుకూడా. బాస్‌గానే అందరికీ తెలుసు యిప్పటివరకు. ఇకముందు కూడా బాస్‌గానే వ్యవహరించటం జరుగుతుంది ఎప్పటికీ."

"ఆయన ప్రత్యక్షంగా దోపిడీ కార్యక్రమాల్లో పాల్గొనరా?"

"నెవర్. ఆయనదంతా ప్లానింగ్ అండ్ మేనేజింగ్. ఆయన ప్లాన్ యిప్పటివరకు ఎన్నడూ ఫెయిల్ కాలేదు. మేమంతా ఆయన అడుగుజాడలలో కనుసన్నల్లో మెలగుతూ ఆయన ఆజ్ఞలను అమలుపరుస్తాం."

"అంటే నీలాగా ఇంకా కొన్ని గ్రూప్స్ వున్నాయా?"

"అవును. మొత్తం అయిదు బేచిలున్నాయి. ప్రతి బేచ్ కి ఒక్కో నాయకుడు. మన బేచ్ నంబర్ మూడు. ముందు రెండు, వెనక రెండు-మరో నాలుగు బేచ్ లున్నాయన్నమాట. మొత్తం మేం అయిదుగురు నాయకులం బాస్ చెప్పిన ప్రకారం ఏ రోజు ఎన్ని గంటలకు ఏ ఏరియాలో ఏవిధంగా లూటీ చెయ్యాలో బాస్ ముందుగానే నిర్ణయించి చెపుతారు. ఏయే జాగ్రత్తలు తీసుకోవాలో అత్యవసర పరిస్థితి ఏర్పడినప్పుడు ఎలా తప్పించుకోవాలో ఎవర్ని ఆశ్రయించాలో అవన్నీ ముందుగానే చెప్పి వుంచుతారు.

నగరంలో కొన్ని కీలక ప్రాంతాల్లో మనం తల దాచుకోవటానికి కొన్ని సురక్షిత స్థానాలున్నాయి. పోలీసులు చుట్టుముట్టినప్పుడు తప్పించుకునే దారి లేక పోతే చటుక్కున సురక్షిత స్థానాలకు పారిపోయి దాక్కుంటాం. ఆ స్థానాలు ఎవరూ అనుమానించటానికి వీల్లేనివి. సంఘంలో గొప్ప పేరుప్రతిష్ఠలున్న అనేక మంది పెద్దమనుషుల నివాస స్థలాలే ఆ సురక్షిత స్థానాలు" అన్నాడు గజేందర్ గంభీరంగా.

కిరణ్ కి చాలా విషయాలు తెలిశాయి. ఆ ఘరానా పెద్దమనుషులెవరై వుంటారో వూహించటానికి ప్రయత్నిస్తున్నాడు.

గజేందర్ని అన్ని వివరాలూ ఒకేసారి అడిగేస్తే అనుమాన పడవచ్చు. తనంతట తానుగా అతనే ఈ విషయాలు చెప్పాలిగాని, తను అడక్కూడదు. అనవసరమైన ఆసక్తి కూడా చూపించకూడదు. తనది చాలా సున్నిత

మైన పరిస్థితి. ఏ మాత్రం అతనికి అనుమానం వచ్చినా తనని తనతో వున్న పోలీసు సిబ్బందితో బాటు జీవన సమాధి చేస్తారు, అనుమానం లేదు!

"వెరీ గుడ్! చాలా ప్రికాషన్స్ తీసుకున్నారన్న మాట! అందుకే సిటీలో ఏ మూల ఎన్ని రెకాయిజమ్స్ చేసినా యిప్పటివరకు పోలీసులకి ఏమాత్రం క్లూ అందలేదు. పైనుండి కిందివరకు పోలీసు డిపార్టుమెంటుని, ప్రభుత్వాన్ని ప్రజలను గడగడలాడించగలుగుతున్నారంటే ఈ జాగ్రత్తలు తీసుకోవటంవల్లనేనని నాకర్థమయింది."

"సో, నా వద్ద ఓ వారం రోజులు శిక్షణ పొందావంటే నువ్వు కూడా నా అంతటి వాడివవుతావు. నన్నే మించిపోగలవు కూడా! నువ్వు అంతటి సమర్థుడవని నాకు తెలుసు. నువ్విప్పటివరకు నిర్వహించిన ఘనకార్యాలు చూశాక నీమీద నాకు గురి కుదిరింది. పోలీసు ఇన్స్పెక్టర్ ఇల్లు లూటీ చేయుటం గురించి తెలిశాక ఆనందం పట్టలేకపోతున్నాను" అన్నాడు గజేందర్ కిరణ్ భుజం తట్టి.

కిరణ్ నమ్రతగా నవ్వాడు.

"ఇంకా చాలా విషయాలు చెప్పాలి నీకు. ప్రస్తుతానికి రెస్టు తీసుకో! కాసేపట్లో పూర్తిగా తెల్లవారబోతోంది. ఇది నీ యిల్లేననుకో! నీకిక్కడ ఏ లోటు జరగదు" అన్నాడు గజేందర్.

(ముగింపు వచ్చే సంచికలో)

సీరియల్

# విషసర్పాల సికిందర్

(గత సంచిక తరువాయి)

అప్పుడామె కారు దిగి చకచకా నడవసాగిందా వీధిలో.

కారును తక్షణ ప్రయాణానికి వీలుగానే వుంచింది, మెయిన్ రోడ్డువైపు తిప్పి.

ఆమె అడుగులు దూరం దూరంగా పడుతున్నాయి. ఆమె దృక్కులు ఇళ్ళ తలుపులమీద వున్నాయి. ఆ వరుసలో వీధికే ముఖద్వారాలున్న ఆ ఇళ్ళ తలుపులన్నీ మూసి వున్నాయి. వీధిలో అంత రాత్రివేళ ఎవరూ లేరు. కనీసం ఆమెను చూసి మొరిగేందుకు కుక్కయినా లేదు....

వీధి దీపాలు కాంతివంతంగా వున్నాయి.

అప్పుడామె ఒక ఇంటిముందాగింది.

మెట్లు ఎక్కి మూసి వున్న ఇంటి తలుపుమీద కొట్టబోతూ ఆగిపోయింది.

ఆమె ఒక్కసారి తన చేతులు చూసుకుంది.

ఖాళీ!

తృళ్ళిపడి, మెట్లు దిగి గబగబా నడవసాగింది వచ్చిన

దారిని....పరుగెడుతున్నట్టు ఆదరాబాదరా నడిచివెళ్ళి కారును చేరుకుంది. గభాల్న డోరు లాగి హేండ్ బ్యాగు నందుకుంది. చటుక్కున తెరిచి అందులోంచి ఒక కత్తిని ఎన్నుకుంది. తిరిగి బ్యాగు పెట్టేసి, డోరు మూసేసింది.

అప్పుడు నిట్టూర్చిందామె.

నిమితపడి, ఓసారి వీధిలో ఇరువైపులా చూసి, తిరిగి నడకసాగింది.

ఆర నిమిషంలో మళ్ళీ ఆ యింటి ముందుకొచ్చి తలుపు కొట్టింది.

ఎవరూ పలకలేదు.

గొళ్ళెం పట్టుకొని కొట్టింది మళ్ళీ.

ఉలుకూ పలుకూ లేదు.

దబదబ బాదింది మళ్ళీ.

లోపలేదో అలికిడయింది.

ఆమె వెంటనే పక్కకు జరిగి నిలబడింది.

"ఎవరూ?" లోపలినుంచి మాటలు వచ్చాయి.

"నేను సుమలతని" జాగ్రత్తగా చెప్పిందామె అలాగే నిల్చుని.

"సుమలతా? ఏ సుమలత?"

"అప్పుడే మర్చిపోయావా...?"

అడుగులు పూర్తిగా దగ్గరయ్యాయి. తలుపవతలనుంచే మాటలు వినిపించాయి. "ఓహ్, నువ్వా...నువ్వింత రాత్రి ఎందుకొచ్చావ్?"

"ముందు తలుపు తియ్, నీతో మాట్లాడాలి."

"ఇంత రాత్రి...ఇంత రాత్రి నాతో ఏం మాట్లాడాలి?"

"ముందు తలుపుతీయ్, త్వరగా!"

అప్పుడు గొళ్ళెం తీస్తున్న చప్పుడయింది.

ఆమె కత్తి వున్న కుడిచేతిని వెనుక దాచుకుంది.

తలుపు తీసి అతను, "నువ్వింత రాత్రి ఇలా రావడం" అని అనబోతూ ఆమె ముఖంలోకి చూసి ఆగిపోయాడు. ఆగిపోయి చూస్తూండిపోయాడలాగే, కళ్ళూ నోరూ తెరచుకుని.

"నువ్వు—నువ్వు సుమలతవి కాదు! సుహాసినీ!!"

అతని అరుపుతో బాటే ఒక్కసారి దూరం నుంచి సైరన్లు విన్పించాయి.

ఆమె ఉలిక్కిపడి విసురుగా కుడిచేతిని అతనిమీదికి విసరబోయింది—అతను వెనక్కి దూకేస్తూ ఆమె పొట్ట మీద ఛయ్యేసి నెట్టేశాడు. మెట్టుమీదనించి జారి ఆమె అమాంతం కిందపడింది, కెవ్వుకేకలా. సైరన్లు దగ్గర య్యాయి. అతనొక్క గంతులో వచ్చి మళ్ళీ ఆమెమీద కురిగాడు, ఉన్మాదిలా పోటు తిన్నాడు. భుజంపట్టుకుని కేక వేశాడు. పక్కకు పడ్డాడు. సైరన్లు ఇంకా దగ్గరై పోయాయి. ఆమె ఒక్క వుదుటున లేచి, వీధిలోకి తిరిగిన హెడ్లైట్స్‌ని చూసి పరుగుతీసిందక్కడ్నించి—

"అదిగో, పారిపోతోంది! ఆమె....!!" లాల్ అరుపుకి ఇంకా వేగం పెంచాడు డ్రైవర్. దుమ్ము లేపుకుంటూ, సైరన్ మోగించుకుంటూ, ఆ ఇరుకు వీధిలో శరవేగంతో వచ్చేస్తున్న కారుని, దాని వెనుక జీపునీ చూసి ఆమె లేడిలా గెంతుతూ వురికి తన కారును చేరుకుంది. ఆ వాహనాలింకా ముప్ఫైగజాల దూరంలో వుండగానే స్టార్టుచేసి దూకించింది, మెయిన్ రోడ్డుమీదికి. ఆగకుండా దూసుకెళ్ళసాగింది....అప్పుడు ఎదురుగుండా వచ్చేసిన

మరో జీపును చూసి బెదిరి, అడ్డదిడ్డంగా పోనిస్తూ దానికి గుద్దేసి, పక్కకు విసిరేసి, అదే వేగంతో పలాయనం చిత్తగించింది.

ఆమెను తరుముతున్న వాహనాలకి ఈ జీపు అడ్డు పడటంతో గొంతెత్తి తిట్టాడు కృష్ణన్.

లాల్ కారు దిగి పరుగెత్తసాగాడు ఆల్సైట్ అంబాసిడర్ వెనుక, రివాల్వర్ తీసి పట్టుకుని. ఆ కారు రోడ్డు మలుపు తిరిగి పోతూండగానే ఒకచోట ఆగిపోయి మూడుసార్లు కాల్చాడు. మూడు గుళ్ళూ వృధా అయ్యాయి. ఆ కారు అదృశ్యమైంది.

లాల్ రెచ్చిపోతూ మళ్ళీ పరుగుతీశాడు. మలుపు తిరిగి మళ్ళీ కన్పించిన ఆ కారుని మరో రెండుసార్లు షూట్ చేశాడు. ఒకటి వీండ్ షీల్డుని, మరొకటి వెనుక టైరుని బద్దలు చేశాయి బుల్లెట్లు.

కారు వేగం తగ్గిపోయి, వంకర టింకరగా పోతూ యాభై గజాల దూరంలో ఫుట్‌పాతున ఓ యింటి గోడకు గుద్దేసి ఆగిపోయింది.

వెనుక నిలిచిపోయిన ఆ మూడు పోలీసు వాహనాలూ అప్పుడు పరుగెత్తుకుంటూ పోతున్న లాల్‌ని అందుకున్నాయి. లాల్ ఒకదాంట్లో దూకాడు. అలోపే ఆమె కారు దిగేసి రోడ్డుమీద పురకసాగింది....

ఈ అలజడికి నిద్రలేచి వచ్చేయసాగారు జనం. ఆ కోలాహలంలో పోలీసు వాహనాలు ఇంకా సైరన్‌లు మోగించుకుంటూ ఆమె వెంటపడ్డాయి.

"ఇన్‌స్పెక్టర్! ఆమె వేగం చూడండి....ఏ సందులోకి తిరిగిపోయినా కష్టం! మీ గతా ఫోర్స్ ఏమయింది? ఇంకా చేరుకోలేదెందుకని? ఓహ్, డ్రైవర్, యూ

డ్రైవ్ ఫాస్టు!" లాల్ అరవసాగాడు ఉద్రేకంగా.

వెనుకనుంచి హెడ్ లైట్లు అంతకంతకూ కాంతివంత మవుతూంటే, ఆమె హఠాత్తుగా ఎడమపక్క కన్పించిన సందులోకి దూరిపోయింది....హాల్టు! ఆ సందులోకి ఆ వేగంతో మలుపు తీసుకోలేవు వాహనాలు.

అంతా దూకేసి పరుగుతీశారు గబగబా....అప్పటికే ఆమె కన్పించడం మానేసిందా చీకటి సందులో. వీళ్ళ బూట్ల చప్పుడులో ఆమె అడుగులు విన్పించడంలేదు. అంతా ఇంకా ఉద్రేకం తెచ్చుకుని అరుచుకుంటూ పరుగెత్తసాగారు. "సుహాసినీ! నువ్వు లొంగిపో! మేం షూటింగ్ ఓపెన్ చేస్తున్నాం...." కృష్ణన్ అరిచాడు, గాల్లోకి రెండుసార్లు పేల్చి.

సమాధానంలేదు. మనిషి జాడలేదు.

హఠాత్తుగా అప్పుడా వాహనాలు సందులోకి తిరగడంతో మొత్తం వీధంతా హెడ్ లైట్లతో వెలిగిపోయింది.

ఆమె జాడలేదు.

పరుగెడ్తున్న వాళ్ళ కాళ్ళకి ఓ పందికొక్కు అడ్డు వచ్చింది. అది రివ్వున రోడ్డవతలకి దూకేసి మాయమైంది. వాళ్ళంతా ముందుకు సాగిపోయారు. సందు చివరిదాకా వెళ్ళి ఇరువైపులా చీలిపోయిన మార్గాల్ని రెండు జట్లుగా విడిపోయి అనుసరించారు.

వాహనాలు వాళ్ళ వెనకే వెళ్ళాయి.

వాళ్ళంతా హెచ్చరిక చేస్తూ వీధివీధికీ తిరిగారు. ఇళ్ళ తలుపులు కొట్టి ప్రతి ఇంట్లోనూ చూశారు. మొత్తం పేటంతా గంటసేపు గాలించారు. వచ్చి చేరుకున్న అదనపు బలగాన్ని చుట్టు మొహరింపచేశారు. వల

బిగించారు. తీక్ష్ణంగా గాలించారు. ఆమె లేదు. ఎవరికీ మళ్ళీ ఎదురుపడలేదు, కన్పించలేదు. ఎవరికీ–ఆ ప్రాంతపు వాసులెవరికీకూడా ఆమె ప్రత్యక్షం గాలేదు. రెండున్నర గంటల గాలింపు అనంతరం విరమించుకున్నారు.

అంతా తిరుగుముఖం పడుతున్న క్షణంలో, అప్పుడు లాల్‌కేదో తట్టింది. "ఓహ్, కృష్ణన్! పందికొక్కు! మనకిందాక అడ్డొచ్చిన పందికొక్కు—అదెక్కడ్నించి వచ్చింది?"

"ఎందుకు .. అదెందుకు?" తికమకపడ్డాడు కృష్ణన్.

"ఓహ్, కమాన్! ఇంకో పొరపాటు .... పోండి!"

లాల్ పరుగెత్తుకుంటూ తిరిగి మొదటి సందులోకి వచ్చాడు. అక్కడ ఇరువైపులా చూసుకుంటూ నడుస్తూ, కొంతదూరంలో తక్కున ఓచోట ఆగిపోయి చూశాడు ఎడమపక్క.

అక్కడొక బడ్డీకొట్టు వుంది.

దానికింద ఆరు చదరపుటడుగుల మేరకు, అడుగున్నర ఎత్తులో ఖాళీస్థలం వుంది....అక్కడంతా చెత్తాచెదారం పోగయివుంది.

లాల్ వెంటనే జనంలోంచి టార్చితీసుకుని వేసి చూశాడు. ఆ చెత్త చెదిరిపోయింది....అందులో పడి ఒక చెప్పు కన్పిస్తోంది....

"ఆమె ఇక్కడ దాక్కుంది....దీనికింద!" అరిచాడు లాల్ చెప్పు అందుకుంటూ, "ఆ పందికొక్కు ఇక్కడ్నించే ఉరికింది....మనం వెళ్ళిపోయింది చూసి ఆమె యిటునుంచి తప్పించుకుంది!"

అందరూ స్తబ్దులై చూస్తున్నారు.

ఆ సమయంలో ఆమె వాళ్ళకు కొన్ని వందగజాల

దూరంలో వుంది, గబగబా నడిచిపోతూ.

అదే సమయంలో కంట్రోల్ రూముకి వివిధ ప్రాంతాలనుంచి ఆరు వార్తల సమాచారాలందాయి.... ఒకదాని తర్వాత ఒకటి.

• • •

వరంగల్ రూట్లో తాటితోపు.

గాలి వీస్తోంది రివ్వున. గాలికి తాటాకుల చప్పుడు విపరీతంగా వుంది. ఆ చప్పుడూ భయంగొలిపే కారు చీకట్ల మధ్య గబగబా అటూ యిటూ తిరుగుతున్నాయి, అక్కడ ఆకారాలు.

వాహనాలు వచ్చి ఆగుతున్నాయి, మళ్ళీ వెళ్ళిపోతున్నాయి.

మనుషులు నడిచి వస్తున్నారు, తిరిగి వెళ్ళిపోతున్నారు.

వస్తువులు చేతులు మారుతున్నాయి, అదృశ్యమవుతున్నాయి.

ప్రవేశ మార్గంలా ఏర్పరచినచోట ఇద్దరు సాయుధులు వచ్చే ప్రతివారినీ సోదా చేస్తున్నారు. కోడ్‌వర్డ్ అడుగుతున్నారు, మొహాలపై టార్చిలు వేస్తూ.

'కాసప్రాణం—కాసుల బేరం.'

అలా లోపలికి అనుమతించబడ్డ వాళ్ళంతా నలభై గజాలు నడిచి, ఒక జీపును చేరుకుంటున్నారు. ఆ జీపు పూర్వం మిలిటరీ వాహనమనీ, ఇద్దరు ఆర్మీవాళ్ళని వధించి అపహరించబడిందనీ, వాళ్ళెవరికీ తెలిసే అవకాశంలేదు. ఆ కటిక చీకట్లో నీలంలోకి మారిపోయిన దాని రంగునీ గుర్తించలేరు. దాన్ని గుర్తుపెట్టుకోడానికి లైసెన్స్ ప్లేట్లు అసలే లేవు.

అందులో మాత్రం లైటు వెలుగుతోంది.

దానిముందు మరిద్దరు సాయుధులు.

నిశాచరుల్ని వరుసలో వుంచుతున్నారు.

వరుస చిన్నగా కదులుతోంది.

వరుసలో వచ్చే ప్రతివారినీ అడుగుతున్నాడు శంభూనాథ్.

"మీ పేరు?"

చెపుతున్నాడు నిశాచరుడు. "యశ్ పాల్ కపూర్."

"ఎంత ఆఫర్ చేశారు?"

"అయిదు లక్షలు."

లిస్టు చెక్ చేసి చెబుతున్నాడు జింబో. "కరెక్ట్, మిష్టర్ యశ్ పాల్ కపూర్ ఫైవ్ లాక్స్."

చేయి చాపుతున్నాడు శంభూనాథ్. బ్రీఫ్ కేసు అందుతోంది చేతికి. నోట్లు నిండిపోతున్నాయి ట్రంకులో. అభివాదం చేస్తున్నాడు చిరునవ్వుతో. "వెరీ వెరీ హేపీ. నూరేళ్ళాయుష్షు మీకు. నెక్స్ట్!"

"వరుసలో మరో నిశాచరుడు, "అజయ్ కుమార్.."

"మీరు అయిదు లక్షలు ఆఫర్ చేశారు."

వరుసలో ఇంకో నిశాచరుడు, "విశ్వేశ్వరరావు ..."

"మీరు మూడు లక్షలు ఆఫర్ చేశారు."

వరుసలో ఇంకో....ఇలా నిమిషానికొకరు చొప్పున దాదాపు మూడ్నెలుంది నించి గంటలోగా వసూళ్ళు పూర్తయ్యాయి.

అప్పుడా ప్రాంతం నిర్జనమైపోయింది, ఆ ఆరుగురు తప్ప.

నిండిన ట్రంకుల్లోకి చూస్తూ భుజాలెగరేశాడు శంభూనాథ్ ఆత్రంగా, "వెరీగుడ్! ఈ రోజు బాగుంది నిన్నటి

కంచే!”

జింబో సకిలించాడు అందులోకి చూస్తూ.

“మొత్తం కలెక్షనెంత, జింబో?”

అందరూ ఉలిక్కిపడ్డారు.

ఆ మాటలు చీకట్లోంచి విన్పించాయి....

బూట్ల చప్పుడు టకటక విన్పిస్తోంది, రాళ్ళలో.

ఆ ఆకారం దగ్గరకొచ్చి జీపులోకి తొంగిచూసింది.

“మొత్తం కలెక్షనెంత, జింబో?”

జింబో చకచకా లిస్టులో అంకెలు కూడి చెప్పాడు, “వన్ ఫోర్ థర్టీ ఫైవ్ లాక్స్, బాస్.”

ఆ ఆకారం పెద్ద పెద్ద కళ్ళలో ట్రంకులోకి చూసి, ఈ పెక్కింది.

“నిన్నటి కలెక్షనెంత జింబో?”

“ఓన్లీ నైన్టీత్రీ లాక్స్, బాస్.”

ఆ ఆకారం విరగబడి నవ్వసాగింది, నోట్లని పైకెత్తి ఎగరేస్తూ.

“వెరీ వెల్, గుడ్ ప్రోగ్రెస్, లెట్స్ గో!”

కొన్ని క్షణాల తర్వాత, ఒకకోటీ ముప్పైఅయిదు లక్షలు లూటీ ధనంతో, ఉత్సాహంగా పయనమయ్యారా ఏడుగురూ దుండగులూ, తమ నెలవుకి....

• • •

తెల్లవారేసరికి నగరమంతా ప్రాకిపోయిందీ హత్యల వార్త.

ప్రజలకిప్పుడు సుహాసిని చాకచక్యం మరింతగా చర్చనీయాంశమైంది. ఎవరినోట చూసినా ఆమె గురించి వ్యాఖ్యలే. ఆమెకు ప్రశంసలే.

మరి ఆరు హత్యలు ...

ఈ హత్యలకి గురయిన వాళ్ళంతా సామాన్య పౌరుల పురుషులే.

మొదటి పురుషుడు విద్యానగర్‌లో ఒక టీచరు. రెండవతను కాచీగూడలో కాంపౌండరు. మూడవతను దిల్‌సుఖ్ నగర్‌లో క్లర్క్. నాల్గవతను ఈదీబజార్‌లో గాజుల వ్యాపారి. అయిదో అతను మెహదీ పట్నంలో చిన్న హోటల్ ఓనరు. ఆరవతను బాలానగర్‌లో ఒక ఫోర్‌మన్.

సనత్ నగర్‌లో ఫోటోగ్రాఫర్ భుజంలో గాయంతో తప్పించుకోగల్గాడు.

అదే ఆమె చేసిన చివరి దాడి—విఫలమయిన యత్నం.

అందరు హతుల శరీరాల్లోనూ (గుండెల్లో) ఆ వేరకం కత్తులున్నాయి. ఇంకే ఆధారాలు లేవు. ఆ ఫోటోగ్రాఫర్ తన అనుభవాన్ని ప్రెస్‌వాళ్ళకి పదే పదే విన్పించసాగాడు. అయితే తనమీద ఎవరీ దాడి జరిపించిందీ చెప్ప నిరాకరించాడు. హతులైన ఆరుగురిలో ఎవరూ కూడా పోలీస్‌స్టేషన్స్‌లో కోరిన వివరాలు దాఖలు చేయలేదు.

ఆ వైట్ అంబాసిడర్‌ని రాత్రే స్వాధీనం చేసుకున్నారు. అందులో ఆమె వదిలేసిన హేండ్‌బ్యాగులో ఇంకా ఏడు కత్తులున్నాయి. ఇంకేమీ లేవు.

ఇంతవరకు సుహాసిని వదిలిన తన వ్యక్తిగత ఆధారాల్లో ఆ టేబిల్స్‌మీద ఆమె చేతివ్రాత, లెక్చరర్ మీద దాడి జరిపినప్పుడూ కత్తిమీద ఆమె రక్తం మరకలు, ఇప్పుడీ బడ్డీ కొట్టు కింద వదిలేసిన కడికాలు చెప్పు వున్నాయి.

ఆమె పలాయన వృత్తాంతం హాట్ హాట్ పలావు అయింది పత్రికలవాళ్ళకి. పిలవని పేరంటంలా వచ్చి

పడ్డారు పోలీసుల వద్దకి. ఆమె చాతుర్యాన్ని తామే పొగిడి కొండెక్కించడం ఇష్టపడక నోరు మెదపలేదు పోలీసులు. ప్రెస్ వాళ్ళు అప్పుడు వాళ్ళ అసమర్థతని ఎత్తిచూపారు. పోలీసులు అది ఒప్పుకున్నారు.

లాల్ కూడా తన అసమర్థతని అంగీకరించాడు. వాళ్ళంతా ఇంటర్వ్యూలు, ఫోటోలు, కామెంట్లకోసం వేధిస్తోంటే లాల్ అందర్నీ పోగేసి ఇలా డెలివరీ చేశాడు ఉపన్యాసాన్ని.

"ఒప్పుకుంటాను, మీరంతా నాపై వుంచిన విశ్వాసాన్ని వమ్ము చేశాను. మరిన్ని హత్యలకి ఆస్కారమిచ్చాను. కట్టెదుట హంతకురాల్ని పట్టుకోలేకపోయాను. దీన్నిబట్టి ఇక నాకేమన్పిస్తోందంటే, మైడియర్ ఫ్రెండ్స్, నా శక్తిసామర్థ్యాలుడిగాయి. నేనిక క్షమార్పణలతో ఈ బాధ్యతను వదులుకోక తప్పదు. ఇంకెవరైనా సమర్థుడిని దీనికి ఎన్నుకోమని డి. జి. పి.గారికి నా విజ్ఞప్తి...."

ఇది పోలీసు వర్గాల్లో కలవరం రేపింది.

"మిష్టర్ లాల్, మీరిలా చేయలేరు!" అన్నాడు డి.జి.పి. స్వయంగా ఫోన్ చేసి, ఇంటికి.

"నేనింతకంటే చేయలేను, సర్" అన్నాడు లాల్ బాధగా.

"వాళ్ళంతా చెలరేగిపోతారు, మిష్టర్ లాల్?"

"పోనివ్వండి, సర్. అలా జరగాలనే నేను కోరుకుంటున్నాను."

"ఓహ్, ఏమిటి మీ మోటివ్, మిష్టర్ లాల్?"

"నేనికనించి గుప్తంగా పనిచేయాలనుకుంటున్నాను, సర్."

"వివరంగా చెప్పండి."

"ప్రజలూ, శత్రువుల దృష్టిలో లాల్ విరమించు కున్నాడు. కానీ మీ పోలీసుల దృష్టిలో ఇంకా ప్రయత్నిస్తూనే వున్నాడు."

"గుడ్, వెరీ వెల్ మీ అయిడియా చెప్పండి."

"ఇలా కాదు, మిమ్మల్ని కలుసుకోవాలి అరగంటలో. కమీషనర్, ఇన్స్పెక్టర్ కృష్ణన్, మీరు మాత్రమే వుండాలి సర్, అక్కడ."

"అలాగే, ఇప్పుడే వాళ్ళని రమ్మంటాను."

"థాంక్యూ. అక్కడ ప్రెస్ వాళ్ళు వుండకుండా చూడండి" ఫోన్ పెట్టేస్తూ లేచాడు లాల్.

అరగంటలో అతను డి.జి.పి. ఆఫీసులో వున్నాడు, వాళ్ళ ముగ్గురి ముందు కూర్చుని చర్చిస్తూ.

"తిరిగి ఆమె రాత్రి స్వేచ్ఛగా తన పని పూర్తిచేసు కుంది. అయినా ఆమెను మనవాళ్ళెవరూ గుర్తించలేక పోయారు. వాళ్ళందర్నీ ఫూల్స్ చేసింది. ఎలాచేసిందో కనుక్కున్నారా?"

తలూపాడు కమీషనర్. "అప్పుడా కారు నెంబర్ మనకు తెలియదు. పైగా ఆమె డూప్లికేట్స్ తగిలించు కొచ్చింది. మొన్నటి సంఘటనతో జాగ్రత్తపడి. వైట్ అంబాసిడర్లో ఒక స్త్రీ పోతున్నంతమాత్రాన అను మానించలేరు కదా? ఆమె సుహాసిని కావాలి. వాళ్ళంతా సుహాసిని కోసమే చూస్తారు తప్ప, ఇతరుల్ని అంత పరీక్షగా చూడరు. ట్రాజడీ ఏమిటంటే, ఆమె మారు రూపంలో వుందనీ అప్పుడెవరకీ తెలియదు. ఆమె ప్రతీ హత్యాస్థలంలోనూ గ్లవ్స్ ఉపయోగించింది. కానీ కారు నడుపుతున్నప్పుడు మాత్రం అవి లేవు. జాగ్రత్తపడింది,

పట్టిచ్చేస్తాయని. ఇప్పుడు నాకొక్కటే అనిపిస్తోంది.... ఆమె మాయరూపంలో వుంది. మనముందు మాస్కుతో కనిపించి, హాతులముందు అసలు రూపంతో ప్రత్యక్షమైంది. అలాగే జరిగింది.... మిష్టర్ లాల్."

"ఓ.కే, అలాగే అనుకుందాం. మరిప్పుడు ప్రశ్నేమిటంటే, ఆమె మళ్ళీ ఈ రోజు కూడా ప్రయత్నిస్తుందా అనేది."

"తప్పకుండా ప్రయత్నిస్తుంది ... మీరు విరమించుకున్నట్టు వాళ్ళకి తెలిసిపోతుంది."

"తెలిసిపోతుంది .... తెలిసే విధంగా మనమింకా ప్రచారం చేయాలి. నేను పోయినంత మాత్రాన వాళ్ళు విజృంభిస్తారనుకోను. ఐ కాంట్ వేల్యూ మై సెల్ఫ్ టు హై. మీ ఫోర్సుంది. మిమ్మల్ని అంత తేలికగానూ తీసుకోలేరు వాళ్ళు. అందుకని దీనికొక మార్గాన్ననుసరించాలి..."

"ఏమిటది?" అడిగాడు డి.జి.పి.

"రేడియోలో ప్రసారం చేయాలి, మధ్యాహ్నం ప్రాంతీయ వార్తల్లో. ఇంకా ప్రెస్‌కి రిలీజ్ చేయాలి. ఈ హత్యలు ఇంకా జరిగే అవకాశంలేదని మీరు భావిస్తున్నట్టూ, నిన్నటి అనుభవంతో సుహాసిని మళ్ళీ ప్రయత్నించిందని, మీరు నమ్ముతున్నట్టూ, జనుక ప్రజలిప్పుడు నిశ్చింతగా వుండవచ్చని మీరు హామీ ఇస్తున్నట్టూ ప్రకటించాలి. మీకీ భ్రమతో వున్నట్టు శత్రువుల్ని నమ్మించాలి. అప్పుడే వాళ్ళింకా చెలరేగిపోతారు—"

"కాని మనకేమిటి ప్రయోజనం?"

"మనకి వుంటుంది ప్రయోజనం" అన్నాడు లాల్ వెంటనే, "వాళ్ళిక ఏమీ చేయరన్న భ్రమలో వుండి

మీరు మీ బంధోబస్తునీ, ప్రయత్నాల్నీ విరమించుకుంటున్నట్లు వాళ్ళకి తెలిస్తే....అలా భావిస్తే—అప్పుడు తప్పకుండా వాళ్ళు తమ ప్రయోజనాలు చూసుకుంటారు. ఇక్కడ ఇచ్చి పుచ్చుకోవడం జరగాలి. మనమేదైనా ఇస్తేనే తిరిగి వాళ్ళనించి పొందగల్గేది. మనం వాళ్ళకొక అవకాశమిద్దాం.

“నా అయిడియా ఏమిటంటే, వాళ్ళకిలా సేఫ్టీ ఫీలింగ్ కల్గిస్తే, అప్పుడు వాళ్ళ విశృంఖలత్వంనుంచి మన ప్రయోజనం సాధించవచ్చు. దీనికొక మార్గం ముందు ముందు మీరు మొన్న స్వాధీనం చేసుకున్న స్నేక్ సొసైటీ ఉత్తరాల్ని తిరిగి వాళ్ళకి పోస్టుచేయాలి. ఆ ఉత్తరాలు ముప్ఫైరెండు వున్నాయి. వాటిని వివిధ ప్రాంతాలలోని లెటర్ బాక్సులలో ప్లాంట్ చేయాలి. క్లియరెన్స్ వాళ్ళకి వాటిని ముట్టుకోవద్దని చెప్పాలి.

“దీనికి ముందు ఈ హత్యలకి సూచించబడ్డ వ్యక్తుల్ని కాంటాక్టు చేయాలి. మన ప్రయత్నం తెలియచేసి సహకారం కోరాలి. ఆ ముప్ఫైరెండుమంది ఇళ్ళల్లోనూ మన వాళ్ళు వుండేలా చూడాలి. వాళ్ళే ఆ వ్యక్తులుగా నటించాలి....సుహాసిని వచ్చేవరకూ. ఆమె తప్పకుండా వస్తుంది, ఆ ఉత్తరాలందుకుని. ఇందులో ఇంకెవరి ప్రాణాలతో రిస్కు లేదు. అంతా మనవాళ్ళే గనుక సక్సెసవుతుంది—”

“అంటే, ఆమె అలా చంపడానికి వచ్చినప్పుడు మన ఆఫీసరు ఉపాయంగా పట్టుకుని బంధిస్తాడన్నమాట!” అన్నాడు డి.జి.పి.

“అంతే, ఇంతకంటే మార్గం లేదు. పరిష్కారంలేదు.

ముఖ్యమైన రెండుమూడు ఇన్స్పెక్టర్లని వెంటనే సెలక్టు చేయండి. ఇది ఈ రాత్రికే జరగాలి. వాళ్ళకా ఉత్తరాలు ఈ రోజే అందిపోవాలి. వెంటనే ఆయా వ్యక్తుల అంగీకారం తీసుకుని పోస్టుచేసేయండి ఉత్తరాల్ని. మరొక విషయం, మొన్న లెటర్ బాక్సు లన్నిటికీ తాళాయి మార్చారను కుంటాను?"

"అవును."

"అవన్నీ తీసేసి, మళ్ళీ అదివరకటివే వేసేయమనండి. తాళాలు మార్చినట్టు శత్రువులకి తెలియదు కాబట్టి వాళ్ళలాగే వస్తారు. ఏ టైపు తాళాలు వాడుతున్నారు?"

"F 4, F 5."

"వెల్, వెంటనే ఆ పాత తాళాలే వేసేయమనండి. ఆ ఉత్తరాల్ని మీరు విప్పిచూశారా?"

"చూశాం."

"అయితే వాటిని కొత్త కవర్లలో పెట్టి, ఒక్కొక్కరు ఒక్కొక్కదాని అడ్రసు వ్రాయండి—దస్తూరీ కలవకుండా."

తలలూపారు వాళ్ళు ముగ్గురూ.

"అలాగే, కానీ మిస్టర్ లాల్, నాకొకటి అర్థం కావడంలేదు. ఇలా సమాజాన్ని సంస్కరించాలన్న విచారం వీళ్ళకెందుకు పట్టుకుంది? ఏ ఆధారంమీద వీళ్ళింత శ్రమ పడుతున్నారు?"

"అంటే?"

"వీళ్ళకిందులో విచ్చలవిడిగా డబ్బు ఖర్చవుతోందని తెలుస్తూనే వుంది. ఈ డబ్బంతా యెక్కడ్నించి వస్తోంది వీళ్ళకి? యెందుకు పనిగట్టుకుని ఈ పనికోసం వెచ్చి

స్తున్నారు? ఏమిటి వీళ్ళకు ఇంట్రెస్టు? వీళ్ళలో దుర్మార్గులూ హంతకులే వున్నారు. వీళ్ళకేమిటి సంఘాన్ని సంస్కరించాలన్న చింత? స్త్రీ రక్షకులుగా చాటుకుని ఏమిటి వీళ్ళు ఆశిస్తున్నది ప్రతి గా?"

"అవును....నిజమే. ఈ సందేహం నాకూ వచ్చింది. వీళ్ళెవరో నిస్స్వార్థ సేవకులుగా బయల్దేరారంటే నా కనుమానం వేసింది. ఇలాటి కిరాతకులు సంస్కర్తలు కాలేరు. ఏ ప్రయోజనం లేకుండా ఎందులోకీ దిగరు.... ఇలా డబ్బూ ప్రాణాలు వెచ్చించడానికి వీళ్ళు పిచ్చి వాళ్ళయినా కావాలి, లేకపోతే మనకు తెలియని గేమ్ ఏదో ఆడుతూండాలి."

"అదే....ఏమిటది? వీళ్ళకి వేరే ఉద్దేశ్యాలేమైనా వున్నాయా?"

"నాకొక అనుమానం వుంది, సర్. ఇది మీకు కలిగిందా?"

"ఏమిటది?"

"ఇంతవరకూ వీళ్ళు చేయించిన హత్యల్లో ప్రాణాలు కోల్పోయింది సామాన్యులే. వాళ్ళు ప్రకటించిన తర్వాత మొత్తం తొమ్మిది హత్యలు జరిగాయి. అందులో చిమన్ భాయ్ ఒకడు తప్ప, మిగతా వారంతా సగటు పౌరులే."

"అవును....నిజమే!"

"ఎందుకిలా జరగాలి? ఉన్నత వర్గాల వాళ్ళలో చెడ్డవాళ్ళే లేరా? వాళ్ళుమీద ఉత్తరాలే అందలేదా? మరి చిమన్ భాయ్‌ను తప్ప యెవర్నీ ముట్టుకోలేదెందుకు...."

"ఓహ్, అర్థమైంది మీ పాయింట్!" అన్నాడు

డి.జి.పి. ఉద్రేకంగా, "మీరంటున్నది వాళ్ళు బ్లాక్ మెయిలర్స్ అనా?"

"బ్లాక్ మెయిలర్స్!" లాల్ మెరుస్తున్న కళ్ళతో చూశాడు, "అవును, బ్లాక్ మెయిలర్స్. బ్లాక్ మెయిల్ ఎందుకు చేయకూడదు? సుహాసినిని ఫిగ్ లీఫ్ గా ఉపయోగించుకుంటూ, తమ ఆశయాలు మనకు నమ్మిస్తూ, తద్వారా ఏమీ యిచ్చుకోలేని సామాన్యుల్ని చంపి, ధనికుల్ని భయపెడుతూ డబ్బెందుకు పొందకూడదు వాళ్ళనించి?"

"దటీజ్ కరెక్ట్" అన్నాడు కమీషనర్.

"ఇదే జరుగుతుండాలి!" అన్నాడు డి.జి.పి., "అందుకే ధనికుల హత్యలు కావు. చిమన్ భాయ్ మొండికేసి వుంటాడు, చంపారు. ఇతరులు డబ్బు కంగీకరించి వుంటారు. సుహాసినిని సామాన్యులమీదికి ఉసిగోల్పుతూ ధనికులకి ఆమె భయాన్ని సృష్టిస్తూ డబ్బు గుంజుతున్నారు బెదిరించి. ఇది గుట్టుగా జరుగుతోంది.... ఈ హత్యల్ని మనకు ఎక్స్ ప్లెయిన్ చేయడానికి సుహాసినిని ఫిగ్ లీఫ్ గా ఉపయోగించుకుంటున్నారు ... వాళ్ళు బ్లాక్ మెయిల్ రహస్యం బయటపడకుండా!"

"వెల్, ఇలాగని నమ్మకంగా అనుకోలేం" అన్నాడు లాల్, "అయినా ఈ అభిప్రాయం కూడా ప్రకటించండి. వాళ్ళు తృళ్ళిపడతారు. పైగా ఈ యాంగిల్ ప్రజలు తెలుసుకోవడం అవసరం. అప్పుడెవరైనా వుంటే నిర్భయంగా మనకో ఫోన్ చేస్తారు, ఆ మురతావాత పడ్డ వాళ్ళు."

"ఓ. కే. మధ్యాహ్నానికల్లా యివన్నీ వెల్లడయిపోతాయి...." అని కమీషనర్ ని చూశాడు డి.జి.పి.

అతను తలూపాడు. "మీరు చెప్పినట్టే జరిగితే బహుశ ఈ రాత్రికి సక్సెస్ అవుతాం, మిష్టర్ లాల్."

"అవుతాం" అన్నాడు లాల్ నమ్మకంగా.

"అయితే మీరిప్పుడేం చేస్తున్నారు?"

"నేను...." అంటూ కృష్ణన్ వైపు తిరిగాడు లాల్, "ఇన్స్పెక్టర్, అతనేమయ్యాడు-సుహాసిని అన్న సతీష్? ఎక్కడున్నాడు? ఏం చేస్తున్నాడు? కబురులేదేమిటి?"

కృష్ణన్ తలగోక్కుంటూ, "అతను కన్పించడంలేదు, లాల్" అన్నాడు.

"ఎందుకని?"

"ఏమో!"

"అంటే?"

"తల్లి మృతి తర్వాత చాలా ఎక్సైటెట్ అయ్యాడు, లాల్. అంతటుల్ని అంత మొందిస్తానని శపథం చేశాడు. అది సులభం కాదు, అనవసరంగా ప్రాణాలమీదికి తెచ్చుకోకు అన్నాను. అప్పుడు కోపం తెచ్చుకుని, నన్నవమానపర్చాడు చాలా మాటలతో...."

"ఓహ్, అతనెక్కడున్నాడిప్పుడు?"

"ఏమో, తెలియదు. ఆ రోజు తర్వాత మళ్ళీ కన్పించలేదు."

"నేను తెలుసుకుంటాను. ఇంటికివెళ్ళి చూస్తాను. ఇప్పుడా ఇంట్లో అతనొక్కడు మిగిలాడు. సుహాసిని వున్నా లేనట్టే. అతనికీ దుర్గతి పట్టకూడదు, వుండాలి, వంశ వృద్ధికి...."

సెలవు తీసుకున్నాడు లాల్, లేచి.

"అలాగే....అలాగే, నారాయణ్. ఆ పని నువ్వు వెంటనే పూర్తిచేసేయ్. మిగతావాళ్ళకి ఎగ్జాంపుల్‌గా వుంటుంది....కాస్త జాగ్రత్త, ఇది పట్టపగలు సుమా.... ఓ.కే? గుడ్, త్వరగా వెళ్ళు!"

చెప్పి ఫోన్ పెట్టేశాడు జింబో.

"ఏమిటది, జింబో?" శంభూనాథ్ అడిగాడు.

"నారాయణ్ ఫోన్ చేశాడు. మన గురించి విశ్వేశ్వ రావు కక్కేశాడట!"

"ఎవరు — ఆ చిన్నపిల్లల్ని ఖరాబు చేసే ముస లాడేనా?"

"ఆ వెధవే!"

"ఎలా కక్కేశాడట?"

"ఫోన్ చేశాడట, బాదర్ ఘాట్ పోలీసులకి, రాత్రి తనెలా మోసపోయిందీ, ఎంత డబ్బిచ్చిందీ చెప్పాడట."

"ఓహ్, మన హెచ్చరిక పాటించలేదన్నమాట."

"రేడియోలో పోలీసులు ప్రకటించగానే ఉత్సాహ పడివుంటాడు. పోలీసులకెలా తట్టిందంటావ్, మన వ్యవ హారం?"

"ఎక్కడో వీక్‌పాయింట్ వుంది .... — నువ్వే మన్నావ్?"

"వేడి వేడి మిర్చి తినిపించమన్నాను ముసలాడికి. అందరికీ ఎగ్జాంపుల్‌గా వుంటుంది."

"వెరీగుడ్!" శంభూనాథ్ కిటికీ దగ్గరకెళ్ళి బయట చూడసాగాడు, "అయితే రాత్రి మనం చోటు మార్చా లేమో, జింబో."

"మార్చాలి. అక్కడ పోలీసులుంటారు. మరోచోటు

ఎన్నుకుని వెంటనే పాట్రిన్స్‌కి తెలపాలి!"

"కమాన్ లెట్స్ గో, బాస్ దగ్గరికి."

పక్క గదిలో ఈ మాటలు విన్న జాన్ ఆవేశ పడ్డాడు. పిడికిలితో గోడమీద కొట్టివచ్చి మంచంమీద కూర్చున్నాడు. జరుగుతున్న మోసం అతన్ని ఉద్రిక్తుణ్ణి చేస్తోంది. నిన్నరాత్రి ఇల్లంతా నిర్మానుష్యం అయి పోవడం, కేవలం తలుపువతల ఇద్దరే కాపలా వుండడం అతనికరంగాలేదు. కానీ తర్వాత తిరిగి ఇంట్లో యెప్పటి సందడి ఆరంభమైనప్పుడే తెలిసింది—అసలు కథ—జరుగు తున్న మోసం. వాళ్ళు రాత్రి చాలా డబ్బుతో తిరిగి వచ్చినట్టు వాళ్ళ మాటల్నిబట్టి తెలిసింది—

ఆ తర్వాత వాళ్ళలో కలవరం.

సుహాసిని తిరిగివచ్చి జరిగింది చెప్తోంటే వాళ్ళంతా బెదిరారు.

కానీ తమకిక్కడ ప్రమాదం లేదనిపించి వుంటుంది, ఈ మకాం మార్చలేదు.

ఇప్పట్లో మార్చరు. పోలీసులు తెలుసుకునేట్లు లేరు. ఇక తనవల్లే కావాలి. తను బయటపడితే తప్ప కాదు.

జాన్ పడుకుని బాగా ఆలోచించాడు.

ఇప్పుడు వీళ్ళకేదో ఆపదవచ్చి పడినట్లుంది. రాత్రి డబ్బు కలెక్టు చేసేచోటు మార్చాలనుకుంటున్నారు. మళ్ళీ రాత్రి అంతా వెళ్ళిపోతారు. బయట ఇద్దరే వుంటారు. అప్పుడు చూడాలి అవకాశం.

ఆ ఇద్దర్నీ చిత్తుచేయలేడా?

అతను తీవ్రంగా ఆలోచించసాగాడు....

(ఇంకా వుంది)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును. •



# క్రైమ్‌లో తమాషాలు

## ఎర్రకొండ దొంగ?

ఏ దొంగ వెధవకైనా దొంగతనానికి ముఖ్యంగా చీకటి కావాలి. ఆ తర్వాత పరిస్థితులు అనుకూలించాలి ఆనక దైవం కరుణించాలి. అప్పుడే దొంగతనాలు సవ్యంగా సాగుతాయి. యిది నా విశ్వాసం. నేనూ దొంగనే!

మా వూరికి నాలుగు మైళ్ళ దూరంలో ఓ పెద్ద కొండ వుంది. దాన్ని 'ఎర్రకొండ' అని పిలుస్తాం అందరం. రాత్రి ఏడు దాటితే ఆ ప్రాంతంలో నరసంచారం వుండదు.

అయితే అది నా నివాస స్థలం.

రాత్రి దాదాపు రెండు గంటల ప్రాంతంలో నాకు చిన్నగా కునుకు పట్టే సమయానికి—ఏదో అలికిడి విన్పించింది. వులిక్కిపడి కనులు తెరచి చూశాను.

ఎవరో యిద్దరు నెమ్మదిగా పైకెక్కుతున్నారు.

నా గుండెల్లో వేటకుక్కలు పరిగెత్తాయి. కొంపదీసి... వీళ్ళు.... పోలీసులు కారుగదా! నన్ను పట్టడం కోసం నియమించబడిన పి.ఐ.డీ.లు కారుగదా!!

కాసేపట్లోనే తెల్సిపోయింది వాళ్ళూ నాలాంటి దొంగ వెధవలేనని....! మావూరి పక్కూళ్ళో యిద్దరూ కంబైండుగా దొంగతనం చేశారు.

యింకేం? నాకు పండగ!! నెమ్మదిగా దిగాను.

చుట్టూ చీకటి. అమావాస్య. ఆకాశంలో చుక్కల్లేవు. కొండరాళ్ళనీ ముళ్ళపొదల్నీ చాటు చేసుకుంటూ వాళ్ళని

దాటుకొని కొంత క్రింది భాగాని కొచ్చేశాను, చేతిలోని వస్తువుని జాగ్రత్తగా పట్టుకొని.

వాళ్ళు నన్ను గమనించలేదు.

వాళ్ళు పంచుకోవటంలో మునిగిపోయారు.

"యిదుగో, సమానంగా పంచుకుందాం. నగదులో సగం పన్నెండున్నర వేలు తీసుకో. గాలి వీస్తోంది. గట్టిగా పట్టుకో" అన్నాడు పెద్దదొంగ, మందంగా వెలిగే టార్చిని వెలిగిస్తూ.

చిట్టిదొంగ పైకాన్ని జేబులో దోపుకున్నాడు.

"పోతే ఆభరణాలోయ్....ఓ నెక్లెసూ, రెండు పొరల దండలు, రెండూ మూడు వంకీ వుంగరాలూ, ఓ ఎర్ర రాయి వుంగరం. యివి ఎలా పంచుకుందాం?" పెద్దదొంగ, చి.దొం. ని అడిగాడు.

"గురూ! నెక్లెస్ నా కివ్వు. మిగతవన్నీ నువ్ తీస్కో. లేదా నెక్లెసే నువ్ తీస్కో. మిగతవి నావి" అన్నాడు చి.దొం.

అక్కడొచ్చింది దొంగ వెధవ లిద్దరికీ పేచీ. నాకంటే నాకనుకున్నారు. పెద్దవాడు నేను అయిడియా యిచ్చా నన్నాడు. చిన్నవాడు నేను లోపలమారి తెచ్చానన్నాడు. పెద్దవాడు నేను కాపలా వున్నానన్నాడు. చిన్నవాడు నేను లోపలివాళ్ళ కళ్ళుగప్పా నన్నాడు. పెద్దవాడు నేను గురువు నన్నాడు. చిన్నవాడు మొదట బుంగమూతిపెట్టి శిష్యుణ్నయి నంత మాత్రాన గురువు కేమాత్రం తీసిపోలేదన్నాడు.

....వున్నట్టుండి యిద్దరూ వులిక్కిపడ్డారు.

దూరాన పోలీసుజీపు పెద్దగా సైరను మోగించుకుంటూ వస్తోంది. దొంగవెధవలు పారిపోతారని హెడ్‌లైట్లు ఆఫ్ చేశారు.

పాపం వాళ్ళిద్దరూ బెంబేలుపడిపోయారు. ఒక్క వుదు

టున లేచి యిద్దరూ పరుగులంకించుకున్నారు.

"దొంగ.... దొంగలు.... పారిపోతున్నారు. పట్టుకోండి. ఏయ్ టూనాట్ పిక్స్.... నువ్విటు పరిగెత్తు ఫోర్‌నాట్ వన్.... నువ్వీవైపు.... ఏయ్.... ఆగు. కదిలావా కాల్చే స్తాను.... డిష్యూం."

పోలీసు సబిన్‌స్పెక్టరు అరుస్తున్నాడు. కానిస్టేబుల్సు పరిగెడుతోన్నట్టుగా బూట్ల చప్పుళ్ళు వినవస్తున్నాయి.

దొంగ వెధవ లిద్దరూ బతికుంటే బలుసాకు తినొచ్చను కుంటూ దెబ్బలు తగుల్తున్నా లెక్కచెయ్యక పాకుతూ దేకుతూ దొర్లుతూ పడుతూ లేస్తూ పారిపోయారు.

నవ్వుకున్నాను. గట్టిగా నవ్వుకున్నాను. తెరలు తెర లుగా నవ్వుకున్నాను. నెమ్మదిగా టార్చిలైటు సహాయంతో యిందాక ఆ 'దొంగ వెధవ' లిద్దరూ కూచున్న స్పాట్‌ని చేరుకొని కాస్త యిటూ అటూగా చూశాను.

నా కళ్ళు మెరిశాయి!! నా గుండె ఝల్లుమంది!!! నా అదృష్టం పండింది!!!!

ఆ నగదులో చిట్టిదొంగ జేబులో పెట్టుకున్న పన్నెండు న్నర వేలు నగదు మినహా మిగత నగలూ అన్నీ అక్కడే పడున్నాయి!!!

అన్నిట్నీ ఏరుకొని వెడల్పాటి కర్చీఫ్‌లో మూటకట్టాను.

గర్వంగా కొండ దిగాను. నేనిందాక వచ్చిన చోట చెయ్యి పెట్టాను. నా వస్తువు నా చేతికి తగిలింది. తృప్తిగా అందుకొని ప్రేమగా ముద్దు పెట్టుకున్నాను.

అది.... టేప్‌రికార్డర్!!

యిందాక పోలీసు వ్యానూ సైరనూ టూనాట్ పిక్సూ ఫోర్‌నాట్ వన్నూ ఎస్సై గొంతూ పిపీల బూట్ల చప్పుళ్లూ- అన్నీ అందులోంచి వచ్చినవే!!

యిక యిక్కడుండటం మంచిదిగాదు. యిందాకటి దొంగ వెధవలు మళ్ళీ వచ్చినా రావచ్చు ఈలోగా యిక్కణ్నుంచి వెళ్ళిపోవడం మంచిది.

తెల్లారేలోగా ఏ బొంబేకో మద్రాసో్కి వెళ్ళిపోవాలి. ఓ నెల్దాకా రాకూడదు. జామ్మని చూడాల్సిన వన్నీ చూసేసి చెయ్యాల్సిన జల్సాలన్నీ చేసేసి ఆఖర్న — ఓ వంద మిగిలిందన్నప్పుడు మళ్ళీ సరికొత్త ప్రయోగాలు చెయ్యాలి.

టైమ్ చూసుకున్నాను. నాలుగున్నర కావచ్చింది. యింకో గంటలో తెల్లారిపోతుంది. ఎండాకాలం కదా! ఎవరేనా చూస్తే ప్రమాదం! జేబుల్నిండా నగలున్నాయ్‌గా మరి....?! కొండ దిగాను.

హుషారుగా ఈల వేసుకుంటూ రోడ్డుమీద కాలు మోపాను....అంతే....

బిలబిలమంటూ పోలీసులు చుట్టుముట్టేశారు.

బిత్తరపోయాను....

సింహప్పిల్లిలా వున్న సబిన్స్‌పెక్టర్ జీపు దిగాడు.

"అరెస్ట్‌హిమ్...." అంటూ అర్చాడు తన సిబ్బందితో.

"సార్....చల్లగాలికి సిటీకి నడిచిపోతున్నాను .... అంతే" తడబాటులో ఏం మాట్లాడాలో తోచలేదునాకు.

"షటప్....స్టుపిడ్....యిందాకే సిటీలో ఓ కేసుగురించి దర్యాప్తు చేసుగించుకొని హెడ్‌లైట్సు వెలక్కపోయినా బండి ట్రబులిస్తోన్నా అర్జంటు పనిమీద వెడుతున్నాం. యిక్కడి కొచ్చేసరికి మరో పోలీసుజీపు శబ్దమూ సైరనూ వగైరాలు విన్పించాయి. క్యూరియాసిటీతో వెయిట్ చేశాం. బూత్రీ ఫోర్....వీణ్ని జీపులో వెయ్యండి...." అన్నాడు ఎస్సై.

నా కళ్ళముందు కటకటాలు మెదుల్తున్నాయిప్పుడు....

— కె.బి.ఎస్. కుమార్.

